# విమర్శిని

పరిశోధన పత్రిక

**6 & 7**

Complimentary


జనవరి **1981 & 1982**

తెలుగు విభాగము

కాకతీయ విశ్వవిద్యాలయము
విద్యారణ్యపురి : వరంగల్లు.

# VIMARSINI

ANNUAL RESEARCH JOURNAL

NUMBER SIX & SEVEN January 1981 & 1982

*Editor*

**Dr. K. V. RAMAKOTI SASTRY**

Head, Department of Telugu

KAKATIYA UNIVERSITY

Vidyaranyapuri, WARANGAL - 506 009 - India.



*Associate Editor*

Dr. H. SIVAKUMAR

PRICE : Rs 10/-

*This has been published with the aid of the Research grant sanctioned to the Telugu Department, K. U. for the year 1977-79*

Printed at Venkataramana Mudranalayam, J. P. N. Road, Warangal - 506 002. Phone : 3970

# విమర్శిని

విరచించు శక్తిపుట్టని పురుషుని చదువులు ప్రకాశములు కావు.

## ఆరు & ఏడు సంచికలు : జనవరి 1981-1982

ఒకటి అధ్యాపనం, రెండు అధ్యయనం. విశ్వవిద్యాలయ అధ్యాపకవృత్తికి ఈ రెండూ రెండు ముఖాలు. అయితే వీటిమధ్య అంతర్గతంగా గతితర్కమొకటుంది. అంటే ఒకదానితో ఒకటి అవినాభావంగా సంబంధించి ఒకదానివల్ల ఒకటి తాను మారుతూ మారుస్తూ అభివృద్ధి చెందే లక్షణమన్న మాట. అధ్యయనం ఎప్పుడూ పుట్టి పెరగటానికి శక్తిగల ప్రయోజనకారులయిన కొత్త విలువల కొరకూ, కాలపరిపక్వతనుబట్టి రానున్న సరికొత్త విలువలకొరకూ ఆహ్వానంగానూ అన్వేషణగానూ ఉండి అధ్యాపనానికి ఉత్తేజకరమైన సజీవ వాతావరణాన్ని సమకూరుస్తూ వుంటుంది. సజీవమైన అధ్యాపనం గుణాత్మక పరిణామాస్పదమై అధ్యయనాన్ని అభ్యుదయ పథంలో అభివృద్ధిపరుస్తుంది. ఈ రకమైన అధ్యయనాన్నే విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధన అంటున్నాం

విశ్వవిద్యాలయ అధ్యాపకుల అధ్యయన పరిశోధన ఫలితాలు సలక్షణ పరీక్షలకు గురికావటానికి అవి పదిమందికీ అందుబాటులో వుండాలి. అంటే ప్రచురింపబడాలి. ప్రాంతీయతా లక్షణంచేత పరిమితం కావటంవల్ల తెలుగుభాషా సాహిత్య పరిశోధన ఫలితాలకు ప్రచురణావకాశాలు చాలా తక్కువ. అందువల్ల జీర్ణమంగే సుభాషితం కాకుండా చూచుకోటం కొరకు కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం 1976 లో పీ. జీ. సెంటరుగా వున్నప్పుడే తెలుగు అధ్యాపకుల పరిశోధన కృషి విశేషాలతో సంవత్సరానికొకసారిగా విమర్శిని పత్రిక ప్రచురణ ప్రారంభించింది. అప్పటినుండి ఈ 1982 దాకా ఏడు సంవత్సరాల మీద, సంవత్సరానికి తెలుగు విభాగానికి విశ్వవిద్యాలయం కేటాయించిన పరిశోధన కార్యక్రమ నిధితో, ఆరు సంచికలను ప్రచురించటం జరిగింది. వివిధ విషయ వాహినిగావున్న అయిదవ సంచికను మినహాయిస్తే— మొదటిది నవ్య— భావ— అభ్యుదయ— కవితా దృక్పథ విమర్శనం. మూడవది తెలుగు నవలా వికాస విమర్శనం. రెండూ నాలుగూ వరుసగా విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచికగా రాయప్రోలు వాఙ్మయ జీవిత విశేష సంచికగా వచ్చాయి. ఈ ఆరవది (6 & 7) పోతన వాఙ్మయ జీవిత విశేష సంచిక.

తెలుగు విభాగంలో పనిచేస్తున్న అధ్యాపకులు తమ పరిశోధన కార్యక్రమా లను కొనసాగించటానికి డబ్బు కావలసిరావటం చేత ఇంతవరకూవున్న పరిశోధన నిర్వహణ నిధిని పూర్తిగా అధ్యాపకు లుపయోగించుకోటం తప్పనిసరి అయింది. అధ్యాపకుల సంఖ్య కూడా పెరుగుతున్నది. అందువల్ల విమర్శిని పత్రికను యథా పూర్వంగా ఇకముందు ప్రచురించటానికి విశ్వవిద్యాలయం ప్రచురణనిధిని ప్రత్యేకించి కేటాయించవలసి వుంది. తెలుగు అధ్యాపకుల పరిశోధన స్తోమతను నిలబెట్టటానికీ కాకతీయ విశ్వవిద్యాలయం అధికారులు ముఖ్యంగా ఉపాధ్యక్షులు ఆచార్య టి. వాసుదేవు గారు తప్పకుండా దోహదం చేస్తారని విశ్వసిస్తున్నాం.

కారణాంతరాల చేత రాని 1981 జనవరి సంచికను కూడా కలుపుకొని 1982 జనవరి విమర్శిని పత్రికను విస్తృత ప్రాతిపదికమీద పోతన వాఙ్మయ జీవితవిశేష సంచికగా సంసిద్ధం చేయాలని అనుకొన్నాం— కానీ, కాలమాన పరిస్థితులు అంత మంచిగా కలసిరాకపోవటం చేత ఇంత మాత్రంగానే దీన్నిప్పుడు వెలువరిస్తున్నాం.

ఎప్పుడూ ఇప్పుడుగానే ఉండదనీ మంచికాలం రహిస్తుందనీ పడవ తీరం క్రిస్తుందనీ నమ్ముతూ యథావకాశంగా ప్రచురించిన ఈ పోతన సంచికను అధ్యయనపరులకు అందిస్తున్నాం.

---

# విషయసూచిక

—)○(—

# పోతన్నగారి వైచిత్రి

కేతవరపు రామకోటిశాస్త్రి

## I

### 1. పోతన భగవద్భక్తుడు

పోతన్నగారు శైవకుటుంబంలో పుట్టాడు. తండ్రి కేసన్న శైవశాస్త్ర మతము గనియెననగా దీక్షను స్వీకరించినవాడని చెప్పవచ్చునేమో;[1] తల్లి లక్కమాంబ సదాశివ పాదయుగార్చన పరురాలు. అన్నగారు తిప్పన్న ఈశ్వర సేవాకాముడు. గోదావరి గంగలో చంద్రగ్రహణ స్నానం చేసి ఇసుక తిన్నెలమీద మహేశ్వర ధ్యానమగ్నుడైనాడు పోతన. ఆ ధ్యానమగ్నతలో తనకు గోచరించిన భద్రమూర్తిని రాజశేఖరుడని మాట్లాడబోగా ఆయన నేను రామభద్రుడనని పోతన్నగారికి చెప్పుకొన్నాడు— ఈ విషయాలన్నీ భాగవతారికలో పోతన్న వ్రాసిపెట్టినవే. ఇవన్నీ కూడా వర్ణాశ్రమాచార ధర్మావలంబకులయిన శివార్చనాపరులయిన సాధారణ స్మార్త బ్రాహ్మణ కుటుంబమే పోతనగారిది అన్నంతకంటె ఎక్కువగా ఏమీ చెప్పటంలేదు. శివదీక్ష అంటే ఏమిటి మరి? పోతన్నగారి మాట అలావుంచినా వాళ్ళ నాన్నగారి విషయంలో ఆ మాట తప్పనిసరిగా అర్థవంతమై వుంటుంది. దాని ప్రభావమే వీరభద్ర విజయం కావచ్చు. అయినా భాగవతంలో చెప్పిన దాన్నిబట్టి పోతన్నగారిది ఉపనయన సంస్కారమూ లింగధారణముగల మార్గశైవ ఆరాధ్య నియోగి బ్రాహ్మణ కుటుంబమని కూడా గట్టిగా చెప్పలేం — రాజశేఖరుడు కనిపించి నేను రామభద్రుణ్ణి అని చెప్పటానికి ముందు చాలాకాలం నుండే తనకు శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలమున్నదంటున్నాడు పోతన. అందువల్ల భాగవత పోతన విషయంలో శైవుడా వైష్ణవుడా అన్న సమస్యలేదు. ఆయన భగవద్భక్తుడు. భాగవతోత్తముడు. భగవంతు డెవరన్న దానిమీద ఆయన భాగవత తత్వమాధార పడివుంది. శివుడైతే శివభాగవతుడు— విష్ణువైతే విష్ణుభాగవతుడు— భగవతీశక్తి

---

1. చెప్పుట యుచితముకాదు— ధూళిపాళ శ్రీరామమూర్తి, భాగవతానుశీలనము. పు.73

అయితే ఆయన శాక్తేయ భాగవతుడు. పోతన్నగారెంత అద్వైతియో అంతకంటె ఎక్కువ విశిష్టాద్వైతి.[1]– అంతశ్శాక్తా బహిశ్శైవా జనమధ్యేతు వైష్ణవాః.

అయితే పోతన పుట్టడమే ఈలాగా పుట్టాడని చెప్పకూడదు. మతతాత్త్వికభావాలన్నీ దేశకాలపరిస్థితులూ, జీవిత గమనంలోని ఒడుదుడుకులనూ, వయస్సులో వచ్చే పరిణతినీ అనుకూలంగానూ ప్రతికూలంగానూ ప్రతిఫలించే మానవ మేధస్సు వల్ల కల్పితమైన భావజాలంలోని అంశాలు. వాటి ప్రభావంతోటి మనుషులు మనుషుల ప్రభావంతోటి అవ్వీ పునరపి జననం పునఃపి మరణంగా అభివృద్ధి పథంలో కృషి చేసిన ప్రయాణమే తరువాతికాలం వారికి సంప్రదాయ సంపదగా సంక్రమిస్తుంది. దాంతో వాళ్ళు ప్రయాణం చేస్తారు. ఇలా ఎడతెగని లోకయాత్ర ముందు వెనుకలుగా అందరూ నడువక తప్పదు. కానీ అంతా ఒకమాదిరిగానే నడువరు. పోతన్నగారి తండ్రి శైవుడు, అన్న శైవుడు అంటే వాళ్ళు– చచ్చినదాకా శైవులు. పోతన్న శైవుడా అంటే కాదనటానికి వీల్లేదు. వీరభద్ర విజయం వ్రాశాడుకదా! అయితే శైవుడన్నమాటేనా అంటేకాదు. నారాయణ శతకం, భాగవతం వ్రాశాడు. ఆలాగని విష్ణుభక్తుడని ఒప్పుకున్నా మంత్రోపదేశాన్నిపొంది సుదర్శన శంఖ చిహ్నాలను ధరించిన వైష్ణవుడని చెప్పలేము. శివకేశవోభయ నాథాత్మకమైన పరతత్త్వ ప్రబోధము కలవాడని మాత్రమే చెప్పగలం. ఇదంతా తిక్కన్నగారి మతస్థాయిని దాటిన ఆ కాలపు తాత్త్విక దృక్పథ ప్రభావం. శైవులకు శివుడే కనిపిస్తాడు వైష్ణవులకు విష్ణువే కనిపిస్తాడు. తిక్కన్నగారికి ఇద్దరూ కనిపిస్తారు ఒకటిగానే. అందుకే ఆయనది ధర్మాద్వైత తాత్త్విక దృక్పథం. మరి పోతన్న తిక్కన్నగారి మార్గం వాడా అంటే కాడు. పోతన్నగారికి శ్రీమహావిష్ణువు నందు మొగ్గున్నది. బహుశః ఆయనకు కూడా ఆ విషయం తెలిసివుండక పోవచ్చు. ఆ మొగ్గు లక్షణమే మహేశ్వర ధ్యాన ఫలితంగా కనిపించిన దైవం నేను రామభద్రుణ్ణయ్యా అని చెప్పటం నిజమే కాని– ఏ గుణగణ ధ్యానం చేస్తే తదనుగుణంగా ధ్యాన గోచరమూర్తిని ధరించి ప్రత్యక్షం కావలసిన భగవంతుడు మరొక రకంగా ప్రవర్తిస్తున్నాడు.

---

1. భాగవతంలోని విశిష్టాద్వైతానికంతటికీ వెలిగందల నారాయణ కారణమని ధూళిపాళ శ్రీరామమూర్తి గారంటారు. చూ. భాగవతానుశీలనము.

శివధ్యానానికి కూడా ఫలప్రదాతగా ఆజ్ఞలిచ్చి అనుగ్రహించే వాడుగా రామభద్రుడు రావటం విష్ణుపారమ్యానికి సూచనకాదా! పోతన్నగారి జీవితంలో ఇదొక పరిణామం. జీవించ గలిగినవాడే పరిణమించగలడు. శివ పారమ్యాన్నికాక విష్ణు పారమ్యాన్ని సూచించటం మంచి పరిణామమా? అనకూడదు. అంతకంటె విస్తృతంగా పరిణమించటానికి దోహదం చేసే పరిస్థితుల విస్తృతి లేనికాలంలో పరిణామం అటో ఇటో వుండక మరొక రకంగా ఎలా వుంటుంది? అయితే పోతన్నగారి విష్ణు పారమ్యాభిముఖమైన పరిణామం ఊర్ధ్వగతికమా? అధోగతికమా? అంటే ఆ పదిహేనవ శతాబ్దము పూర్వ చారిత్రక పరిస్థితులలో అది నిస్సందేహంగా ఊర్ధ్వగతికం. అది అప్పటి మతతాత్విక భావాల స్థితిగతుల్లో సలక్షణమైన అభ్యుదయ పరిణామం.

ఈ భాగవత వైష్ణవం కంటె తెలుగు దేశంలో చాలాకాలం ముందునుండి వీర శైవమత ధోరణి ఎక్కువగా వుండేది. జైన బౌద్ధాలతో దానికున్న విరోధభావాన్ని అలా వుంచితే అద్వైతులతోనూ, పాంచరాత్ర వ్రతులతోనూ, అధ్యాత్మవాదులతోనూ; అందరితోనూ విరోధించినా వైదిక బ్రాహ్మణ మతంలోని వర్ణాశ్రమాచార నియతిని[1]— జన్మచేత వచ్చే సాంఘిక గౌరవ లాభంలోని దుర్మార్గాన్ని— తీవ్రంగా ఎదుర్కొన్న కారణంగా ఆ విషయంలో ఆ కాలంలో వీరశైవం సంస్కరణ రూపమైన అభ్యుదయ పాత్రను నిర్వహించనట్లే.

కర్మదృష్టులఁ జూడగా కులభ్రాంతి
ధర్మంబయై తోచు తత్త్వోక్తి శైవ
ధర్మ దృష్టులజూడ తత్కులభ్రాంతి
ధర్మేతరం బసద్ధర్మమై తోచు.[2]

ఇంతవరకూ బాగానేవున్నది. శివుడుగాక మరొక దైవం గురించిన మాటను సహించకపోవటం, వాళ్ళందరినీ శివద్రోహులని చంపటం, చంపించటం[3] మొదలయిన అమానుష లక్షణాలు కూడా అక్కడ కొన్ని ఉన్నాయి. అందువల్లనే అది

---

1. డా॥ ప్రసాదరాయ కులపతి— ఆంధ్ర భాగవత విమర్శ. పు. 49.
2. పండితారాధ్య చరిత్ర (1939) దీక్షా ప్రకరణం. పు. 151. 52
3. „ „ మహిమ ప్రకరణం. పు. 17. పాద్ర. 711.

క్రమంగా ప్రజల ఆమోదాన్ని కోల్పోయింది. తమ వీరశైవమత వ్యాప్తికోసం చేసే హింస హింసకాదనే సిద్ధాంతాన్ని[1] పట్టుకొని వీరులు విజృంభించటం చేత దాని వ్యాప్తి తగ్గింది. వీరశైవంలో వున్న ఆ గుణాన్నీ ఈ దోషాన్నీ గుర్తించి, విష్ణు హీనతను శైవులుద్ఘాటించినట్లుగా శివుని హీనతను బాహాటంగా ప్రదర్శించటం మాని అతణ్ణి మంచి విష్ణు భక్తుడుగా ప్రదర్శిస్తూ శైవాన్ని త్రోసి రాజన్నది వైష్ణవం. పోతన్నగారా శైవం నుండి ఈ వైష్ణవానికి పరిణామం చెందాడు. పోతన్నగారు పాల్కురికి సోమనాథుని జీవితం నుండి, ఆయన వాఙ్మయం నుండి నేర్చుకొన్నది చాలా వున్నది. సోమనాథుడే సాహిత్యాన్ని, పూర్తిగా మతప్రచార ప్రయోజనాన్ని ఆశించి, రచించిన మొదటి తెలుగు కవి.[2] పోతన్నగారు సోమనాథుని తిరగవేసి మత ప్రచారంతో సాహిత్య సౌరభాన్ని సృష్టించాడు. భాగవతంలోని భక్తిశృంగార రచనా వైదగ్ధ్యానికి పాల్కురికి సోమనాథుని రచనలే కారణాలు ఉద్బోధకాలు కూడా.

---

1. పండితారాధ్య చరిత్ర ఉపోద్ఘాతము. పు. 325. "వారు శాస్త్రముకంటె శస్త్రమునే ఎక్కువగా ఆధారము చేసికొనిరి" డా॥ ప్రసాదరాయ కులపతి.

ఆంధ్ర భాగవత విమర్శ. పు. 45.

2. 'Though rigidly sectarian in character and narrow in its scope'. — G. Yazdani - The Early History of The Deccan (1960) Parts VII - XI. Page. 700.

## I. 2. పోతన నివాస స్థల వివాదం

పోతన్న ఒంటిమిట్ట వాడన్న ఊహ కలిగింది పురాణం హయగ్రీవ శాస్త్రి గారికి. భాగవతములో పోతన పేర్కొన్న ఏకశిలా నగరమే (1-21.) ఆయన స్వగ్రామము అని చెప్పి పుట అడుగున దానికి ప్రతినామము ఒంటిమిట్ట అనీ అది కడపకు దక్షిణంగా దగ్గర్లో వున్నదనీ సూచన వ్రాశారు. హయగ్రీవ శాస్త్రిగారి ఆ సూచన పునాదిమీదనే పోతన నివాస స్థలవివాద మాయాసౌధం లేచింది. ప్రముఖంగా ఇందులో పాల్గొన్న వారు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, జయంతి రామయ్య పంతులుగారు, వావిలికొలను సుబ్బారావుగారు. వీరేశలింగం పంతులుగారు మొదట కొన్నాళ్ళు,- 1915 లో జయంతి రామయ్య పంతులుగారు ఏకశిలా నగరమనగా అది ఓరుగల్లుగాని కడపజిల్లా ఒంటిమిట్ట కాదని వ్రాసినదాకా- పోతన కడప ఒంటిమిట్ట వాడనియే వ్రాసి- ఆ తరువాత తమ అభిప్రాయమును మార్చుకొన్నారు సుబ్బారావు గారు ఒంటిమిట్ట వాదముగానీ, రామయ్య పంతులుగారు ఓరుగల్లు వాదమునుగానీ ఎప్పుడూ వదలుకోలేదు. మిగిలిన మధ్యవర్తులుగా ఉభయులకూ అభిప్రాయాలు వ్రాసి ఇచ్చిన మద్దతుదార్లలో విజయనగరం గాడేపల్లి అనంతరామమూర్తిగారొక్కరే ఓరుగల్లు పక్షం నుండి ఒంటిమిట్టు పక్షానికి మారింది.[1]

ఓరుగల్లు వాదానికి నాయకులయిన రామయ్య పంతులుగారు తమ వాదాన్ని బలపరచే తెలిసిన ప్రాంతీయులయిన పెద్దల అభిప్రాయాలను సేకరించి తమ వ్యాసానికి అనుబంధంగా ఇచ్చారు. ఈ పద్ధతినే వావిలికొలను సుబ్బారావుగారు కూడా అనుసరించారు.

జయంతి రామయ్య పంతులుగారికి 'బమ్మెర పోతన నివాసస్థానానికి సంబంధించిన ప్రబలాధారాలను' రమణాచార్యుల వారు ఇచ్చారు.[2] అంటే తెలంగాణా- బమ్మెర- ప్రాంతీయులయిన పెద్దల అభిప్రాయాలను సేకరించి పంపివుంటారు. ఆ విషయాన్ని ఆయా అభిప్రాయ పత్రాలకింద "పత్రము వ్రాత వెంకటరమణాచార్యులు గారిది" అని ఇయ్యటంవల్లా, "ఈ నెల్లుట్ల వెంకటపాపయ్య అనువారు ప్రస్తుత గ్రామమగు బమ్మెరకు అధికారులు. వీరు దౌహిత్ర సంప్రదాయమున నీ యాస్తికి కామందులైరి. వీరి తాతగారు వీరి బాల్యమందు గతించినందున పోతరాజును గూర్చి విశేషములు కథలు తెలియవుగాని పోతరాజు తప్పక తమ వంశీకుడని చెప్పుచున్నారు"

1. తరువాత కాలంలో మంత్రి ప్రగడ భుజంగరావుగారు కూడా మారారు. చూ: A History of Telugu literature. (Heritage of India Series) P. 63

2. కోవెల సంపత్కుమారాచార్య- మన పండితులు కవులు రచయితలు (1970)పు. 95.

అని వ్రాసి. దూ.తి వెంకటరమణాచార్యులు— అని ఆచార్యులుగారు సంతకం చేస్తే సంతకంతో సహా కోట్‌చేయటం వల్లా రామయ్య పంతులుగారు పేర్లొనే ఉన్నారు.

అసలు రామయ్య పంతులుగారు 1914 డిసెంబరు నెలలో వరంగల్లు వచ్చి యేడెనిమిది రోజులుండి, పోతన నివాసస్థల వివరాల ఆచూకీలు తీసి, ఆ తరువాత శేషాద్రి రమణకవులలోని రమణాచార్యుల వారివల్ల కొన్ని సాక్ష్యాధారాలు సంపాదించి పోతన ఓరుగల్లు- బమ్మెర- ప్రాంతం వాడని సిద్ధాంత వ్యాసం వ్రాసి ప్రకటింప వలసిన అవసరం గురించి కూడా మనమాలోచించాలి. అంతవరకు గతానుగతికముగా ఆయనకూడా ఒంటిమిట్ట వాదమును అంగీకరించి వున్నవాడే. అయితే రామయ్య పంతులు గారిలో ఈ పోతన నివాసస్థల విషయం గురించి పునరాలోచించవలసిన అవసరాన్ని ప్రేరేపించిన అంశం ఏమిటి? ఏమిటంటే బహుశః 1913 వ సంవత్సరం ఆగస్టు 27 వ తేదీ హిందూ దినపత్రికలో వచ్చిన పి. కేశవపిళ్లెగారి పోతన గురించిన వ్యాసమూ దాని పర్యవసానమూ కావచ్చు. వ్యాసాంశాలు చూస్తే తెలుస్తుంది.[1]

అసలు సంగతి ఏమిటంటే ఏకశిలా నగరంలో భాగవత రచన కుపక్రమించానని పోతన్నగారు చెప్పుకోటంచేత ఏకశిలానగర మేదైతే అదే పోతన్నగారి స్వగ్రామమో కాక నివాసస్థలమో అవుతుంది. ఏకశిలా నగరమంటే కడపజిల్లా ఒంటిమిట్ట కావచ్చునన్న హయగ్రీవ శాస్త్రిగారి మాటను పట్టుకొని ఒక వాదమూ, వరంగల్లే ఏకశిలా నగరమని మరొకవాదమూ— బయలుదేరాయి. ఇరుపక్షాలవారూ తమకు ప్రమాణము లనిపించిన ఆధారాలనుబట్టి పోతన యే ఊరివాడనుట యుక్తమని పించినదో ఆ యూరివాడని నిర్ధారణచేసి వ్రాసే ప్రయత్నం శక్తివంచనలేకుండా చేశారు. దీనంతటికీ మూలం కేశవపిళ్లెగారి వ్యాసం.

1. కేశవపిళ్లెగారి వ్యాసంకొరకు హిందూపత్రిక సంపాదకులకు వ్రాస్తే 16-2-1982న లేఖద్వారా "As we do not preserve back copies of The Hindu for sale for more than six months and further as the Hindu files prior to 1940 are unfit for handling, we regret we are unable to be of help to you"- అని తెలియజేశారు. అందువల్ల వ్యాసాంశాలను వావిలికొలను సుబ్బారావుగారు 1917, ఏప్రిల్, 8న కడపలో చదివిన 'ఒంటిమిట్ట పోతనామాత్యుడు' అనే వ్యాసం నుండి గ్రహించి కోట్ చేస్తున్నాను.

# POTANA

## THE CELEBRATED TELUGU BARD

By Mr. P. KESAVAPILLAI - THE HINDU 27-8-1913

Bommara Potharaju or Potana, as he is popularly known, lived some six centuries ago, at Wontimitta in Cuddapha District, and sang his immortal and sweet poem... Not only the Telugu world, but the whole Hindu race has reason to be thankful for the spiritual flame he has lit amidst men .. Pothana stands in the foremost ranks of selfless Hindu saints who loved man and realised God.—

The ancient temple has a sanctity, but it attracts crowds only during festivals. The Avatar of God as Sri Rama is the presiding deity with his Sita and his inseparable brother. The Divine trio are made out of one single stone and the temple is, therefore, named as of Ekasila. The Bhakta that added glory to the temple was Potana and his history is asked and told with varying interest and with more or less details.—

And our Potana tended cattle as a boy, and was content with the hard labour of a peasant all the rest of his life. He was, indeed, a true democrat, and he refused to acquire competence by dedicating his lofty theme of Sri Krisna's sublime LILA to any man on throne or in palace. And he resided in the latter part of his long life in a cave within a furlong from the village. The hillock is there by the side of a road, and the fountain which supplied his wants, still runs; but the cave was demolished to make elbow room for a structure, intended to serve as a resting place for the God of the temple when the festival comes round.—

Mr. J. F. Bryant, Collector of Cuddapah, paid a flying visit to the temple, made enquiries about Potana's abode and was shown the spot where the cave was, and I had the privilage to be there with him through his courtesy. The demolition of a saint- poet's abode, struck the countryman of Shakespeare as a

sacrilege and the neglected state of the sacred fountain appeared to be sinful to the Hindu mind...[1]

దీని పర్యవసానం- కలెక్టరు వచ్చి చూచిపోయినాడు. అక్కడి తీర్థాన్నీ- స్నానఘట్టాన్నీ పరిసరాలనూ పోతన్న మహాకవి పేరుమీద మరమ్మత్తులు చేయించ టానికి ప్రభుత్వం పక్షాన కొంత డబ్బును ఆయన కేటాయించాడు. ఈ సంగతి వార్త లుగా పత్రికల్లో వచ్చి వుంటుంది. అదిచూచి అంత ధనాన్ని వ్యయం చేసి అది బాగుచేయవలసిన స్థలంగానీ తీర్థంగానీ కాదు. అక్కడ పోతన్న నివసించనూ లేదు పెట్టనూలేదు అని ఎవరోపత్రికల్లో వ్రాశారు.[2]

అంటే కేశవపిళ్లగారి వ్యాసం పోతన్న ఒంటిమిట్టవాడని పునరుద్ఘాటించి ప్రభుత్వ ఆమోదాన్నీ ఆర్థిక సహాయాన్నీ కూడా సంపాదించగా, పోతన అక్కడి వాడు కాదనీ అందువల్ల ఆయన అక్కడ వున్నాడనీ, స్నానం చేశాడనీ ఆయా స్థలాలను ప్రభుత్వధనం పెట్టి బాగుచేయ నక్కరలేదనీ చేస్తే నిజంగా పోతన నివాస స్థలంలో చేయటం మంచిదనీ ఎదురు వ్రాసినవాళ్లు వ్రాసివుంటారు. వీళ్ళ వ్రాతలు పట్టించుకోకుండా ఒంటిమిట్ట కోదండరామస్వామి ఆలయ పరిసరాల్లో ప్రభుత్వం తాననుకొన్నంత వరకు పనిచేయించింది.- ఈ పత్రికల్లో నడచిన పోతన ఒంటిమిట్ట వాడు అవునూ కాదు అన్నవివాదం, ఇన్నాళ్లనుండి ఒంటిమిట్ట వాడుగానే పోతన్నను గూర్చి అనుకొంటున్న రామయ్య పంతులుగారిలో నిజమేమిటో తెలిసికోవాలన్న ఒక అవసరాన్ని ప్రేరేపించి వుంటుంది. అది కారణంగానే ఆయన 1914 డిసెంబరులో కావాలని వరంగల్లు వచ్చివుంటారు. హిందూ పత్రికలో వచ్చిన పిళ్లైగారి ఒక వ్యాసం పర్యవసానం ఇంతగా వుంటుందా అంటే వుండవచ్చు. ఉండకూడదని ఎక్కడున్నది? అనే చెప్పాలి. అన్ని విషయాల్లోలాగానే పోతన్నగారి విషయం లోనూ రాజకీయ స్పర్శవుంది- లేకపోలేదు.

1. వావిలికొలను సుబ్బారావుగారు కోట్ (Quote) చేసింది- చూ. బమ్మెర పోతన నికేతన చర్చ. పుటలు. 49, 50.
2. "ఓరుగంటి వాడుఱ వ్రాసిరి" అని వావిలికొలను సుబ్బారావుగారు చూ: బమ్మెర పోతన నికేతన చర్చ. పుట. 50.

## పోతన నివాస స్థలం గురించిన వివాదంలో పక్షాలు వహించిన వాదులు, ప్రతివాదులు — మధ్యవర్తులు.

### ఒంటి మిట్ట ఏకశిలానగర వాదం.

1. 1884 పురాణం హయగ్రీవశాస్త్రి
2. 1899 కందుకూరి వీరేశలింగం పంతులు
3. 1913 కేశవపిళ్లై
   (గుత్తి మధ్యవర్తి)
4. 1917 వావిలికొలను సుబ్బారావు
5. మొక్కపాటి సుబ్బారాయుడు
6. కూచి నరసింహం పంతులు
7. ఒంగోలు వెంకటరంగయ్య
8. కె. గోపాల కృష్ణమ్మ పంతులు
   (మద్రాసు - మధ్యవర్తి)
9. నేలటూరి పార్థసారథి అయ్యవార్లు
   (వెంకటగిరి - మధ్యవర్తి)
10. వి. నరసింగరావు
    (నెల్లూరు - మధ్యవర్తి)

### ఓరుగల్లు ఏకశిలా నగర వాదం.

1. 1893 గురజాడ శ్రీరామమూర్తి
2. 1915 జయంతి రామయ్య పంతులు
3. 1915 పాలడుగు లక్ష్మణరావు
   (గూడూరు — మధ్యవర్తి)
4. 1915 ఎల్లంభట్ల రామకృష్ణశాస్త్రులు
   (వేల్పుగొండ — మధ్యవర్తి)
5. 1915 నెల్లుట్ల వెంకటపాపయ్య
   (బమ్మెర — మధ్యవర్తి)
6. 1915 గోమఠం బుచ్చయ్య
   (బమ్మెర — మధ్యవర్తి)
7. 1915 అమరవాది నారాయణాచార్యులు
   (వరంగల్లు — మధ్యవర్తి)
8. 1917 కందుకూరి వీరేశలింగం పంతులు
9. 1919 పెద్దిభట్ల వీరయ్య పంతులు
   (విజయవాడ)

**ఒంటి మిట్ట ఏకశిలా నగర వాదం.**

11. 1919 జనమంచి వేంకట సుబ్రహ్మణ్య శర్మ
12. 1919 రాజామంత్రి ప్రెగడ భుజంగరావు
    (ఏలూరు - మధ్యవర్తి)
13. 1919 వావిలాల వెంకట శివావధానులు
    (కడప - మధ్యవర్తి)
14. 1919 సం. వేం. అప్పలాచార్యులు
    (అనంతపురం - మధ్యవర్తి)
15. 1919 శిరిపి ఆంజనేయులు
    (ధర్మవరం - మధ్యవర్తి)
16. 1919 నాగపూడి కుప్పుస్వామయ్య
    (తిరుపతి – మధ్యవర్తి)
17. 1919 పాతాళభేది సుబ్రహ్మణ్యం
    (తిరుపతి - మధ్యవర్తి)
18. 1919 ఎ. పద్మనాభయ్య
    (తిరుపతి – మధ్యవర్తి)
19. 1919 గాడిచర్ల హరిసర్వోత్తమరావు
20. 1919 రాయదుర్గము నరసయ్యశాస్త్రి
21. 1920 గాదేపల్లి అనంతరామమూర్తి
    (విజయనగరం .. మధ్యవర్తి)

**ఓరుగల్లు ఏకశిలా నగర వాదం.**

10. 1919 వంగూరి సుబ్బారావు
    (చిత్రాడ – మధ్యవర్తి)
11. 1919 చిలుకూరి వీరభద్రరావు
    (చిత్రాడ – మధ్యవర్తి)
12. 1920 సంవత్సరానికి ముందు గాదేపల్లి అనంతరామమూర్తి
    (విజయనగరం – మధ్యవర్తి)
13. 1922 శేషాద్రి రమణకవులు
14. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు

వాద ప్రతివాదాలవల్లనూ, మధ్యవర్తులు సాక్ష్యాలు పలకటం వల్లనూ అభి ప్రాయ రూపాలయిన విషయాలు నిర్ద్వంద్వంగా సంస్థాపితాలు కావటం కానీ, రూపు మాసిపోవటం కానీ జరుగదు. ఒకవేళ జరిగితే కాలంయొక్క నిడివిమీద ఎప్పటికో జరుగుతుంది. అయితే ఈ వాద ప్రతివాద రూప చర్చాప్రయోజన మేమిటంటే చర్చకు మూలమైన విషయంతో వాద ప్రతివాదులకుగల ప్రయోజనాలు తెలుస్తాయి. విషయముయొక్క లోతుపాతులు బయటపడతాయి. ఈ వాద ప్రతివాదాల సంఘర్షణ నుండి అసలు విషయం అనుచితత్వాన్ని కోల్పోయి సముచితత్వ సమన్వయంగా ఒక కొత్త రూపాన్ని పొందుతుంది. ఈదృష్ట్యా చూస్తే ఈ పోతన నివాసస్థల వివాదం పర్యవసాన మేమిటంటే "ఆయన యేయూరి వాడైనను ఆయన నామము ప్రతి పల్లియందును స్మరణీయము. ఆయన సమస్తాంధ్రలోకమునకు పూజ్యుడు. ప్రతి గ్రామమువారును పోతన మాయూరివాడని యెంచుట సంతోషకరమైన కార్యము.[1]"

శ్రీ మహాభాగవత సాత్వత సంహితను భగవదాజ్ఞగా తెనుగు చేసిన పోతన్న గారి కైంకర్య తాత్పర్యాన్ని అటు ఒంటిమిట్ట వాదులుగానీ, ఇటు వరంగల్లు వాదులు గానీ అవగాహన చేసుకొన్నపాపాన పోలేదు. కందుకూరి వీరేశలింగం పంతులు, జయంతి రామయ్య పంతులు- వీళ్ళకంటె వావిలికొలను సుబ్బారావుగారే నయం. నిజంగా ఆయన భక్తుడు. భాగవత తత్వం తెలిసినవాడు. వాదానికి దిగి పోతన్న గారిని ఒంటిమిట్ట వాడుగా చేయాలని చాలా గట్టిప్రయత్నం చేసికూడా "ప్రతి గ్రామము వారును పోతన మా యూరివాడని యెంచుట యొంటిమిట్ట వారికి సంతోష కరమైన కార్యము" అని వ్రాయుట ఆయన తాత్వికతకు నిదర్శనం. భాగవతులను గ్రామాలతోనూ కులాలతోనూ సంబంధపరచి చెప్పటం అదొక పెద్ద అనర్థకం.[2] భక్తుని నివాసస్థల నిరూపణ ప్రయత్నము భాగవతాపచారం. అంతకంటె అనర్థక మింకేం కావాలి?

---

1. వావిలికొలను సుబ్బారావుగారు, బమ్మెర పోతన నికేతనచర్చ. (1920) పుట 179.
2. గ్రామ కులాదిగళాల్ వరుమ్ పేర్ అనర్థహేతు
ఏకాంతీ వ్యపదేష్టవ్యః, నైవగ్రామ కులాదిభిః
విష్ణునా వ్యపదేష్టవ్యః తస్యసర్వాం న ఏవహి
శ్రీమాన్ అణ్ణంగరాచార్యుల వారి ఆంధ్ర టీకాసహిత
శ్రీవచన భూషణమ్. 1 - 78,79. 2 - 189-196.

# I. 3. పోతన కృతుల కర్తృత్వ విషయం

## వీరభద్ర విజయం :

వీరభద్ర విజయం గద్యను బట్టి, కృతికర్త వంశ వర్ణనను బట్టి వీరేశలింగం పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రలో భాగవతకర్త అయిన పోతన్నయే వీరభద్ర విజయాన్నిగూడా వ్రాశాడని అన్నారు. చాలాకాలం అదే అభిప్రాయం నిలబడి పోయింది. గురజాడ శ్రీరామమూర్తిగారు తమకవుల చరిత్రలో పోతన్నగారి గురించి ఎక్కువగా వ్రాస్తూ వీరభద్ర విజయ కర్తృత్వ విషయాన్ని వివాదాంశం చేసిపెట్టారు. వావిలికొలను సుబ్బారావుగారు దాని నందుకొని వీరభద్ర విజయం పోతనకృతం కాదనీ, ఆ గద్య, ఆ వంశావళి కూట సృష్టియేగాని నిజంగాదనీ నిరూపించి పెట్టినంత పనిచేశారు.

కూటసృష్టి ఎందుకు ఎవరుచేసి వుంటారన్నదానికి సమాధాన మిలా చెప్పారు. "బమ్మెర పోతరాజు తండ్రి శైవుడు. ఈ యింటి పేరుగల యితరులును శైవులే. అట్టి శైవమతమున బుట్టిన పోతన్న శైవసిద్ధాంత గ్రంథములను వ్రాయక విష్ణు పరత్వము స్థాపించు శ్రీ భాగవతమును తెనిగించెను. దీనిం గనిన వీరశైవేతరులు శైవమతమున బుట్టిన పోతనామాత్యుడే శివపరత్వ మంగీకరింపక విష్ణుపరత్వ మంగీకరించెనని వీరశైవులను సోత్ప్రాసము లాడి యుందురు... అట్టి మాటలు వీరశైవులకు కొందఱకు గాకున్న కొందఱకైన కోపకారణమై యుండును. ఆ కారణముచే పోతరాజు శివపరత్వము గూడ స్థాపించుటకై వీరభద్ర విజయము భాగవత గ్రంథకర్తృక మనిపింపవలసి వచ్చెను. "ఇట్టి ఈ భాగవత పురాణమును శివపరత్వమును స్థాపింపక రచియించుటచేత ఇతనికి (పోతనకు) నోట వ్రణములేచి పురుగులు పడినట్లు దాని పోగొట్టుకొనుటకై పిమ్మట వీరభద్ర విజయము అను శైవ గ్రంథమును రచించినట్లును కొందరు పాషండులు[1] పలుకుచుందురు. "అను పాలపర్తి నాగేశ్వరశాస్త్రులవారి వాక్యము మా యూహలను బలపఱుచు చున్నది. ఇట్టి పాషండుడెవడో వీరభద్ర విజయమున వంశావళిని గద్యమును

1. చూడు. భాగవతం, 4-51, 53.

మార్చెను. అంతటితో సంతుష్టిలేని మరియొకడు 'భాగవత ప్రబంధమతి భాసురతన్'[1] అను పద్యమును నిఱికించెను. (బమ్మెర పోతరాజు విజయము. 67,68) ఇది కూటసృష్టిఅని ఈ విధంగా నిశ్చయమైన తరువాత వీరభద్ర విజయకర్త భాగవత పోతనగాక మరొక పోతన అన్నవాదం బయలు దేరింది.

ఈ పద్యం గురించిన వావిలి కొలను సుబ్బారావుగారి 'విమర్శనాత్మకమైన వివరణను అంగీకరించి వీరేశలింగం పంతులుగారు 'వీరశైవుడెవ్వడో యొకడీ పద్యమును గూర్చి పుస్తకమున జేర్చియుండును' అని వ్రాశారు.

కానీ భాగవత రచన తరువాత కాక, చిన్నప్పుడే పోతన వీరభద్ర విజయాన్ని రచించి వుంటాడని అంగీకరించినందువల్ల వచ్చేనష్టం లేక పోవటంతో పాటు చిన్నవే అయినా అంగీకరించటానికి ఒకటి రెండు కారణాలు కూడా వున్నాయని చాగంటి శేషయ్యగారు,[2] ఆరుద్రగారు[3] అంటున్నారు. భాగవతం తరువాత వీరభద్ర విజయం వ్రాయటంగురించిన విషయం కట్టు కథఅని సాహిత్య అకాడమీ భాగవత సంపాదకులు అంటున్నారు.[4] వీరభద్ర విజయం పోతన్నగారి బాల్య రచన అని అనటం యుక్తి యుక్తంగా వుంటుందని దివాకర్ల వేంకటావధానిగారు[5] కూడా అంటున్నారు.

వీరభద్ర విజయ ప్రబంధాన్ని ఇవ్వటూరి సోమనారాధ్యులవారు కోరి పోతన చేత వాయు పురాణాను సారముగా వ్రాయించుకున్నారు. వ్రాయించుకొన్నారంటే అలా వ్రాయుమని చెప్పాడు వీర శైవులకు వీరభద్రుడు ఆరాధ్యుడు గనుక ఆయన యందలి గురుదేవతా భావంతో సోమనారాధ్యుడు చెప్పినా చెప్పివుండవచ్చు. పోతన వ్రాసినా వ్రాసి వుండవచ్చు. భాగవత ప్రబంధమతి భాసురతన్ రచియించి దక్షదుర్యాగకథా ప్రసంగమున నల్పవచస్కుడనైతి[6] నన్న పద్యం మాత్రం ఎవరో

---

1. చూడు వీరభద్ర విజయం.
2. ఆంధ్రకవి తరంగిణి- 6, 193.
3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం- 5. 242.
4. శ్రీ మహాభాగవతము. ప్రథమ సంపుటం- పీఠిక. 21.
5. పోతన- పు. 15.
6. చూడు: వీరభద్ర విజయం.

భాగవతం సరిగ్గా అర్థంగాని ఆవేశపరుడైన శైవుడు పోతనగారు వ్రాసినట్లు వ్రాసి వీరభద్ర విజయంలో ఎప్పుడు ఇరికించాడో తెలియదు. దక్షధ్వంస కథ భాగవతంలో వుంది. అక్కడ వీరభద్రుడే విజయాన్ని సాధించాడు. వీరభద్ర విజయం శైవ మాహాత్మ్యాన్ని చెప్పేది. భాగవతకథకీ తాత్పర్యం వుండటానికి వీలులేదు. వైదిక కర్మానుష్ఠాన పరుడు దక్షుడు. అతడు వేదజడుడు ఆత్మతత్వం తెలియని వైదిక మూర్ఖులకు దక్షుడగ్రేసరుడు. శివుడు కర్మిష్ఠికాడు తత్వజ్ఞుడు. తత్వజ్ఞానము భగవద్భక్తి ప్రధానమై కర్మానుష్ఠానము అప్రధానమైన ఆధ్యాత్మిక దృక్పథానికి శివుడు నాయకుడు. శివ నాయకమన్నంతమాత్రాన శివ ప్రాధాన్యాన్ని చెప్పినట్లు కాదు భక్తి జ్ఞానప్రబోధ తాత్పర్యంగల భాగవతంలో కర్మకాండను త్రోసి రాజనటానికి ఒకడు కావాలి. అందుకు శివుడు అనుకూలంగా చిక్కాడు. బ్రహ్మలు చేసే సత్రి యాగానికి శివుడూ పోయినాడు. దక్షుడూ పోయినాడు బ్రహ్మలు కర్మలు చేస్తున్నా తత్వజ్ఞులు. దక్షుడు వట్టికర్మిష్ఠి. అందువల్ల శివుడు దక్షుని విషయంలో అక్కడ ఉదాసీనంగా వున్నాడు. తనను పెద్దగా పట్టించుకోలేదనీ, అది తనను అగౌరవ పరచటమనీ శివునిమీద దక్షునికి కోపం వచ్చి ఏదో శాపం పెట్టాడు. దక్షుడలా దుడుకుగా ప్రవర్తించటాన్ని సదస్య ముఖ్యులు అకృత్యంగా నిర్ణయించి అతన్ని నిషేధించారు. దక్షుడు వెళ్ళిపోయినాడు. నందికేశ్వరుడు లేచాడు. కర్మతంత్రాన్ని పెంచుకొంటూ తత్వవిముఖులైన ఈ బ్రాహ్మణులంతా ధనదేహేంద్రియాదులయం దమితంగా ప్రీతిని పెంచుకొని యాచకులై భక్ష్యాభక్ష్య విచారశూన్యులై నీచాలకు పాల్పడుతారు అని తిట్టాడు. ఆ తిట్లకు నందికేశ్వరుని మీద భృగుమహర్షికి కోపం వచ్చింది. ఆయన శైవాచారపరులను వైదిక కర్మలను నిరసించేవారిని పాషండులని తిట్టాడు.[1] అంటే కర్మలు ప్రధానమనేవారికీ, తత్వము ప్రధానమనేవారికీ జరిగిన సంఘర్షణగా కనిపించటం లేదా ఇదంతా. భాగవతంలో వీరభద్ర విజయమంటే వైదిక కర్మానుష్ఠానాన్ని కాదని ఆత్మతత్వ ప్రాధాన్యాన్ని సంస్థాపించటం. ఆత్మ తత్వస్వరూపుడు విష్ణువు. ఆయనను గురించి చేసే కర్మలే కర్మలు. తదితరములు కావు ఈ తాత్పర్యాన్ని భాగవతంలోని దక్షాధ్వర ధ్వంసకథ చెబుతుంది. వీరభద్ర విజయంలో శివతిరస్కారం చేసినందుకు దక్షుడు వీరభద్రునిచేత శిక్షింప బడటం, దక్షుని పక్షం వహించిన దేవతలంతా ఖండ ఖండాలుగా నరకబడటం— ఈ మహా

---

1. భాగవతం, చతుర్థస్కంధం, 47 - 51.

దారుణాన్నిచూచి శివుడు చివరకు అందరి అపరాధములు గాచి అభయములిచ్చి దేవ సంఘాన్ని ఏను కోపించిన మానుపింపగ మీకు దిక్కేది?– అని హెచ్చరించి పంపించాడు.[1]

భాగవతంలోని దక్షాధ్వర ధ్వంసకథకు, వీరభద్ర విజయకథకూ తాత్పర్యంలో చాలా భేదమున్నది. అందువల్ల భాగవతంలో వ్రాసిన దానికి ప్రాయశ్చిత్తంగా వీరభద్రి విజయం వ్రాసినట్లున్న పద్యం పోతన్నగారిది కాదు. భాగవతం అర్థంకాని వీరశైవుడెవడో వ్రాసింది.

## భోగినీ దండకం

అముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతులు శ్రీ పూండ్ల రామకృష్ణయ్య పంతులుగారు 1893వ సంవత్సరాన నెల్లూరు నుండి ఈ దండకాన్ని అచ్చువేశారు. వేస్తూ దానికొక అవతరణిక కూడా వ్రాశారు. "ఈ భోగినీ దండకమును రచియించిన బమ్మెర పోతన్నగారు పదునేనవ శతాబ్దమున జీవించి యున్నవారు. వీరి యశో విశేషంబు శ్రీమదాంధ్ర భాగవత రచనవలన భూవలితంబు. ఈ కవి వరుండీ దండకంబు వ్రాసెనన్న వార్త యింతకాలముదాక లోక వార్తగనుండి. అది యిప్పటి కొప్పుగ నొప్పె. వీరి భాగవత గతంబగు "ఇమ్మను జేశ్వరాధముల" కన్న పద్యమునకు, చాటు ధాటినెసగు "బాలరసాల సాలనవ పల్లవ కోమల కావ్య కన్యక" నను దావికిని విరుద్ధ సందర్భము నిందు పొందువడుట కొందఱిది తత్కృతము కావని అభిప్రాయపడినను" బాలత్వంబున నాటలన్ మెలగు విభ్రాజద్వయో వంతుడై స్త్రీలోలత్వము జెందు వార్ధకమునంజింతారతి" నను నయంబున ననయంబు జనంబు తమ తమ వయోవస్థానను తత్తత్కార్యముల కార్యముల నొనరింత్రు. తిక్కన మఖియు మొట్టమొదట కొంత కాలము నరస్తుతి బొనరించె. గాన వీరునట్టి మహనీయులగుట తారుణ్య గుణ్యంబున దీని బూని (రచిం)చిరని నిశ్చయింప విపశ్చితులర్హులు. దీని రచనా శైలియు కరబదర సదృక్షముగ నీక్షింప బడుట వారి యర్వాచీన కల్పకల్పితంబగు శ్రీమదాంధ్ర భాగవతమందందములగు రెండు దండకములు చెప్పకయ చెప్పెడి. అట్లగుటం బట్టి యిట్టి యూహాపోహలవలన వీరికన్న నన్యులీపద రస సాహిత్య సౌహిత్యముం గలిగి నిశ్శంక శ్రీ వెంకటగిరి సంస్థానా స్థాన విద్యావ

1. వీరభద్రి విజయం, 4 – 191 – 203.

పద్యంలగుట తెలుచుగ నెఱయదని కవితా వైదుషీభూషణులు భాషించిరి. పదోద్దండ ముగ నుంట దీని నుద్దండదండకంబని యంద్రు .....దండక కథా నాయకుండు శ్రీ వెంకట గిరిరాజన చతుర్దశ పురుషుండు."

భోగినీ దండకమును పోతన్నగారి రచనగానే వీరేశలింగం పంతులుగారు భావించారు. తమ ఆంధ్రకవుల చరిత్రములో ఈవిషయాన్ని విపులీకరించి వ్రాశారు.

ఆంధ్రుల చరిత్ర మూడవ భాగమున చిలుకూరి వీరభద్రరావుగారు 'సింగమ నాయకు డుంచుకొన్న వేశ్యను గూర్చి పోతన్న యంతటి ఆత్మగౌరవ సంపత్తిగల కవి ఈ దండకము చెప్పెననిగానీ, చెప్పుననిగానీ యూహించుటకే సాధ్యపడదు' అని వ్రాశారు. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ కవి జీవితములయందు, సింగమనీనికిగల యభిరుచి సంస్కృత భాషలోగానీ యాంధ్రమునగాదు .. అట్టివాడు ఆంధ్రములో వారనారిపై నొక దండకము జెప్పించి దానికి తాను కృతిపతియై యుండ నంగీకరించెనని పుట్టింపబడిన కథయే పొసగి యుండలేదు' అని వ్రాశారు. శ్రీరామ మూర్తి పంతులుగారీ సందర్భంగా సర్వజ్ఞ సింగభూపాలుని భాగవత కృతిపతిత్వాభి లాషను గురించి వ్రాసిన మాటలు గమనింప దగినవి, సర్వజ్ఞ సింగమనీడు పోతరాజును భాగవతము తనకు కృతియిమ్మని స్వయముగ యాచించుటయు, అట్లు యాచించు ప్రభుని నీవీ గ్రంథమునకు కృతిపతివి కాదగవు కావున నేనీయను పొమ్మని పోతన మూర్ఖించి చెప్పుటయు లోకానుభవ వ్యతిరేకమై యున్నది; (కవిజీవితములు)

భోగినీ దండకమును పోతన్నగారు సర్వజ్ఞ సింగ భూపాలుని వేశ్యను గురించి చిన్నప్పటి వయస్సులో రచించి వుండవచ్చు నన్న అభిప్రాయాన్ని చాగంటి శేషయ్యగారు వ్యక్తం చేశారు. ఆ దండకమును రచించె నన్నంత మాత్రమున నాతని స్వభావమునకు కళంకమురాదు. యౌవనమున ప్రభుప్రోత్సాహముచే నట్టి దండకము నాతడు చేసె ననిన నందు దోషము లేదు (ఆంధ్ర కవితరంగిణి. 6-189) ఆరుద్రగారు కూడా "పోలికలున్న భావాల వల్లనే కాక శైలి, సంవిధానాల వల్ల కూడ భోగినీ దండకం పోతరాజుగారు వ్రాసినదే అని చెప్పవచ్చు" (సమగ్రాంధ సాహిత్యం. 5-209) అని వ్రాశారు.

బమ్మెర పోతరాజు విజయ గ్రంథము మాత్రము భోగినీ దండకము పోతన కృతము కాదనీ, దండకం చివరగల

"పండిత కీర్తనీయుడగు బమ్మెర పోతన యాసుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదాన విహర్తకు రావు సింగ భూ
మండల భర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్"

అనే పద్యం దండకంలో కొంత భాగంలాగానే ప్రక్షిప్తమనీ పూర్తిగా త్రోసి పారేస్తుంది. పూండ్ల రామకృష్ణయ్యగారు మొదట "పండిత నీతికోవిదుడు బమ్మెర పోతన... "అని ముద్రించి ఆ తరువాత వేశ్యా విప్రలంభము వర్ణించుట పండిత నీతికోవిదత్వమా ? అని ఆక్షేపం రాగా[1] "పండిత కీర్తనీయుడగు పోతన-" అని మార్చినట్లుగా కూడా ఆ గ్రంథం చెబుతున్నది. (77) కానీ వ్రాత ప్రతులు చూస్తే "పండిత మాననీయుడగు బమ్మెర పోతన..." అనే పాఠమూ, పండిత కీర్తనీయుడనే పాఠమూ రెండే కనిపిస్తున్నాయి.[2]

భోగినీ దండకం లభించిన కారణంగానే పోతన్నగారి కాలనిర్ణయానికి నిర్దుష్టమైన ప్రమాణం దొరికింది. ఈ పోతన్నగారి ఈ దండకంలోని విషయాలాధారంగానే మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1437 ప్రాంతాన రాచకొండ నేలిన రేచర్లరావు సర్వజ్ఞ సింగ భూపాలుని కొలువులోనే పోతన భోగినీ దండకం చెప్పి వుంటాడనీ అప్పటికాయనకు పాతికేండ్ల వయస్సుండవచ్చుననీ నిర్ధారణగా వ్రాశారు.

గోపాలదేవుని రథోత్సవ వేడుకల్లో ఎప్పుడో సింగభూపాలుని చూచి వలచింది ఒకవేశ్య. తల్లిని పోయి ఆయనను ఇంటికి తీసుకొనిరమ్మని కూర్చున్నది. ఆ ప్రభువు దుర్లభుడని చెప్పవలసిన మాటలన్నీ చెప్పింది వేశ్యమాత. కూతురు మనసు మార్చ

1. The first work, Bhogini dandakam, furnishes the clue to settle the date of POTHANA... It is likely that he wrote this Dandakam in his youth, some time after he entered the court of his patron, SARVAJNA SINGA, to please him.— History of the Reddy Kingdoms, Page- 535.
ఈ పదబంధ మీలాగే విశ్వనాథవారి కల్పవృక్షంలో చేరింది. "పండిత కీర్తనీయు డిరుబాపల దిట్ట-" బాల- అవతారిక.

2. D. Nos. 1995 to 98.

కోక మొండికి వేసింది. తప్పని సరికాగా ధైర్యంచేసి వేశ్యమాత పోయి తన కూతురు సంగతి సింగభూపాలునికి చెప్పింది. నర్తనాగారంలో కలిసి సింగభూపాలు డంగీకరించి ఆ వేశ్యకాంతను తనదగ్గర కనుమతించాడు. ఆ తరువాత ఆమెకు భోగినీపట్టం ప్రసాదించాడు, గజారోహణం కూడా చేయించాడు.— ఇది దండకంలోని విషయం.

## నారాయణ శతకం

పిఠాపురం ఆంధ్రపరిశోధక మహామండలి కార్యనిర్వాహకులయిన వంగూరు సుబ్బారావుగారు మొట్టమొదటగా నారాయణ శతకమును ప్రకటిస్తూ పీఠికలో అది బమ్మెర పోతనామాత్య కృతమని గద్యవల్ల తెలుస్తున్నదనీ, శైలి విషయంలోనూ, వ్యాకరణ దోషాల విషయంలోనూ చిన్నతనపు రచనగా కనిపిస్తూ భాగవతంతో సంపూర్ణంగా పోలికను గుర్తుపట్టటానికి వీలుగా కూడా వున్నదనీ వ్రాశారు. తాళపత్రాలను పరిశోధించి ఈశతకానికి వంగూరి సుబ్బారావుగారి ప్రేరణవల్ల ముద్రణకు సిద్ధంచేసింది పడాల సుబ్బారావునాయుడు. ఇందులో నూరుపద్యాలున్నాయి. ఈశతకాన్ని పోతనే వ్రాసి వుంటాడనటానికి మరొక కారణమేమిటంటే శతకంలోని 97వ పద్యం "ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా" అని ముగుస్తుంది— ధర్మపురి ఓరుగల్లుకు దగ్గర గనుక గోదావరీ తీరం గనుక పోతన బమ్మెర నుండి గంగాస్నానానికి ధర్మపురి ఎన్నిసార్లైనా పోయి వుండవచ్చు— అక్కడి లక్ష్మీనారాయణ స్వామివారిని ఇష్టదైవంగా చేసుకొని శతకం వ్రాసి వుండవచ్చునని ఊహించటానికి వీలుండటం.

ఈ శతకం అచ్చులోకి వచ్చేనాటికే పోతన్నగారి నివాసస్థలం గురించి తెలంగాణా రాయలసీమల మధ్య వాదోపవాదాల గాలివానల జోరు ఎక్కువగావున్నది. ఈశతకం కనిపించగానే కడప ఒంటిమిట్ట వాదం వారిపక్షంగా జనమంచి వెంకట సుబ్రహ్మణ్య శర్మగారు 1919 జూన్ 8వతేదీన నెల్లూరులో జరిగిన కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వార్షిక విద్వత్సభలో నారాయణ శతకం పోతన్నగారి రచనకాదనీ, శతకం చివరవున్న గద్య భాగవతగద్యము నకలుగా ఎక్కించిన కూట సృష్టి మాత్రమేనని పెద్దవ్యాసం వ్రాసి చదివారు. ఆయన అవ్యాసం ఆసభలో చదవటానికి వెనుక కడపమండల "బమ్మెర పోతనామాత్య సమాజము"న్నది

కందుకూరి వీరేశలింగం పంతులుగారు కూడా "అపరాధంబులు నిన్ను నమ్మి వినుమే నాజన్మ పర్యంతముఁ. విపరీతంబుగ జేసినాడనిక నీవేదిక్కు ..రక్షింపుమీ, కృపకుం బాత్రుడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా"[1] అన్న శతకంలోని పద్య మాధారంగా శతక కర్త పోతన్నయేననీ, భాగవతంలో పేర్కొనబడిన ఏకశిలా నగరం ఓరుగల్లేయనీ, పోతన ఓరుగల్లు మండలం వాడేననీ వ్రాశారు- 1919 ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో.

జనమంచి వెంకట సుబ్రహ్మణ్య శర్మగారు నారాయణ శతకాన్ని వ్రాయలే దనటానికి చూపించిన మరొక కారణం, పోతన అద్వైతియనీ, ఆ శతకంలో విశిష్టా ద్వైతమును చెప్పే భావాలుగల పద్యాలున్నాయనీ చూపించటం. బాల్యంలో విశిష్టా ద్వైతి తరువాత కాలంలో అద్వైతి కాడన్నది సిద్ధాంతంగా గ్రహించటం.

ఎవరి కారణాలు వారికుండి మొత్తం మీద నారాయణ శతకం పోతన్నగారి రచన కాదన్నవారు- జయంతి రామయ్య పంతులుగారు, చిలుకూరి వీరభద్రరావు గారు, పెద్దిభట్ల వీరయ్య పంతులుగారు, చాగంటి శేషయ్యగారు, ఆరుద్రగారు. ఎంగూరి సుబ్బారావుగారినీ, వీరేశలింగం పంతులుగారినీ మినహాయిస్తే అటు కడప వారుగానీ, ఇటు ఓరుగల్లు వారుగానీ నారాయణ శతకం పోతన రచన అనటాన్ని అంగీకరించరు.[2]

1968లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన శతక సంపుటం ద్వితీయ భాగంలో నారాయణ శతకాన్ని పోతన్నగారి రచన అన్న ఉద్దేశంతోనే చేర్చారు. సంపాదకులయిన స్వామీ శివశంకర స్వామిగారు ఈ శతకానికి ప్రత్యే కంగా వ్రాసిన పీఠికలో పోతన భాగవత రచనకంటె ఇది మొదటి బాల్య రచన అని ఇందులోని తొమ్మిది పద్యాలకు అభివృద్ధి ఛాయారూపాలయిన పద్యాలను భాగవత ప్రథమ, ద్వితీయ, చతుర్థ, అష్టమ దశమస్కంధాల నుండి ఉద్ధరించి చూపారు.

---

1. చూడు: భాగవత పద్యం 'చతురామ్నాయవపుర్విశేష... లక్ష్మీనాథ దేవోత్తమా' 3–431. 'మనుకల్పాంతము నందు... లక్ష్మీనాథ దేవోత్తమా' 4–199.
2. దివాకర్ల వెంకటావధానిగారు కూడా ఈ శతకం పోతన కృతమేయని నిర్ధారించు టకు వీలులేదంటారు- పోతన. 22.

'భావికాలములో భాగవతము తాను చేయనున్నట్లు కవి ఈ శతకమున పెక్కుసార్లు సూచనలు చేసినాడు'(4) అని వరుసగా ఆరు పద్యాలను కృష్ణలీలలను వర్ణింపజూచే వాటిని సూచించారు. "ఈ శతకశైలి భాగవత శైలివలెనే హృద్యము... భావములు భాగవత భక్తిభరితములై రసోద్ధారములై యున్నవి... ఈ శతకము వైష్ణవపదము నర్థించుచున్నను విశిష్టాద్వైత సిద్ధినేగాక అద్వైతసిద్ధిని గూడా అర్థించుచున్నది. జ్ఞాన వింశతిలోనూ మోక్షవింశతిలోనూ ఇది స్పష్టము. ఈ శతకములో బీజరూపమున నున్న ఈ భాగవతములోని ముఖ్య ఘట్టములలో స్పష్టముగా గోచరించును" అని శివశంకర స్వామివారు వ్రాసి నారాయణ శతకమును పోతన భాగవతాంధ్రీకరణమునకు పూర్వము చెప్పెనని ఊహింపవచ్చును అని తెల్పినారు.[1]

---

1. ఇంకా చూడండి : నిడుదవోలు వెంకటరావుగారి పోతన– పుటలు 42–48.

## I. 4 భాగవతకృతి

తెలుగు సాహిత్య చరిత్ర అంతా మూడువంతులకు పైగా తెలుగుకవుల దేశ కాల గ్రంథకర్తృత్వ వివాద చరిత్రగా వుంటుంది. నిర్దిష్టంగా ఈ కవి ఈ ఊళ్లో, ఈ కాలంలో వుండి ఈ గ్రంథం వ్రాశాడు అని చెప్పటానికి వీలయిన కవుల సంఖ్య తక్కువ. కొందరి విషయంలో అయితే అన్నీ వివాదగ్రస్తంగానే వుంటాయి. నన్నెచోడుడు— కుమార సంభవము; భాస్కరుడు— భాస్కర రామాయణం, రంగనాథుడు— రంగనాథ రామాయణం; పోతన— భాగవతం; శ్రీనాథుడూ— క్రీడాభిరామం— పల్నాటి వీరచరిత్ర; రాయలవారు— ఆముక్తమాల్యద; ఈవిధంగా కవులూ గ్రంథాలూ అన్నీ సమస్యలుగానే వున్నాయి. ఈ సమస్యలకు చారిత్రిక దృష్టి లేకపోవటంతోపాటు, కులమత ప్రాంతీయ కుటిలతా భావాలను వ్యక్తిగత ప్రయోజనాలను అభివృద్ధిచేసే స్వార్థపరత మరీ దోహదం చేసింది. ఫలితమేమిటంటే అంతా కూటసృష్టి. History of Telugu Literature అనీ Evolution of Telugu Literature అనీ చెలామణి అవుతున్న సమస్త పదార్థంలో ఈ కూట సృష్టి నీళ్ళల్లో పాలలాగా అవిభాజ్యమైపోయింది కందుకూరి వీరేశలింగం పంతులు గారి కవుల చరిత్ర వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారి పుస్తక ప్రచురణసంస్థ రెండూ కూడా, మన తెలుగుభాషా సాహిత్యాలకు చేసిన అభివృద్ధిరూపమైన మహోపకారాన్ని కాస్త పక్కకుపెట్టి చూస్తే, కూటసృష్టికి తెలిసి కాకపోయినా తెలియకుండానే అయినా బీజావాపన చేశాయి.

పోతన్నగారి దేశకాల గ్రంథ కర్తృత్వ వివాదాంశాలకు బీజం 1884 (శా.శ. 1770)లో భాగవతాన్ని మొదటిసారిగా ముద్రణ కెక్కించిన పురాణం హయగ్రీవ శాస్త్రిలవారు తమ పీఠికలో పొందుపరిచారు. తమకు తప్ప మరెవ్వరికీ అప్పటికీ ఇప్పటికీకూడా కనిపించని "బమ్మెర పోతనామాత్యుని జన్మకర్మ ప్రభావాదుల దెలిపెడు వచనరూపంబగు ప్రాచీన పండిత జనలిఖిత గ్రంథంబు" ఒకటి ఆధారంగా హయగ్రీవ శాస్త్రిగారు భాగవత గ్రంథ పాతపూరణములకు కారణకల్పన చేశారు. అంటే సమస్య ఉన్నదని చెప్పి, తోచిన సమాధానానికి ప్రమాణం కూడా ఉన్నదని చెప్పినట్లు. ఏమి చెప్పినా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు యుక్తియుక్తంగా "నాకందు నమ్మకము చాలదు" అన్నారు.[1]

భాగవత గ్రంథశిథిల పూరణాల గురించి మరొక కథాకల్పనం కూడా వుంది.

1. రాళ్ళపల్లి పీఠికలు— (1978) పుట. 46.

తన కంకిత మీయలేదన్న కోపంతో సర్వజ్ఞ సింగ భూపాలుడు పోతన్నగారి భాగవతాన్ని పాతిపెట్టించాడనీ అందువల్లనే అందులో కొంత శిథిలమై నష్టమైపోవటం జరిగిందనీ, ఆ నష్టపోయిన భాగాలనే గంగనాది కవులు పూరించారనీ ఒకకథ వుంది. ఆ కథను మొట్టమొదట గ్రంథస్థం చేసినవాడు కూచిమంచి తిమ్మకవి ఆయన ఆ కథను ఎందుకు గ్రంథస్థం చేయవలసి వచ్చిందీ అంటే పోతరాజుగారి భాగవతంలో రేఫఱకార ప్రాసలుండబట్టి లాక్షణికులా గ్రంథాన్ని ఉదాహరించరుగానీ లేకపోతే భాగవతానికేం తక్కువ? సలక్షణంగా వుండేది కదా అని అప్పకవి వ్రాసింది[2] చూచి, అలాంటి అలాక్షణిక రచన పోతన్నగారు చేయరు, వెలిగందల నారయ్యలాంటి వాళ్ల చేసివుంటారు, వాళ్లు ప్రవేశించటానికి కారణం సర్వజ్ఞ సింగభూపాలునివల్ల పోతన్నగారి భాగవతం నష్టపడిపోవటం అని పోతనగారి పక్షాన అప్పకవి వాదానికి సమాధానం చెప్పదలచుకొన్నాడు గనుక వ్రాయవలసి వచ్చింది.[3] తిమ్మకవి వాదం ప్రకారం

భాగవతంలో ఎక్కడ రేఫఱకార ప్రాస వుంటుందో ఆ పద్యం ఎవరిదైనా కావచ్చు గానీ పోతన్నగారిది మాత్రం కాదు ఈ వాదంలో వాస్తవములేదు. సామంజస్యము కూడా లేదు. పోతన్నగారి రచనగా గద్యలు కలిగిన స్కంధాల్లోనే రేఫఱకార ప్రాసాక్షర పద్యాలున్నాయి. అయితే కూచిమంచి తిమ్మకవికిగానీ, అప్పకవికిగానీ లక్షణం తప్పదనీ, తప్పినాడనీ పోతన్నగారిని గురించి వ్రాయటానికిగల కారణం పట్టుకొనే ప్రయత్నం రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారు చేశారు. ఆయన భాగవతమంతా ప్రతిపద్య పరిశీలనం చేసి "ప్రథమాష్టమ నవమస్కంధము లందును దశమస్కంధ పూర్వభాగము నందును లఘ్వలఘు రేఫవిరోధనియతి గలదని యెల్లరకుఁ దెల్లంబగు. ఈ స్కంధంబులం దలఘు రేఫప్రాస పద్యములు, లఘు రేఫప్రాస పద్యములు వేర్వేఱ కలవుగాని యేకపద్యము నందే యుభయ సాంకర్యము గనుపట్టదు. కావుననే కూచిమంచి తిమ్మన లోనగువారు రెండు రేఫములుఁ గలుపఁబడవయ్యె ననియుఁ దక్కంగల యప్పకవి లోనగువారు గలుపం బడియెననియుఁ జెప్పుదురు. ఈ విషయ మిట్లని నిర్ణయింపం దగిన యాధారంబు లేవియు గానము" అని వ్రాశారు– 2, 3, 4, 5, 6, 7,

1. లక్షణ సారసంగ్రహం 3–344. చూ. సుకవి మనోరంజనము (A.P. సాహిత్య అకాడమి. 1976) పు. 307.
2. అప్పకవీయం. 2– 234.
3. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, రాయల్ అండ్ కో వారి భాగవతం (1054) పీఠిక

స్కంధాల్లో, 10 ఉత్తర భాగంలో రేఫఱకార ప్రాసలుగల పద్యాలు మొత్తం 45 ఉన్నట్లుగా నరసయ్య శాస్త్రిగారు గుర్తించారు.[1]

మరొక్క విషయాన్నిక్కడ గమనించవచ్చు. ఈ విషయమిట్లని" అనివున్న నరసయ్య శాస్త్రిగారి వాక్యాభిప్రాయం రేఫఱకార నిశ్చయం సాధ్యంకాదని కావచ్చు. కూచిమంచి తిమ్మకవి మనుమని మనుమడు వెంకటరాయుడు తన సుకవిమనోరంజన గ్రంథంలో రేఫఱకార నిర్ణయం కుదురదనీ, వాటి సాంకర్యం కవిత్రయం వారినుండే మొదలయిందనీ కనుక పోతన్నగారి భాగవతాన్ని అప్పకవి మొదలయిన లాక్షణికులు ఆక్షేపించటం పరిశీలన లేకపోవటమని గట్టిగా నిరూపించాడు ఇట్లా నిష్కర్షగా చెప్పకూడా పోతన్నగారు రేఫఱకార సాంకర్యం యతిప్రాసల్లో చేయలేదని ఉదాహరణలు చూపిస్తూ వెలిగందల నారయ్యగారి భాగవత భాగం నుండి రేఫఱకార సాంకర్యాలను ఎత్తి వ్రాసి "కావున పోతరాజుగారి భాగవతము అన్నివిధముల సర్వోత్కృష్టమైనది" (పు 311) అని తీర్పు చెప్పినాడు.

1872 (అక్టోబరు 14) లో రచింపబడిన సుకవిమనోరంజనం పోతన్నగారి పక్షం వహించి ఆయన భాగవతంలో "ప్రథమస్కంధము, ద్వితీయము కొంతయు, ఆరు, ఏడు, ఎనిమిది తొమ్మిది స్కంధములను దశమము పూర్వభాగము కొంతయు" (308) మాత్రమే రచించాడనీ అందులో లక్షణదోషం లేదనీ చెబుతున్నది. ద్వితీయ స్కంధమంతా పోతన్నగారి రచనగా ప్రసిద్ధంగా వున్నది. వెంకటరాయ డొక సమస్య పెట్టాడు పంచమస్కంధం గంగన్న పేరుతో వుంది సరే. తృతీయ చతుర్థ స్కంధాలు పోతన్నగాక ఎవరు వ్రాసి వుంటారు ? ఇదొక సమస్య. షష్ఠస్కంధాన్ని సింగయ్యగారు అవతారిక కూడా వ్రాసికొని వ్రాస్తే దాన్ని పోతనే వ్రాశాడని సుకవి మనోరంజనం చెబుతున్నది ఇదింకొక సమస్య. ఈ సమస్యల కొనసాగింపే దశమం పూర్వభాగంలోని మిగిలిన కొంత, ఉత్తర భాగమంతా ఎవరి రచన అయివుండాలి ? అన్నది. సుకవి మనోరంజన సమస్య లీవిధంగా వుంచే 'ద్వితీయస్కంధ మందలి 92వ పద్యము తరువాతి భాగము, దశమస్కంధోత్తర భాగమందు 237వ పద్యము

---

1. వావిళ్ళవారి 1934 వ సంవత్సరం ముద్రిత భాగవతం – పీఠికగా ఉన్న 'భాగవత ప్రశంస' పుటలు 81–33.

నుండి స్కంధాంతము వరకునుగల గ్రంథమును నారయ రచించినట్లు ప్రవాద మున్నది' అని రాళ్ళపల్లివారు. ప్రవాదాలను పట్టుకొని పరిశోధనకు దిగితే ప్రమాదాలు తప్పవు. రేఫఱకార సంకర ప్రాసలు భాగవతంలో రావటానికి కారణంగా కూచిమంచి తిమ్మన్న చెప్పిన సర్వజ్ఞ సింగభూపాలుని కథయందు సత్యముంచే ఉండవచ్చునని అనంతకృష్ణ శర్మగారు అభిప్రాయ పడుతున్నారు.[1] పోతన్నగారి లక్షణవంతమైన రచనమీద కూచిమంచివారి కెంత విశ్వాసమున్నదో, రాళ్ళపల్లి వారికి అది కుంటినడక లేనిది, ధారాళమైనది, వర్చస్సుగలది, భావోద్రేకపూరితమైనది, పరిశుద్ధమైనది అని అంతకంటె విశ్వాసమున్నది. అందువల్ల లక్షణదోష మున్నచోటి రచన పోతన్న గారిది కాదని కూచిమంచి వారన్నట్లే, విస్వరములు, అసంస్కృతములు, పునరుక్త ములు అనవలసిన పదవాక్య పద్యములున్న చోట్లనెల్ల, అవి పోతన రచన లనబడు చున్నను, ఇతరులకై వాడము తేపలుతేపలుగా గలదని అనంతకృష్ణశర్మ గారంటారు. ఇందులో ఏవీ తేలేవికావు. 'ఇన్నియాఘాతములకు లోగిన తెలుగు గ్రంథ మింకోటి లేదు,

1. రాళ్ళపల్లి పీఠికలు— పుట, 48.

## ఏర్చూరి సింగన

ఈయన భాగవతంలోని షష్ఠస్కంధం మాత్రం పూర్తిగా రచించాడు. పురాణ మనటంతోబాటు భాగవతాన్ని 'సర్వమంత్రముల నేలిన – మోక్ష లక్ష్మీరూపమైన మంత్రము' అని పేర్కొన్నాడు. ఒక్క షష్ఠస్కంధాన్నే వ్రాస్తున్నా స్వతంత్ర గ్రంథాల్లో సాధారణంగా వుండే అవతారికనంతా వ్రాశాడు తన కృతియైన ఈ షష్ఠ స్కంధాన్ని కృష్ణార్పణం చేస్తూ "మదీయ కవితా మహాలక్ష్మికి నారాయణుండె నాథుం డగుటం జేసి–" అని చెప్పాడు. కృతికన్య– కృతిపతి వ్యవహారానికి– సింగన అలా చెప్పటం తిక్కన్నగారి తరువాత మరొకసారి దోహదం చేసినట్లవుతుంది– ఈయన శివకేశవ భేదంలేని హరిహరనాథ తత్త్వోపాసకుడు మాత్రమే కాదు. శాక్తేయుడు కూడా. సరస్వతి అమ్మవారిని స్వప్నమున సందర్శించి ఆమెవల్ల 'చాటుకారపద సాధు కవిత్వము చెప్పు' మని ఆజ్ఞాపింపబడినాడు. అమ్మవారి ఆజ్ఞయే వరమన్నమాట. పోతనగారు తండ్రితరం దాకా కచ్చితంగా శైవులు. సింగన తనతరంలో కూడా శైవుడే. అంటే శివపూజా ధురంధరుడే. అయినా 'విష్ణుచరితామృత నిష్యంది పటు వాగ్విలాసానందోచిత మానసుడు'.(6–30) ఈ మనస్సుతో చెప్పిన సింగనామాత్యుని సాధుకవిత్వమును అజామీళోపాఖ్యానంలో చూడవచ్చు.– అవతారిక వ్రాసుకొన్నట్లే "ఇది శ్రీ సకల సుకవిజనమిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువయామాత్య పుత్ర బుధజన పరిసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబు నందు... ... అను కథలుంగల షష్ఠస్కంధము సంపూర్ణము" అని నారయవలెకాక గంగనవలె స్వతంత్రంగా వ్రాసుకొన్నాడు.

## వెలిగందల నారయ్య

పోతన భాగవతంలోని చివరి రెండు స్కంధాలూ తెనుగు చేశాడు. గద్య వ్రాసుకొనటంలో "ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య"– ఇంతవరకు పోతనగారి గద్య ప్రారంభాన్ని యథాతథంగా తీసుకొని "ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన" అని తనను చేర్చుకొని మళ్లా పోతన్నగారి గద్యలోలాగా "శ్రీమహాభాగవతంబను మహాపురాణంబు నందు...... అను కథలుగల...... స్కంధము సంపూర్ణము "అని పోతన్నగారి పద్ధతినే అనుసరించాడు. భాగవతాన్ని పూరిస్తు వ్రాసిన ముగ్గురిలో పోతన్నగారితో ప్రత్యక్ష సంబంధమున్నట్లు చెప్పుకొంటున్నది ఒక్క ఈ

"The real truth for the mutilation or destruction of this work seems to be in the extremely disturbed political condition of Telangana in the time of Potana, and his early patron Sarvajna Singa"[1] (History of Reddy Kingdoms- P. 536.

ఆ పిమ్మట పోతన్నగారి ప్రియశిష్యుడు వెలిగందల నారయ్య తాను ఏకాదశ ద్వాదశ స్కంధాలూ వ్రాసి గంగన్నను, సింగయ్యను పంచమ షష్ఠస్కంధాలు వ్రాయటానికి పేరేపించి వుండవచ్చు. ఈ ఊహకు ఆధారం లేదు కాబట్టి నారయ్యకులాగానే వాళ్ళకూ ఆ రెండు స్కంధాలూ వ్రాసి పోతన్నగారి భాగవతాన్ని పూర్తి చేద్దామని అనిపించి వుండవచ్చు.

"నీవు నచ్యుతుని మాయమోహము నందకుంట జేసి సర్వజ్ఞుఁడవు" అని శివునితో బ్రిహ్మ చెబుతాడు భాగవతంలో (4-150) - సర్వజ్ఞ సింగభూపాలు డింకా వైష్ణవుడుకాక శైవుడుగావున్న చిన్నప్పుడు అతని ఆశ్రయంలో పోతన వుండి వుండవచ్చు వుండివుంటే ఈ నిర్వచనంలో మరికొంత విశేషముంటుంది.

## గంగన

భాగవత పంచమ స్కంధమును తాను రచించినట్లుగా "ఇది శ్రీ సకల సుకవి జనానందకర బొప్పనామాత్య పుత్రి గంగనార్య ప్రణీతంబైన శ్రీమద్భాగవత పురాణంబునందు- పంచమ స్కంధంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము" అని నారయవలెగాక సింగనవలె గద్య నితడు సొంతంగా వ్రాసుకొన్నాడు. "గంగన సింగన నారయలు సమకాలమువారని చెప్పుట కాక్షేపము లేమియులేవు" అని చాగంటి శేషయ్యగారనుచున్నందువల్ల ఈ గంగనయు పదిహేనవ శతాబ్దం ఉత్తరార్థం వాడనవచ్చు.

---

1. సర్వజ్ఞ బిరుదు రాచకొండ వెలమల్లోనే మరి ఒకరిద్దరికి వుండడమేకాక మరికొన్ని చోట్లల్లో కూడా కొంతమందికి వున్నది. 1484 ప్రాంతాలో 'ఖడ్గ నారాయణ, సర్వజ్ఞ రాజసామజ సింహ' మొదలయిన బిరుదులు నరసింహ పృథు అనే వానికున్నట్లూ, అతనికి కాకతీయ సామ్రాజ్యంతో సంబంధమున్నట్లూ తెలుస్తున్నది- Tirupati Devasthanam Epigrapical Report (8930) Page 139. and also see pages 101, 114.

## ఏర్చూరి సింగన

ఈయన భాగవతంలోని షష్ఠస్కంధం మాత్రం పూర్తిగా రచించాడు. పురాణ మనటంతోబాటు భాగవతాన్ని 'సర్వమంత్రముల నేలిన – మోక్ష లక్ష్మీరూపమైన మంత్రము' అని పేర్కొన్నాడు. ఒక్క షష్ఠస్కంధాన్నే వ్రాస్తున్నా స్వతంత్ర గ్రంథాల్లో సాధారణంగా వుండే అవతారికనంతా వ్రాశాడు తన కృతియైన ఈ షష్ఠ స్కంధాన్ని కృష్ణార్పణం చేస్తూ "మదీయ కవితా మహాలక్ష్మికి నారాయణుండె నాథుం డగుటం జేసి-" అని చెప్పాడు. కృతికన్య- కృతిపతి వ్యవహారానికి- సింగన అలా చెప్పటం తిక్కన్నగారి తరువాత మరొకసారి దోహదం చేసినట్లవుతుంది- ఈయన శివకేశవ భేదంలేని హరిహరనాథ తత్త్వోపాసకుడు మాత్రమే కాదు కార్తేయుడు కూడా. సరస్వతి అమ్మవారిని స్వప్నమున సందర్శించి ఆమె వల్ల 'చాటుకారపద సాధు కవిత్వము చెప్పు' మని ఆజ్ఞాపింపబడినాడు. అమ్మవారి ఆజ్ఞయే వరమన్నమాట. పోతనగారు తండ్రితరం దాకా కచ్చితంగా శైవులు. సింగన తనతరంలో కూడా శైవుడే. అంటే శివపూజా ధురంధరుడే. అయినా 'విష్ణుచరితామృత నిష్యంది పటు వాగ్విలాసానందోచిత మానసుడు'.(6-30) ఈ మనస్సుతో చెప్పిన సింగనామాత్యుని సాధుకవిత్వమును అజామిళోపాఖ్యానంలో చూడవచ్చు.- అవతారిక వ్రాసుకొన్నట్లే "ఇది శ్రీ సకల సుకవిజనమిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కసువయామాత్య పుత్ర బుధజన పరిసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబు నందు... ... అను కథలుంగల షష్ఠస్కంధము సంపూర్ణము" అని నారయవలెకాక గంగనవలె స్వతంత్రంగా వ్రాసుకొన్నాడు.

## వెలిగందల నారయ్య

పోతన భాగవతంలోని చివరి రెండు స్కంధాలూ తెనుగు చేశాడు. గద్య వ్రాసుకొనటంలో "ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య"– ఇంతవరకు పోతనగారి గద్య ప్రారంభాన్ని యథాతథంగా తీసుకొని "ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన" అని తనను చేర్చుకొని మళ్లా పోతన్నగారి గద్యలోలాగా "శ్రీమహాభాగవతంబను మహాపురాణంబు నందు...... అను కథలుగల...... స్కంధము సంపూర్ణము "అని పోతన్నగారి పద్ధతినే అనుసరించాడు. భాగవతాన్ని పూరిస్తు వ్రాసిన ముగ్గురిలో పోతన్నగారితో ప్రత్యక్ష సంబధమున్నట్లు చెప్పుకొంటున్నది ఒక్క ఈ

వెలిగందల నారయ్యయే. ఈ ప్రియ శిష్యు డన్నమాటను సార్థకంచేసే కథ నొకదాన్ని 1884లో పురాణం హయగ్రీవశాస్త్రిలవారు బయటపెట్టారు. అది ఇది "పోతన తన నిర్యాణ కాలమున కొడుకు మల్లనను పిలిచి తాను తెనిగించిన భాగవతము ముముక్షువులకు తప్ప ఇతరులకధ్యయనము చేయరాదని చెప్పెను. మల్లన్న దానిని దేవతార్చన పెట్టిలో భద్రముగా దాచియుంచి తన యవసాన కాలమందు తన సహాధ్యాయియైన నారయ్యకా విధిని రహస్యముగా నుంచు కొమ్మని యిచ్చెను. నారయ్య కొంతకాలమునకు ఆ కట్టను విచ్చి బూడిగా అందు చాలభాగము క్రిమి దష్టమై నశించియుండెను. (అదిచూచి) దుఃఖించు చుండిన అతని కలలో ఒకనాడు పోతనయే కానవచ్చి నష్టభాగములను పూరింపుమని ముదల యీయగా అతడు గంగన సింగనల సహాయముచే ఆ పని నెరవేర్చెను "ఈ కథలో అన్ని సంగ్రహము కాని ఘట్టము" లేనని రాళ్లపల్లివారు త్రోసి పుచ్చగా[1] నష్టభాగాలను పూరించటానికి నారయ్యకు పోతనయే ముదల యిచ్చినట్లున్న వాక్యార్థముమీద నిడుదవోలు వెంకటరావుగారు పోతన్నయే ఆయా స్కంధాలను శిష్యులకు వ్రాయటానికి పంచి మిగతా స్కంధాలను తాను వ్రాసి మొత్తం భాగవతాన్ని పూర్తి చేశాడన్న మరొక కథను కల్పించారు. ఇదీ బాగానే వుందికదా! ఈ నారయ్య పోతన్నగారి శిష్యుడని చెప్పుకొన్నాడు కనుక పదిహేనవ శతాబ్దం ఉత్తరార్థపు కవి అని అనుకోవచ్చు.

ఈ నారయ్య పోతన్నగారికి శిష్యుడై చేసిన ఉపకారమేమి లేకపోగా 'చేసిన యపకారమే మహాఘోరముగా నున్నది ఈ మహానుభావునికి విశిష్టాద్వైతము మీదనున్న భక్తిలో సహస్రాంశము సాహితీ సంప్రదాయముపైని యున్నచో తెనుగు భాగవతమున కింత యపకారము జరిగెడిది కాదు. అసలింత యజాగరూకుడు, నింత యలసుడు పోతనగారికి శిష్యుడెట్లాయెనో యన్నది వింత.[2] శ్రీధరీయ వ్యాఖ్యానము ననుసరించిన పోతన్నగారి అద్వైతమత భాగవత రచనలో, విశిష్టాద్వైతమును ప్రవేశపెట్టిన నారయ్య ఆయనకు శిష్యుడు కావటం యాదవ ప్రకాశునకు శ్రీమద్రామానుజులు శిష్యులు కావటం లాగాఉంది.

---

1. రాళ్లపల్లి పీఠికలు. (1978) పు 45
2. ధూళిపాళ శ్రీరామమూర్తి, భాగవతానుశీలనము. పుటలు. 98,99

నారయ్య చేసిన విశిష్టాద్వైత పురాణాన్ని గుర్తించి అసలు పోతన్నగారి అద్వైత రచన ఈ విధంగా వుండి వుంటుందని శ్రీరామమూర్తిగారు చేసి చూపిన విధం పరమాశ్చర్యకరంగా వుంది. చూ. పుటలు. 58-70.

వెలిగందల నారయ్యను గురించి మరొక సంగతి కూడా చెప్పుకోవాలి. ఏకాదశ ద్వాదశ స్కంధాలకు కర్తృత్వం తనదిగా చెప్పు కొంటూ స్కంధ ఆద్యంత పద్యాలను పోతన్నగారి వలెనే రామాంకితాలుగానే వ్రాశాడు.[1] వ్రాశాడంటే పోతన్నగారి సప్తమ స్కంధాంత పద్యాలు రెండింటినీ ఏకాదశ స్కంధాంత పద్యాలను రెండింటినీ ద్వాదశ స్కంధాంత పద్యాలుగానూ ఎత్తి వ్రాశాడు. ఏకాదశ ద్వాదశ స్కంధాల ఆది కంద పద్యాలను మాత్రం నారయ్య సొంతంగానే వ్రాశాడు. స్కంధాంత పద్యాల్లో పాఠ భేదాలు కనిపిస్తున్నాయి. సప్తమ స్కంధంలోని. 'లోచన రాజీవ భవానిదేవరాజి' – 'కుంభినీచక్ర' – అనే రెండు పద్యాలలోని పాఠాలకు బదులుగా ఏకాదశ స్కంధంలో 'నయన విరాజిత సుగుణా విదేహరాజ'- 'కోసలక్షోణి' – అనే పాఠాలున్నాయి. ఇది చూస్తుంటే పోతన రచనలో శిధిల భాగాలను కాస్త పూరించి ఆయనకు ప్రియ శిష్యుడనని చెప్పుకొంటూ అసలు కర్తృత్వాన్ని ఆయన నుండి తొలగించి వెలిగందల నారయ్య ఆ రెండు స్కంధాల కర్తృత్వం తన మీద వేసుకోలేదుగదా అనే సందేహానికి అవకాశం లేకపోలే దనిపిస్తుంది.

గద్యలను బట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థ స్కంధాలు, సప్తమ, అష్టమ, నవమ, దశమ స్కంధాలూ, పోతన్నగారి రచనలు గానూ, పంచమ స్కంధం గంగన వ్రాసిందిగానూ, షష్ఠ స్కంధం సింగన కృతంగానూ, పరంపరగా భాగవత ముద్రణలు దాదాపు వంద సంవత్సరాల నుండి వస్తూనే వున్నాయి. ప్రతి క్రొత్త కూర్పుకూ ఒకరో ఇద్దరో శోధకులూ పరిశోధకులూ పరిష్కర్తలూ పీఠికా కర్తలూ వుంటూనే వున్నారు. వీళ్లందరూ ఒక మాట చెబుతారు. ఏమనంటే- వెలిగందల నారయ్య కవిత్వం ఏకాదశ ద్వాదశ స్కంధాల్లోనే కాదు ద్వితీయ తృతీయ స్కంధాల్లోనూ, దశమ స్కంధ ఉత్తర భాగంలోనూ కూడా వున్నదీ అని. అందరు వున్నది వున్నదనే వాళ్లేకానీ, ఇవిగో ఈ స్కంధాల్లో ఈ ఫలానా పద్యాలన్నీ

---

1. పంచమ స్కంధాన్ని రెండు ఆశ్వాసాలుగా వ్రాసిన గంగన మాత్రం ఆద్యంత పద్యాలు నందగోప కుమారుడైన శ్రీకృష్ణుని ఉద్దేశించే వ్రాశాడు, షష్ఠ స్కంధం వ్రాసిన సింగయ్య కూడా తన రచనను శ్రీపతికే అంకితం చేస్తూ పద్యాలు వ్రాశాడు. కృష్ణుడికి సమర్పితంగా రాముడు శ్రోతగా పోతన భాగవతం వ్రాసి రామకృష్ణ అవతార భేదాల్లో అభేదాన్ని ఆచరణలో పాటించాడు.

నారయ్యవి అని తాము పరిశోధించి పీఠికలు వ్రాసి ప్రచురించిన ప్రతుల్లో గుర్తుపెట్టి స్పష్టంగా అచ్చు వేయవచ్చుకదా. వేయరు. నారయ్య కవిత్వంలో హరిభట్టు భాగవత పద్యాలు కలిసిపోయినవనీ అంటారు. అంటారేగాని ఆ పద్యాలు ఫలానా అని గుర్తుగా చెప్పరు భాగవత సంపాదకులు.[1] ఆ లెక్కలో చాగంటి శేషయ్యగారే నయం.[2] ఇప్పటి భాగవత ఏకాదశ స్కంధంలోని-22వ కందం. 34వ తేటగీతి, 96వ ఉత్పలమాల పద్యాలూ, ద్వాదశ స్కంధంలోని 3వ కందం, 14వ చంపకమాల, 17వ తేటగీతి, 19వ తేటగీతి. 25వ ఉత్పలమాల, 27వ చంపకమాల —పద్యాలు హరిభట్టుగారి భాగవతంలోనివని గుర్తించి వ్రాశారు. శేషయ్యగారి కంటె

ముందు భాగవతంలో ఏది పోతన రచనమో ఏది కాదో తెలుసుకోటానికి మొదట ప్రయత్నించిన వారిలో వావిలికొలను సుబ్బారావుగారినీ, శేషాద్రి రమణ కవులనూ ఆ పిమ్మట రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి పేర్కొనవలెను. ఏది ఎవరి రచన అన్న ఈ గందరగోళం తేలేది కాదు. కనుక వదలివేద్దాం. భాగవత పూరణం గురించి మరొక ఆలోచన వుంది. వెలిగందల నారయ్య ఏకాదశ ద్వాదశ స్కంధాలు పూరించిన నాటికి పంచమ షష్ఠ స్కంధాలు పోతనగారి రచనగా మంచిగానే వున్నాయి ఆ తరువాత అవి శిథిలమైపోతే గంగన-సింగయలు వ్రాశారు— అని. పోతనగారి తరువాత నారయ్యయే వాటినీ కూడా వ్రాసివుండేవాడు కాదా ? అందువల్ల అయితే పోతనయే ముగ్గురికీ ఆయా భాగాలు వ్రాయటానికి అనుమతించి వుండాలి. లేక పోతే అప్పుడప్పుడుగా శిథిలమైపోయిన ఆ యా స్కంధాలను. ఆ యా కవులు స్వయం ప్రేరణ వల్లనే వ్రాసి వుంచారు అని ఇట్లా అనుకొనటం చేత వచ్చే లాభంగానీ, అనుకోక పోవటంచేత కలిగే నష్టంగానీ ఏమీలేదు. అందువల్ల ఈ చర్చను ఇక కొనసాగించటం దండుగ. ఆంధ్ర మహాభాగవతాన్ని పోతన్నగారితో కలుపుకొని నలుగురు వ్రాశారు. అందరు వ్రాసినదీ కలిసి పోతన్నగారి భాగవతంగా చెలామణిలో వుంది. అందులో అద్వైత మెంతవుందో విశిష్టాద్వైతమూ అంతవుంది.

---

1. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమి ప్రతి. (1977) పీఠిక. 23, 24.
2. ఆంధ్ర కవితరంగిణి. అ. 208, 209.

## II. 1. పురాణము – చరిత్ర

ఈ పురాణ ఉపపురాణ నామరూపాల గురించి ఇదమిత్థమన్న నిర్ణయమేమీ లేదు.[1] బ్రహ్మాండ పురాణ మొక్కటే మొట్టమొదట పురాణమనీ దానినుండి విష్ణు దైవతాకమైన విష్ణుపురాణమూ శివదైవతాకమైన వాయుపురాణమూ ఏర్పడ్డాయనీ తరువాత వచ్చిన వైష్ణవ పురాణాలకూ శైవ పురాణాలకూ ఆ రెండే మూలమనీ పరిశోధకులు కొమర్రాజు లక్ష్మణరావుగారు వ్రాశారు. ఆ లెక్కలో భాగవత పురాణం లోని ప్రధాన కథలన్నీ విష్ణుపురాణంలో కనిపిస్తున్నాయి. విష్ణుపురాణ మున్నప్పుడు దాన్నికాకుండా భాగవత పురాణాన్ని పోతన్నగారెందుకు ఎన్నుకొన్నారో కూడా ఆలోచించాలి. శ్రీమద్రామానుజులకు ముందే ప్రసిద్ధమైన భక్తియోగ సిద్ధాంత గ్రంథంగా భాగవతం ఉండి వుంటుంది. ఎందుకంటే విశిష్టాద్వైత నిర్మాణానికి పాంచరాత్ర భాగవత సిద్ధాంతాలే మూలమని కూడా చెబుతారు[2] విశిష్టాద్వైతమంతా భక్తి వేదాంతమే. భాగవతం విష్ణుభక్తి వేదాంతశాస్త్ర గ్రంథం. స్థలజ్ఞాన విభేదం చేత శైవభక్తులు ఆరురకాలయితే, అనుష్ఠాన స్థితివిబట్టి వైష్ణవ భక్తులు పదిరకాలు. పోతన్నగారందులో భాగవత పరమ భాగవతానుష్ఠాన స్థితినందుకొన్నవాడు. ఆయనకు భాగవతం రుచించినట్లుగా విష్ణు పురాణం రుచించి వుండదు.

భక్తివేదాంత మతం విశిష్టాద్వైత తాత్విక దృక్పథాన్ని అవలంబించినంత మాత్రం చేత అది విష్ణుదైవతాకమే కానక్కరలేదు. అంటే బ్రహ్మమును శ్రీమన్నారాయణాఖ్యంగానే చెప్పనక్కరలేదు. అందువల్ల భాగవతపురాణ రచయితగా పోతన విష్ణుభక్తుడైనా ఆయనకు భాగవత పరమ భాగవత స్థితిగానీ చక్రాంకుడూ ఊర్ధ్వపుండ్రధారీ అయిన వైష్ణవుడు కానక్కరలేదు హరిహర చరణారవింద వందనాభిలాషమును[3] ఆయన విడనాడలేదు.

మన పురాణాలే మన చరిత్రలు కావు. కానీ చారిత్రిక విషయాలు అన్నీ కాక పోయినా కొన్నైనా మనకు పురాణాల్లో లభిస్తాయి. అయితే అవి అక్కడ ఆధ్యాత్మిక వాతావరణంలో వుంటాయి. మరొకటి కూడా ఏమిటంటే ఆ పురాణ చారిత్రిక

---

1. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం – ప్రథమాంధ్ర మహాపురాణం– పు. 3–39.
2. అనుభవానంద స్వాములవారు – సర్వసిద్ధాంత సౌరభం. 7–255.
3. భాగవతం : ప్రథమస్కంధం – 10.

సంస్కృతే మొత్తం భారత హిందూ సంస్కృతి. అదే బహుభాషల బహువిధాల దేశం నలుమూలలా పరివ్యాప్తమైంది ఆలా వ్యాప్తిచెందటంలో ఆయాదేశ కాలపరిస్థితుల ప్రభావాలు ప్రక్షిప్తాలుగా రూపురేఖలతో మన పురాణ సంస్కృతీ సాహిత్యంలో ఎన్నో లీనమైపోయాయి. వాటినిప్పుడు అవి ఎప్పుటెప్పటివి? ఎక్కడెక్కడివి? ఎవరెవరివి? అని గుర్తించటం సాధ్యం కాదనటం కంటె కష్టసాధ్యమనటం మంచిది[1]— ఇది మన పురాణ చారిత్రిక సంస్కృతి.

మన పురాణాలే మన శాస్త్రాలు కావుకానీ ఆయాశాస్త్ర విషయాలు అక్కడక్కడా పురాణాల్లో ప్రతిపాదితాలై కనిపిస్తాయి. అయితే శాస్త్రవిషయాలు కూడా ఆధ్యాత్మిక వాతావరణంలోనే వుంటాయి. పురాణాల చారిత్రికతను వాటిలోనే ఆధ్యాత్మిక వాతావరణంలో వున్న ఖగోళాదిశాస్త్ర విషయా లాధారంగా నిరూపించాలన్న ఆలోచన కూడా లేకపోలేదు. ఖగోళ విషయాలను మన పూర్వీకులయిన ఎన్నోతరాల వాళ్లు విశతంగా పరిశీలిస్తూ అనుభవాల నందజేసుకొంటూ నిబద్ధులై ప్రవర్తించిన కారణంగానే జ్యోతిశ్శాస్త్రం రూపుదాల్చటం అభివృద్ధి కావటం జరిగింది. ఆయా విషయాలు పురాణాల్లో వున్నమాట నిజమే. వీటితోపాటు చరాచరాత్మకమైన ఈ సృష్టిని గురించిన ప్రాచీనుల ఊహాపోహలెన్నో వుంటాయి. అవన్నీ యుక్తి ప్రయుక్తులచేత నిరూపితము లవుతూ తోసివేయబడుతూ ఆధ్యాత్మిక శాస్త్ర విషయాలుగా ఒకస్థితిని పొంది వుంటాయి. వీటి ప్రభావంలోనే మిగిలిన అన్ని విషయాలూ పురాణాల్లో వుంటాయి. ఇంద్రియానుభవ గోచరంగా వుండటం కంటె అతీంద్రియానుభవ గోచరంగా వుండటం- ప్రత్యక్షానుమాన ప్రమాణముల మీదకంటె శబ్దానుమాన ప్రమాణముల మీద విషయవిజ్ఞాన ప్రతిపాదన మాధారపడివుండటం మన పురాణసంస్కృతిలో మనం చూస్తాం. ఇది కారణంగానే ఆధునిక కాలంలో మొత్తం భారతీయ సంస్కృతికి చారిత్రిక పునాది చాలా బలహీనంగా వుందనే వాదమూ, పురాణమే చరిత్ర గనుక పురాణ చారిత్రిక సాంస్కృతిక బలమే భారత జాతీయ సంస్కృతి లక్షణమనే వాదమూ రెండూ వున్నాయి. ఈ రెండింటిలో మొదటిదాన్ని చారిత్రిక భౌతికవాదమనీ, రెండవదాన్ని ఆధ్యాత్మిక భావవాదమనీ అంటారు.

దేశభాషల్లో వచ్చిన ప్రాచీన సాహిత్య అధ్యయ నావగాహనకు భారతీయ ఆధ్యాత్మిక భావవాద తాత్విక దృక్పథం వుండటం అవసరం. స్థూలంగా ఆధ్యాత్మిక భావవాదమని అంటున్నాం కానీ అందులో ఎన్నో మతభేదాలు' భిన్నవాదాలూ, సంస్కరణ భావాలూ, అనుష్ఠానంలో అలవోకతనం, సైద్ధాంతిక రాద్ధాంతాలూ— ఇలా ఎన్నో వేర్వేరు అంశాలుగా వుంటుందది.

1. The cultural Heritage of India. vol. II. P. 241

## II. 2. పౌరాణిక చారిత్రక దృక్పథాలు

ఆధ్యాత్మిక భావవాదానికీ చారిత్రక భౌతికవాదానికీగల అవినాభావ సంబంధాన్ని గుర్తించవచ్చు. పదార్థ సముదాయమంతా జడచేతనాత్మకంగా వుంటుందనటంవరకూ రెండు వాదాలూ అంగీకరిస్తాయి. ఆర్షమైన భావవాద దృక్పథం పదార్థంలోని జడాంశను పరిగణనంలోకి తీసుకోకుండా చైతన్యాంశమునే గ్రహించి చిదంశ మాత్రావబద్ధ బుద్ధి[1]తో ప్రవర్తిస్తుంది. అనుగతాలుగా వుండే జడచేతన విరుద్ధాంశాల సంఘర్షణ ఫలితంగానే పదార్థ సముదాయం చరాచరాత్మకమైన సృష్టిగా పరిణమించివదని చారిత్రక భౌతికవాదం చెబుతుంది. చైతన్యానికి భౌతికపునాది వున్నదని చారిత్రిక భౌతిక దృక్పథమూ. భౌతిక పునాదితో చైతన్యానికి నిమిత్తంలేదు– అది సర్వజ్ఞమైన పరమాత్మ– ఆ పరమాత్మవల్లనే సమస్తమూ వ్యక్తమవుతున్నది అను ఈ రకమైన ఆలోచనా విధానమంతా ఆధ్యాత్మిక భావవాదానికి మూలమైన ఆర్షసంప్రదాయ వైజ్ఞానిక దృష్టి వేదాలు వేదార్థ ప్రతిపాదకాలయిన పురాణ న్యాయ మీమాంసాదులన్నీ ఆర్ష సంప్రదాయ విషయాత్మకములే అందువల్ల పురాణ విషయాన్ని విచారించటానికి ముందు ఆధ్యాత్మిక భావవాద ఆలోచనా విధానం తెలియాలి చారిత్రక భౌతికవాద ఆలోచనా విధానం ఒకవిధంగా ప్రకృతి శాస్త్రాలూ, జీవశాస్త్రాలూ, సామాజిక శాస్త్రాలూ మొదలయిన ఆధునిక వైజ్ఞానిక పరిశోధనల ఫలితంగా అభివృద్ధి అయింది. వేదార్థ ప్రతిపాదకమైన పురాణేతిహాస వాఙ్మయమును అధ్యయనం చేయటానికి ఏ దృక్పథంతో బయలుదేరటం మంచిది అన్న విషయం తేల్చుకోవాలి విచారణ చెయ్యకుండా తేలదు. విచారణకు గురిచేయబడుతున్న విషయంతో మనకు శత్రుత్వం గానీ, మిత్రత్వంగానీ వుండని మంచితన మొక్కటి ఉండాలి. దానికే శాస్త్రీయత అనిపేరు. మానవజాతి మనుగడకు అభివృద్ధికి కారణభూతమైన హితార్థమును విధిగా ప్రతిపాదించేది శాస్త్రము. మానవజాతి యొక్క అభివద్ధి అంటే సనాతన వైదిక బ్రాహ్మణ మతం మోక్షమని ప్రతిపాదించింది. అది ఆధ్యాత్మిక భావం. దేవతా భావం పొందటం దగ్గర నుండి బ్రహ్మ భావం పొందేంతవరకు విద్యాస్థానాలన్నీ ప్రభు సమ్మితంగా. మిత్ర సమ్మితంగా, కాంతా సమ్మితంగా పరమమైన ప్రజా శ్రేయస్సును ప్రబోధిస్తున్నాయి. అందువల్ల అవన్నీ శాస్త్రములే. అధ్యయనానికి

1. భారతీ విరుక్తి, పీఠిక. 19.

కూడా రెండు దృక్పథాలున్నాయి. వ్యక్తిగా అనుభవించటం కొరకు అధ్యయనం చెయ్యట మొక్కటి, సామాజికంగా ఆచరించటం కొరకు అధ్యయనం చెయ్యట మింకొకటి. మొదటిది ఆధ్యాత్మిక భావవాద దృక్పథం. రెండవది చారిత్రక భౌతిక వాద దృక్పథం. మోక్షశాస్త్రమైన భాగవత పురాణాన్ని మోక్షానుభవం కొరకు అయితే ఆధ్యాత్మిక భావవాద దృక్పథం నుండి అధ్యయనం చెయ్యటం శాస్త్రీయం. సామాజిక జీవితంలో ఆచరించటం కొరకు అయితే చారిత్రిక భౌతికవాద దృక్పథం నుండి అధ్యయనం చెయ్యటం శాస్త్రీయం. ఈ విధంగా ఈ రెండు తాత్విక వాద ధోరణులకు కూడా అవినాభావ సంబంధ మున్నది భాగవత పురాణ అధ్యయనం విషయంలో పాఠకులు తమకిష్టమైన మార్గాన్ని రెండింటిలో ఒకదాన్ని ఎన్నుకోవచ్చు రెండింటినీ ఎన్నుకొని విడివిడిగా ఆయాదృక్పథాల నుండి అధ్యయనం చెయ్యవచ్చు. ఏమిచేసినా రెండింటినీ కలగాపులగం చేయటం ద్వారా అయోమయత్వాన్ని సృష్టి చేయకుండా వుండటం చాలా అవసరం. మోక్షం వ్యక్తిగతమైంది. జీవితం సామాజికం మోక్షం ఆధ్యాత్మిక సత్యం. జీవితం భౌతిక సత్యం. జీవిత వాస్తవికతలు కూడా అనూచానంగా వస్తున్న ఆధ్యాత్మిక భావజాల ప్రవాహాలలోనై ఒకవిధమైన మార్మికతను సంతరించుకొని జనాచారమనే పేరుమీద విధికంపై బలవత్తరములై కూర్చున్నప్పుడు మేధావులు శాస్త్రీయ విచారణ చేసి చెయ్యాలన్న ఒక చూపుకూడా భాగవతంలో వుంది.



## II. 3. శాస్త్రీయము – జనాచారము

ఏ విషయాన్నిగానీ రెండు ముఖాలనుండి దాని ఉచితానుచితాలను విచారించి ఏ ముఖాన్ని ప్రముఖం చేసి చెయ్యాలనుకొంటే అలా చెయ్యవచ్చు. ఇంద్రయాగం చేద్దామని నందుడు మొదలయినవారు శ్రీకృష్ణునివద్దకు వచ్చారు. ఆయన వాళ్లతో అంటున్నాడు– అసలీయాగము శాస్త్రీయమా– జనాచారమా? శాస్త్రీయమైతే శాస్త్రీయమని చేద్దాం. శాస్త్రీయం కాదు జనాచారమంటారా జనాచారమనే చేద్దాం. అదేదో తెలియకుండా, ఎవరికి వాళ్ళకు లోపలలోపల తెలిసినా పైకి నలుగురూ తెలియచెప్పుకోకుండా గుడ్డిగా చేయటం మంచిదికాదు. మనం చేస్తున్నది శాస్త్రీయమో జనాచారమో మన శత్రువులకు తెలియకుండా చేయటంవరకు బాగానే వున్నాగానీ, మన మిత్రులకుకూడా తెలియనీయకుండా చేయాలనుకోటం ధర్మం కాదు పగనుకానీ, చెలిమినిగానీ ముందు పెట్టుకొని విషయానికి సంబంధించిన శాస్త్రీయతను, జనాచార వ్యవహారాన్నీ నిర్ణయించటం మంచిదికాదు. విషయ విచారణకు పగగానీ, చెలిమిగానీ లేని మంచితనమొకటి ఉండాలి అలాంటి మంచివాళ్లు మాత్రమే విషయ విచారణచేసి దాని శాస్త్రీయతను నిరూపించగలరు. శాస్త్రీయత ఒకవేళ లేకపోయినా జనాచారమని నెత్తికెత్తుకోవలసిన అవసరమువస్తే ఎత్తుకోవచ్చు. అవసరానికి నెత్తికెత్తుకొంటున్నాం గదా అని అదే శాస్త్రీయమని చెప్పటానికి తంటాలు పడకూడదు. – అని ఈ విధంగా నందాదులుచేయదలచిన ఇంద్రయాగంగురించి శ్రీకృష్ణుడు ప్రశ్నించాడు. నందుడున్న విషయం చెప్పాడు. దీనికంతటికీ ఇంద్రుడంటే తమకున్న భయమే కారణమని. భయమెందుకయ్యా అంటె ఆ యాగంచేసి ఇంద్రుణ్ణి సంతోషపెట్టకపోతే ఆయన తన చేతిలోవున్న అధికారాన్ని ఉపయోగించి వాళ్ళందరికీ కష్టనష్టాలు కలిగిస్తాడని భయమట. కలిగిస్తానని ఆయన చెప్పలేదు. కలిగిస్తాడని వీళ్లే భయాన్ని పొందుతున్నారు– కామలోభ భయద్వేషకృతులగుచు–(879) జనాచారములన్నింటికీ ఈ కామలోభ భయద్వేషములే కారణాలు. వీటితో నిమిత్తము సంబంధమూ లేని క్రియలే శాస్త్రీయములు. యాగంజేస్తే ఇంద్రుడు సంతోషించి వానలు కురిపిస్తాడనీ, వానలకు గడ్డి పెరిగి పశువులకు మేత సమృద్ధిగా వుంటుందనీ, ధేనువులు ఆహార పుష్టిగలిగి మంచి పాడినిస్తాయనీ, పాడివలన మనుషులు తాము సుఖపడుతూ

---

1. దశమ స్కంధం పూ.భా. 877

దేవతలనుగూడా తృప్తిపరుస్తారు. ఇంద్రయాగం చేయటానికి నందుడు చెప్పిన కారణమిది. ఇది జనాచారం అంటే ఒక విధమైన మూఢనమ్మక మన్నమాట. శ్రీకృష్ణుడు ఈ శాస్త్రీయముకాని జనాచారాన్ని ఖండించి దాని పునాది లేవితనాన్ని ప్రదర్శించటానికే నందుణ్ణి ప్రశ్నించాడు. జనాచారంగా నందుడు చెప్పినదానికి శాస్త్రీయంగా వర్షాలు పడటానికి ఇంద్రుడికీ ఏమీ సంబంధంలేదనీ అందువల్ల మూఢాచారంగా వస్తున్న ఇంద్రయాగాన్ని చేయనక్కరలేదనీ— చేయలేదని ఒకవేళ ఇంద్రుడికి కోపం వచ్చినా ఆయన చేయగలిగింది ఏమీలేదనీ చెప్పి ఆ యాగాన్ని ఆపి ఇంద్రుణ్ణి నిగ్రహించాడు[1] శ్రీకృష్ణుడు. గోవర్ధన పర్వతోద్ధరణ కథ శాస్త్రీయమైన ఆలోచనవల్ల జనాచారాన్ని త్రోసి రాజనటానికి నిదర్శనమైన కథ.

రుక్మిణీ కల్యాణం గురించి చెబుతారు— పెండ్లికాని ఆడపిల్లలు గనుక ఆ కథను పారాయణంగా చదవటం మొదలుపెడితే పెండ్లి అవుతుంది అని. పెండ్లిగాని మగపిల్లలకు రుక్మిణీ కల్యాణ కథాపఠనం పనిచేస్తుందో లేదో తెలియదు. అసలా కథకు ఆ మాహాత్మ్యముందని ఎక్కడాలేదు. భాగవతం పుట్టినప్పటి నుండి ఆ కథకా మాహాత్మ్యం జనంలో వ్యాపించి వుందని చెప్పటానికి వీలుకాదు. ఆడపిల్లలకు పెండ్లిండ్లు కావటం కష్టంగా పరిణమిస్తున్న వరవిక్రయ వ్యాపారం అభివృద్ధి అవుతున్న కాలంలో, అక్షరం ముక్కలు వచ్చిన ఆడపిల్లలకు కాలక్షేపంగా రుక్మిణీ కల్యాణం చదువుకోటం మంచిదని ఎవరో అని వుంటారు. రుక్మిణీ కల్యాణాన్నే ఎందుకనాలంటే అందులో ఆ అమ్మాయి తాను వరించినవాణ్ణే పెండ్లిచేసుకోటమున్నది. ఈ పెండ్లికావలసిన అమ్మాయి ఆ కథను చదువుకొంటూ తనను రుక్మిణిగానూ, తన ఊహాప్రియుణ్ణి కృష్ణుడుగానూ భావించుకొంటూ మానసికంగా ఒక మత్తుసుఖాన్ని అనుభవిస్తుంది. పెండ్లికాలేదన్న దిగులు నుండి అదొక తాత్కాలిక విముక్తి. అంతే దానికి ప్రయోజనం. ఊహాప్రియు డెవడో ఒకడు హఠాత్తుగా దిగివస్తే వాడితో లేచి పోవటం జరిగితే ఎలా అన్న విషయాన్ని రుక్మిణీ కల్యాణానికి మాహాత్మ్యాన్ని భావించినవా రూహించలేదు. ఆడపిల్లలు స్వతంత్రించి ఇతన్ని నేను పెండ్లిచేసుకొంటాను అని అనేకాలాన్ని ఇప్పటికింకా మనం రానీయటం లేదుకదా ? రుక్మిణీ కల్యాణం చదివితే పెండ్లి అవుతుందని చెప్పినవాడు కాలక్షేపానికి పనికి వస్తుందని చెప్పినట్లా ? రుక్మిణి చేసినట్లు చెయ్యమని చెప్పినట్లా ? కాక నిజంగా ఆ కథకు ఆ

---

1. దశమస్కంధం— పూ. భా. 924.

మాహాత్మ్యముందని చెప్పినట్లా? ఉన్నదంటే అంతకు ముందే ఉన్నట్టుకదా? కన్యాశుల్కపు రోజులలో ఆడపిల్లలు రుక్మిణీ కల్యాణాలు చదువవలసిన అవసరం లేదు. మరి ఆ కథకు ఆ మహాత్మ్యాన్ని ఆయన ఏలా కనిపెట్టారు? మాహాత్మ్యం లేదు. కనిపెట్టటం లేదు. అవసరం వచ్చింది. కాలక్షేపానికి ఆ కథ చమత్కారకారిగా పని చేసేదిగా వుంది. మాహాత్మ్యం కల్పింపబడింది. మాహాత్మ్యమంటేనే కార్యకారణ సంబంధ విరహితం కదా? అందువల్ల ఆదొక ఆధ్యాత్మిక మార్మిక భాగంగా తయారై ప్రచారంలోకి ఎక్కింది ఇప్పుడది జనాచార మన్నమాట. శాస్త్రీయ విచారణకు పెడితే దాని భౌతికపునాది ఏమిటో తెలుస్తుంది. భౌతికపునాది ఎక్కడో ఒకచోట లేకుండా ఆధ్యాత్మిక భావజాలం తన వ్యాపక లక్షణంతో సమస్తాన్నీ మింగి త్రేణుస్తున్నట్లు కూర్చోలేదు. బౌతిక పునాదిని త్రవ్వితట్టుకో గలిగినప్పుడు జీవిత వాస్తవికతకు సంబంధించిన ఆధ్యాత్మిక మోహాబుద్ధులు మేల్కొనగలవు.

చారిత్రికంగా రుక్మిణీ కల్యాణం గురించి ఆలోచిస్తే అందులో పెండ్లి సమస్య వుందనీ, అది అటుగానీ ఇటుగానీ తల్లిదండ్రులు కల్పించుకొని పరిష్కరించేది కాదనీ, సామాజిక వ్యవస్థకు లోబడి వధూవరులు పరిష్కరించుకో వలసినట్లుగా పోతన్న గారు వ్రాసిపెట్టారని తెలుస్తుంది. దీనివల్ల పెండ్లిని గురించిన మన ఆలోచనలు పునర్విచారణకు గురియై మార్పులతోనూ చేర్పులతోనూ వర్తమాన జీవితాన్ని సర్దుకోటానికి వీలుచిక్కితే చిక్కవచ్చుగానీ, లోకాచారమని రుక్మిణీ కల్యాణ పారాయణం పెట్టించి లాభంలేదు. తమకు ప్రయోజనకరమైన దాన్ని ప్రజలు ఎటూ పాటిస్తారు. చదువున్నా లేకపోయినా పెండ్లికావాలి కదా- అందువల్ల పెండ్లికీ రుక్మిణీ కల్యాణం చదవటానికీ సంబంధం లేదు.



## II. 4. ఆస్తిక నాస్తికతలు

సగుణమైన నామరూప నిరూపణం కారణంగా విభిన్నంగా ఈశ్వర అస్తిత్వాన్ని పరిమాణీకరించి ప్రచారం చేసిన దాని ఫలితంగానే నాస్తికత అంటే దేవుడు లేడనటంగా రూఢమైంది. వేద నిందకులు నాస్తికులన్నమాట పోయి దేవునియొక్క ఉనికితోనూ లేమితోనూ సంబంధించి ఆస్తికనాస్తిక వాదాలు ప్రబలం కావటానికి పురాణ వాఙ్మయం కొంతదోహదం చేసింది. ఆస్తిక దృక్పథం బలపడటం కోసం పురాణ వాఙ్మయం ఉద్యమిస్తే కాలాంతరంలో ఆస్తిక శబ్దానికి అర్థ విపరిణామం ఏర్పడింది. వేద ప్రామాణ్యాన్ని తాము శిరసావహిస్తున్నందుకు గుర్తుగా పురాణాల్లో కథకులు ఆయా కథలను గాథలనూ అంతకుముందు ఎవరెవరు ఎవరెవరికి చెప్పారో కనీసం నలుగు రైదుగురు వక్తలనూ శ్రోతలనూ పేర్కొంటారు. శబ్దము ప్రమాణం. పెద్దలు ఫలానావాళ్ళు ఇలా చెప్పారు అంటే ఇక దానికి తిరుగులేదన్న మాట. "శ్రుత్యాది దేవతలు నారాయణు నభినందించిన తెరంగున సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారంబని నారాయణర్షి నారదునకుం జెప్పిన నమ్మహాత్ముండు మజ్జనకుండైన వేదవ్యాస మునీంద్రునకు నుపన్యసించె నయ్యర్థంబు నతండు నాకుం జెప్పిన విధంబున నీకుం జెప్పితి.[1]" శుకయోగి పరీక్షిత్తునకు చెప్పిన ఈ విషయం ఇంతకు ముందునుండి పరంపరగా వస్తున్నది. అందుకు గుర్తుగా ఆయన ఒక అయిదుగురు వక్తలనూ అయిదుగురు శ్రోతలనూ పేర్కొన్నాడు. శబ్దప్రమాణ విధేయతను పురాణాలు అనుసరించిన తీరు గమనింప దగింది.

పురాణాలన్నింటిలోనూ కూడా ఆస్తిక దర్శనాల సృష్టి స్థితిలయ విచారణ విషయాలు లోకసామాన్యమైన విశ్వాసాలతో సమ్మిశ్రణమై కనిపిస్తాయి. ఆస్తిక దర్శనాలంటే తమ తాత్త్వికదృక్పథాలకు వేదవాక్యాలను ప్రమాణంగా అంగీకరించేవి. భగవంతుడు– ఈశ్వరుడు– తప్పనిసరిగా వుండాలనేదాన్ని అన్ని ఆస్తికదర్శనాలు అంగీకరించవు. కపిలసాంఖ్యము, కణాదుని వైశేషికం, జైమిని పూర్వ మీమాంస– ఇవి ఈశ్వరుని అంగీకరింపవు. అయినా వేదప్రామాణ్యాన్ని శిరసావహిస్తాయి గనుక ఆస్తికాలయినాయి. జైనం ఈశ్వరుడున్నాడంటూనే వేదాన్ని ఒప్పుకోదు – అందువల్లనే అది నాస్తిక మతదర్శనమై ఆస్తికులచేత విధ్వంసం చేయబడింది.

---

1, దశమస్కంధం– ఉత్తర భాగం– 1230.

వైష్ణవ శైవమత శాఖలు తమలోతాము ప్రతిస్పర్థు లయినప్పటికీ నాస్తిక మతదర్శనా లయిన జైన బౌద్ధాలను ఎదుర్కొనటంలో కనిపించీ కనిపించకుండా కలిసికట్టుగానే పనిచేశాయి. నాస్తిక విధ్వంసనంలో శైవానికి విశేషవిఖ్యాతి రావటానికి అది పైకి కనిపించటమే కారణం.[1]— ముఖ్యంగా పురాణ వాఙ్మయం ఈశ్వర ఆస్తికదర్శన తాత్త్విక ధోరణులను విశదం చేయటానికి అవసరమైన కథలనూ గాథలనూ కల్పించ టానికీ- సంపుటీక రించటానికి అద్భుతంగా సహాయపడింది. తత్వ వివేచనం వుంటుంది- కానీ అంతకంటే ఈశ్వర అస్తిత్వాన్నీ భగవద్వైభవాన్నీ పురాణాలు ఎక్కువగా చెబుతాయి. ఈ చెప్పటంలోనే అభిప్రాయ రుచిభేదాలు పనిచేసి తాత్త్విక చింతన క్రిందై శివుడో- విష్ణువో- అమ్మవారో ఎవరో ఒకరి పూర్ణాధిపత్యం మీదై శైవ, వైష్ణవ, శాక్తేయ శాఖలుగా విడివడి పురాణాలూ మతాలూ వ్యాప్తిలోకి వచ్చాయి.[2] ఈ రావటం ప్రభావంవల్ల నిరీశ్వర ఆస్తికదర్శన తత్వ వివేచనలో ఈశ్వరుడు ప్రవేశించి అవికూడా అయినంతవరకు సేశ్వరాలయినాయి. అందువల్లనే పురాణాల్లో సాంఖ్యం- పూర్వమీమాంసా- ఉత్తరమీమాంసా- యోగం ఈ మొద లయిన తాత్త్విక దృక్పథాలు ఈశ్వర అస్తిత్వాన్ని అంగీకరించిన వన్నట్లే ప్రతి పాదింపబడ్డాయి.

ఈశ్వర అస్తిత్వం మీదా, వ్యాసదర్శనమైన ఉత్తరమీమాంస మీదా సమాన ప్రతిపత్తి కలిగిన శ్రీమద్రామానుజుల విశిష్టాద్వైత తాత్త్విక సిద్ధాంతానికి భాగవత పాంచరాత్ర సిద్ధాంత విషయాలు పునాదిగా పనికి వచ్చాయంటే భాగవత పురాణంలో ఈశ్వర అస్తిత్వం భగవంతుడైన శ్రీమన్నారాయణ ఆది విష్ణువుయొక్క లీలావతార వైభవ ప్రదర్శనగానూ తాత్త్వికదర్శన విషయాలు కలగా పులగంగా[3] భక్తి వేదాంత నిరూపణంగానూ వున్నాయన్న మాట. ఈ నిరూపణ నేపథ్యంలోనే భాగవతంలో భగవద్వైభవ ప్రదర్శన.

1. సర్వేపల్లి రాధాకృష్ణుల భారతీయ తత్వశాస్త్రము (అను) 5-272, 369.
2. While they incorporate, on the other hand, extensive glorifications of one or more of the sectarian deities like Brahma, Visnu and Siva, add numerous chapters or new myths and legends- Ect- The cultural Heritage of India. Vol II. P.246.
3. బౌద్ధమతంలోని బోధిసత్వ ధర్మలక్షణాలుకూడా ప్రహ్లాద చరిత్రలోనూ (సప్తమ) రంతిదేవుని చరిత్రంలోనూ (నవమ) కలసి వున్నాయని అంటారు.

The Cultural Heritage of India- Vol. I. P. 585, 573.

## II. 5. భాగవత వైభవం

భాగవతపురాణ అధ్యయనావగాహనకు ఆధ్యాత్మిక భావవాద తాత్త్విక దృక్పథం వుండాలని వేరుగా చెప్పనక్కరలేదు. ఆధ్యాత్మిక వాదంలోని మహనీయ లక్షణమేమిటంటే అవసరం వస్తే అది తనను తానే ఉపసంహరించుకోగలదు. ఈ సమస్త చరాచర ప్రపంచమూ అయ్యీ కాకుండా కూడా వుండే పరమార్థభూతమైన వస్తువు తెలుసుకోవలసింది ఒకటి వున్నదన్న ప్రకటన చేయవలసిన అవసరం వచ్చినప్పుడు ఆ ప్రకటన చేస్తూ ఆధ్యాత్మవాదం తానుపసంహరించుకొంటుంది. సరిగ్గా భాగవతం చేసినపనే అది. ఆయగవ దుదయాస్తమయ సంధ్యాసౌందర్య కిర్మీరశోభా ప్రదర్శన సాహిత్యరంగ మంటపంగా పోతన్నగారు తెలుగులో భాగవత నిర్మాణం చేశారు. పరమార్థభూతమైన వస్తువంటే సగుణం మాత్రమేకానీ, నిర్గుణం మాత్రమేకానీ–కావటువంటి పదార్థంమాత్రమేకానీ, చైతన్యంమాత్రమేకానీ కానటువంటి కార్యకారణ విషయాల నధికరించి ప్రవర్తించే ఆత్మతత్త్వం. దానికే అధ్యాత్మమని పేరు. అధ్యాత్మతత్త్వ ప్రదీకమే అధ్యాత్మవాదం. అధ్యాత్మ తత్త్వజ్ఞానం వల్లనే మోక్షం గనుక ఆ మోక్షం సంసార ప్రవిష్టులయిన మహాజనాలకు సులభంగా పొందటానికి వీలయిన విష్ణుభక్తిమార్గాన్ని విశదపరచటమే భాగవత లక్ష్యం. భక్తిని అలవాటు చేస్తే జ్ఞానము దానివల్లముక్తి అప్రయత్నంగానే సిద్ధించటం గురించి ప్రబోధించటమే భాగవత పురాణ ఉద్దేశం విష్ణుభక్తి అంటే విష్ణు సేవాబుద్ధి అని అర్థం.

సర్వాతీత స్థితి యందున్నట్లు చెప్పబడుచున్న పరబ్రహ్మమును సుగుణాత్మక విభవార్చన మూర్తిగా భక్తపరాధీనుడుగా చేసి భక్తజన హృదయాలకు సన్నిహితంగా తెచ్చి అనుభవామృత ఆస్వాదనకు దోహదం చేసిన మహాపురాణం భాగవతం. విష్ణు సేవాబుద్ధిని ఇంతగా విస్తరింపజేస్తున్న ఈ భాగవతం శ్రీమద్రామానుజులవారి విశిష్టాద్వైత సిద్ధాంతానికి ఎంతగా అనుకూలంగా వున్నదో అద్వైత వేదాంత సిద్ధాంతానికి అంత అనుకూలంగా లేదు. లేకపోయినా శ్రీధరులవారి అద్వైత వ్యాఖ్య అనీ, పోతన్నగారు అద్వైతియనీ, ఆ వ్యాఖ్యానాన్నే అనుసరించి భాగవతాన్ని అద్వైత గ్రంథంగా తీర్చిదిద్దాడనీ చెప్పటమూ వ్రాయటమూ ఎక్కువగానే యున్నది. నిజానికి పోతన్నగారి భాగవతంలో నీరక్షీర న్యాయంగా వున్న ప్రధాన వేదాంత తాత్త్విక విషయాలను ఇది ఇదీ అని వేర్పాటు చేయటానికి కావలసిన పరిశోధన జరుగలేదు గనుక జరుగవలసివుంది జరిగితే ఇది విశిష్టాద్వైత సిద్ధాంత తాత్పర్య ప్రపంచకమైన పురాణ కావ్యంగా తేలుతుందని అనిపిస్తున్నది.

భాగవతం తాను ప్రతిపాదిస్తున్న వాసుదేవ పరబ్రహ్మ తత్వమును రెండు ముఖాల నుండి చేస్తున్నది. చిదచిద్విశిష్టమైన శ్రీమన్నారాయణాఖ్య వైకుంఠ వైభవమంతా పూర్వ ముఖం. శ్రీకృష్ణావతార వైభవమంతా ఉత్తర ముఖం. ఈ రెండు ముఖాలనుండి కూడా భగవద్వైభవం భక్తిచేయటానికి అనువైనదిగానూ, భక్తిచేత పొందదగిందిగానూ, భక్తానుగ్రహ పరాయణంగానూ, భక్తపరాధీనంగానూ, అంతిమంగా భక్తకామదంగానూ— ఈ మహాపురాణం నిండా వర్ణింపబడివుంది.

జీవితమంతం కావటానికి ఏడురోజులు కాలవ్యవధి ఉన్నది అని తెలిసినవానికి మళ్లీ సంసారపద్ధతి జన్మం లేకుండా మోక్షం సిద్ధించటం కొరకు వినిపించబడిన మహాపురాణం ఈ భాగవతం- బ్రహ్మసమ్మతమైనది. ఇది కైవల్య గౌరవప్రదం. ఇక్కడ కైవల్యమంటే మహోన్నతమైన వైష్ణవపదం. పరమాత్మ రూపమూ ఆనందమయమూ అయిన వాసుదేవ బ్రహ్మకైవల్యమును చేరుకోవాలన్న ఆతురతతో కదా పోతన్నగారు ఈ భాగవత రచనాచింతన కుపక్రమించింది! భాగవత గ్రంథ శ్రవణ మననాలకు నిధిధ్యాసనమునకు ప్రయోజనం ఉభయలోక- ఇహపర- సుఖ సంపాదనమని చెప్పబడ్డా ప్రధానంగా 'పారలౌకిక సాధన భూతంబగు పరమ కల్యాణంబు సాధించు'కొనటమే. ఇహలోక సుఖసంపాదనం అసాధ్యమని తెలిసికొన్న ప్రాచీనులు ఈ లోకజీవనం పట్ల విముఖులై విరక్తిని పెంచుకొన్నారు. విరివిగా ప్రచారం చేశారు. రక్షణలేని ఇహలోకవాసులకు రక్షకుడొకడెక్కడో ఉన్నాడని ధైర్యం చెప్పి ఓదార్చటానికి కూడా ప్రాచీనులు కృషిచేశారు. ఇక్కడ రక్షించవలసిన రాజు ప్రజలను రక్షించకపోతే రక్షించే రాజునుగానే భగవంతుని గురించి చెప్పారు. "రక్షకులు లేనివారల రక్షించెదననుచు చక్రిరాజై యు"న్నాడట. (2.12) సామాజిక దైనందిన జీవితంలో విరక్తినీ, సృష్టి స్థితిలయలకు సంబంధించిన తాత్విక విషయ వివేచనలోనూ, నిమిత్తోపాదాన కారణభూతమైన భగవన్నామరూప సంకీర్తనంలోనూ రక్తినీ పెంపొందించటం ద్వారా మహాజనానికి సంసారబాధా విముక్తిని సంపాదించటమే పురాణ వాఙ్మయ ప్రయోజనం. ఈ మహాప్రయోజనాన్ని పోతన్నగారి భాగవత పురాణం తెలుగులకు సమకూర్చి పెట్టినట్లుగా మరే ఇతర పురాణమున్నూ పెట్టలేదు ఇది నిజమేగానీ మరొక విచిత్రమేమిటంటే- సంసారపద్ధతి విషయంలో విరక్తికలగటానికి ఎంత చెప్పాలో అంతచెబుతూ కూడా,[1] కర్మకాండను నిరసిస్తూకూడా,[2] పక్ష

1. భాగవతం ద్వితీయ స్కంధం- 3.
2. ,, ,, ,, 217.

...క్కనే వర్ణాశ్రమాచార ధర్మాలను పాటించటం గురించి ప్రబోధించటం కూడా ఇన్ని పురాణాల్లోలాగానే ఈ భాగవతంలో కూడా వున్నది.[1] వర్ణాశ్రమ ధర్మప్రబోధం ఆస్తిక బ్రాహ్మణ మతాన్ని కర్మమార్గాన్ని సమర్థించటమే.

అఖిల లోకములకు హరిదైవతము సూడ
హరికి దైవతము ధరాధినాథ!
పదపరాగదేశ సంసక్తిచే త్రైలోక్య
పావనంబు సేయు బ్రాహ్మణుండు.[2]

ఈ పద్యభావం భాగవత పురాణతత్త్వానికి అననుకూలమైంది. అయినా పోతన్నగారెందుకు వ్రాశారు? వైదిక బ్రాహ్మణ మతకర్మ మార్గానికి వ్యతిరేకంగా వర్ణాశ్రమాచారాలను అంగీకరించని మతాలు ఎన్నితలయెత్తినవో అవన్నీ నశించినవి- నశించక నిలచివున్న శైవ వైష్ణవమతాలు వర్ణాశ్రమాచారాలపట్ల తమకు మొదటవున్న వ్యతిరేకతను తగ్గించుకొని క్రమంగా తొలగించుకొని ఆ చట్రంలోనే తాము కూడా ఇరికి పోక తప్పలేదు. ఆ తప్పని తనానికి నిదర్శనమే ఆ పద్యం- ఇంకా అలాంటివి ఎక్కడ వున్ననూ, అయితే ఆ పద్యం తెలుగులోనే కొత్తగా వచ్చిందా సంస్కృత మూలంలో దాని అర్థమో భావమో లేదా అనవచ్చు. శైవ వైష్ణవమతాలు వైదిక మతాచార చట్రంలోకి కుదించుకోవటం సంస్కృతంలోనే జరిగింది. పదిహేనవ శతాబ్దంలో పోతన్నగారు తెలుగు భాగవతం వ్రాయటంలో జరిగిన మార్పు కాదది సంస్కృతంలో వున్నవాటినే తెలుగులో వ్రాయటం జరిగింది. తెలుగులోని పురాణేతిహాసాల తాత్పర్యం వైదికధర్మానికి వ్యతిరేకంగా పోవాలన్న ప్రయత్నమెప్పుడూ చేయలేదు. చెయ్యటానికి వీలున్న వీరశైవతీవ్ర పురాణధోరణి కూడా ఆ విషయంలో వెనకడుగు వేయనేవేసింది. ఇక వైష్ణవం సంగతి చెప్పనే అక్కరలేదు.

---

1. భాగవతం సప్తమ స్కంధం- 408 - 419.
2. " " " 454.
3. It was the Brahmanas who were given the highest place in society. As they formed the intellectual class among the Aryans, they could naturally command, at least claim for themselves, the highest respect.

The Cultural Heritage of India. Vol. II. P. 247.

వైదికమార్గ నిష్ఠమగు వర్తనాన్ని ఆదేశపరిగా ప్రబోధించక పోయినా వర్ణాశ్రమా చార ధర్మానుష్ఠాన ప్రశంసను చేస్తుంటుంది భాగవతం. అందులోనూ ముఖ్యంగా బ్రాహ్మణ ప్రాధాన్యాన్ని విష్ణుభక్తితో కలిపి రంగరించి చెప్పటం ఎక్కువ. "జాతి మాత్రంబున పురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు. శమదమాది వర్ణలక్షణ వ్యవహారంబుల గనవలయు-[1]"నని చెబుతూనే "బ్రాహ్మణుండు జననమాత్రంబున జీవకోటియందు ఘనుండై యుండు జపతపోధ్యానాధ్యయనాభ్యాత్మలం జతురుండై మత్కళాశ్రయుం డయ్యెనేని నతండుత్తముండు-[2]" ఈ ప్రకటన వాక్యాలు రెండూ పరస్పర విరుద్ధ విషయాలను చెబుతున్నవి కదా! ఇది అద్వైతవిధానం కాదు. భేదా భేద విశిష్టవాదమే విరుద్ధ ధర్మాలను అంగీకరిస్తుంది. విశిష్టాద్వైత భాగవత భక్తి వేదాంతంలో వర్ణాశ్రమాచార ధర్మవిచార తాత్పర్యం ఇప్పుడు స్పష్టం కావటం లేదా? అసలు భగవంతు డవతరించటానికి కారణం వేదమార్గం చెడి, వర్ణాశ్రమ ధర్మాలు లోపించి గోబ్రాహ్మణ రక్షణ అవసరం ఏర్పడటం. అందువల్ల శ్రీకృష్ణావతారాన్ని వర్ణించే భాగవతం వేదాలనూ బ్రాహ్మణులను వర్ణాశ్రమాచార ధర్మాలను నిలబెట్ట కుండా వుండదు.

1. సప్తమ స్కంధం- 419.
2. దశమ స్కంధం- ఉ. భా. 1198.

## II. 6. భాగవత వస్తువు

విజ్ఞానార్జనవల్ల ఏమిటి ప్రయోజనమంటే ఆనందమే ప్రయోజనం. విజ్ఞాన భేదాలెన్నో ఆనందభేదాలూ అన్ని. తైత్తిరీయంలోని ఆనందవల్లి ఆనందముయొక్క స్వరూప స్వభావాలను వివరించింది. ఆనందమే బ్రహ్మమనీ నిరుపాధికమైన బ్రహ్మానందమే పరమార్థభూతమైన మోక్షస్థితి అనీ ఆధ్యాత్మిక భావవాదతాత్విక గ్రంథం గనుక ఆ ఉపనిషత్తు అలా చెబుతుంది. ఉపాసనకు అంటే ఆనందం కొరకు చేయవలసిన కార్యాచరణకు సోపాధిక బ్రహ్మము ఎక్కువ అనుకూలం. అంటే ఉపాధిగతంగా బ్రహ్మమును– ఆత్మగా ఈశ్వరుడుగా వాసుదేవ భగవంతుడుగా శ్రీకృష్ణుడుగా ఉపాసించవచ్చు. ఉపాధి భేదాన్నిబట్టి బ్రహ్మము స్త్రీదేవతగా కూడా ఉపాస్యం కావచ్చు. లలితామహా త్రిపురసుందరీ మంగళచండికా మొదలయిన నామరూపాలన్నీ బ్రహ్మముయొక్క స్త్రీ ధర్మాత్మకములయిన ఉపాధిభేదాలు– సోపాధిక బ్రహ్మోపాసనం ఈశ్వర విషయానురక్తి ధారావాహికంగా వుండటాన్నిబట్టి ఆనందమయంగా వుంటుంది. ప్రవాహరూప ఈశ్వర విషయానురక్తి– సాన్నిధ్యభావనగా, సంస్మరణ భావనగా, స్తోత్రపాఠంగా, గుణగణ వర్ణనగా, వియోగవేదనగా, వాత్సల్యరూపంగా, స్త్రీపుంస యోగాత్మకమైన మధుర భావనగా– మొత్తంమీద భక్తిగా వేద ప్రసిద్ధమైన ఉపాసనా భావన ఒకటున్నది.[1] ఈ భక్తిభావనయే భాగవతమునందు దాని ఆవేశ ముఖాలతో ప్రదర్శింపబడింది. భక్తులకూ భగవంతునికీ ఉండే సంబంధాలన్నీ మానవ సంబంధాలే. అందువల్ల భక్తిరూపమైన సోపాధికోపాసన అంతా మానవ సామాజిక జీవిత సంబంధ బంధురంగానే వుంటుంది. భగవద్భక్తుల జీవితాలను అలా ప్రదర్శించటం చేత మానవులమైన మనకు అనుభూతికీ, తాదాత్మ్యానికీ వెసులుబాటెక్కువ. పోతనగారి భాగవతం జనరంజకంగా వుండటానికి కారణం అటు భక్తులనూ ఇటు భగవంతుణ్ణీ మానవ సహజ సంబంధాల పొలిమేరలు దాటకుండా జీవిస్తున్నట్లు చూపించటమే. ఈ వాస్తవికతాభావన బలంవల్లనే ఆధ్యాత్మికమైన జీవేశ్వర సంబంధ బంధురతా లక్షణమైన ఆనంద ప్రాప్తికి భాగవత పాఠకులు భాజనులు కాగలుగుతున్నారు.

శ్రీకృష్ణవాసుదేవ భక్తిప్రపత్తిరూప ధ్రువాస్మృతి జ్ఞానప్రవృత్తి ఒకవిధంగా శంకరాచార్యుల వారి శుద్ధాద్వైత తాత్విక దృక్పథాన్ని ప్రక్కకునెట్టే ఉద్యమమే. ఈ

1. అనుభవానందస్వామి– సర్వసిద్ధాంత సౌరభము, సంపుటం 7, పు. 30, 31.

దృక్పథాన్నీ ఆ ప్రవృత్తినీ సమన్వయపరచుకొని పోవటం అధిక ప్రయోజనకారిగా వుంటుందన్న చూపుతోనే శ్రీధరస్వామి భాగవతానికి విష్ణుపురాణానికీ, భగవద్గీతకూ వ్యాఖ్యానం వ్రాశాడు శ్రీధరీయ వ్యాఖ్యను పూర్తిగా శుద్ధాద్వైత వ్యాఖ్య అని అనలేము. పోతన్నగారు భాగవతాన్ని తెనిగించటంలో శ్రీధరీయాన్ని అనుసరించిన ఋజువులు ఎన్నికనిపించినా ఆయనది అద్వైతపరమైన రచన అని అనలేము. అసలు విశిష్టాద్వైతంలోనే సగము అద్వైతమున్నది. ఆమాత్రము అద్వైతమే భాగవతంలో వుంటుంది కానీ అంతకంటె ఎక్కువ వుండదు. వుండటాన్ని భాగవత గ్రంథ తాత్పర్య మంగీకరించదు. భాగవతంనుండి ప్రతీయమానం కావలసినవస్తువు సమస్త నామరూపాత్మకమైన ఈ విశ్వజగత్తుకు అధిష్ఠాన భూతమునూ, అవధి భూతమునూ అయిన నిత్యవస్తువు. అందువల్ల నిత్యానిత్యవస్తు వివేకాత్మకంగా ప్రధానమైన జ్ఞాన సాధనంగావుంది భాగవతం. జ్ఞానంవల్లనే కైవల్యమన్నారు గనుక భాగవతరచనకూ, శ్రవణానికీ, పఠనానికీ, జిజ్ఞాసకూ అంటటికీ కైవల్యమే పరమార్థం. కైవల్యపదమూ మోక్షపదమూ ఇలా చెప్పబడేవన్నీ ప్రత్యేకమైన వాస్తవిక స్థానరూపాలు కావు, అనుభూతిదశా విశేషాలు. భయబాధా విముక్తియే ప్రజలకు విముక్తి. ఇంద్రియాలకు విషయాలతో సంబంధం వల్లనే కష్టసుఖాలు. కష్టాలే ఎక్కువ. అందువల్ల కష్టాలను కొనితెచ్చే నిత్యజీవిత విషయాల నుండి ఇంద్రియాలను ఆధ్యాత్మిక విషయాల మీదికి మళ్ళించటం వల్ల కష్టనష్టాలనుండి అనుభవంలో విముక్తి కలుగుతున్నది, ఇది నిజమే అయినా అనుభూతి మాత్రమైన విముక్తి భావనామయమై భావన ఎక్కువసేపు నిలువక ఎంతచేసినా చిటికలో చెయిజారిపోయినట్లుగా విముక్తి భావన స్థిరంగా నిలబడటంలేదు. అందువల్లనే ఇంతకాలంగా విముక్తిని గురించి మాట్లాడుతున్నా వీరు విముక్తులు అని కొందరిని పక్కకుతీసి చూపించటానికి వీలుకావటం లేదు. నిత్యవస్తు చింతనం వల్ల ఇంద్రియాలకూ దాన్నేవిషయం చేయుటంచేత అన్యవస్తు సంబంధం కలుగదు గనుక లౌకిక భయబాధా సంబంధం కూడా నిత్యవస్తు చింతకుల కుండదు. ఆ వుండకపోవటమే మోక్షం, జీవన్ముక్తి. జీవితంలో భయం నుండి బాధనుండి విముక్తి లభించక పోవటం చేత జీవన్ముక్తినిగాక విదేహముక్తిని ముక్తిగా చెప్పటం జరిగింది.

ఇక్కడనే భాగవతం అద్వైత పారమ్యాన్ని చెబుతున్నదా? లేక విశిష్టాద్వై పారమ్యాన్ని చెబుతున్నదా? అనికూడా విచారించాలి. పోతన్నగారు అద్వైతియనీ ఆయన భాగవతాన్ని శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని అనుసరించి అద్వైతపారమ్య ప్రబో కంగానే వ్రాశాడనీ, ఆయనకాక ఇకమిగిలిన సింగయ్య నారయ్యలు విశిష్టాద్వైతుల ముఖ్యంగా నారయ్య ఎంత పోతన్నగారికి ప్రియశిష్యుడనని చెప్పుకొన్నా తాన

విశిష్టాద్వైత పరంగానే భాగవతాన్ని వ్రాయటమూ పూరించటమూ చేశాడని పరిశోధకులు తెలుస్తున్నారు[1] కానీ విశిష్టాద్వైత సిద్ధాంతము సకల కల్యాణగుణ సమాశ్రియత్వం చేత సమస్త హేయత్వ రాహిత్యమైన విష్ణుపదమును నామరూపాత్మకం చేసి భక్తుల కందుబాటులో భగవంతుని చూపిస్తుంది. భగవద్విషయంగా వున్న భక్తుల ప్రేమానురాగాలే విశిష్టాద్వైత తాత్విక భక్తితత్వం. అద్వితీయ పరబ్రహ్మము జీవ జగద్రూప సూక్ష్మ స్థూలశరీరముల చేత సగుణమనే వైశిష్ట్యదర్శనమే ప్రతిపాదనమే విశిష్టాద్వైతం. తరంగ సముద్ర సంబంధంగా జీవేశ్వర సంబంధాన్ని చెప్పటం చేత అద్వైతాన్నీ దాని విశిష్టత్వాన్నీ చెబుతూ విశిష్టాద్వైతం సార్థకమవుతున్నది. జీవేశ్వర సంబంధాన్ని ఇంత సులభగ్రాహ్యంగా చేయగలగటం చేతనే విశిష్టాద్వైత భక్తితత్వమంటే జనం వెంటబడటం అసలు సాహిత్యకళా సృజన రూపాలన్నింటికీ విశిష్టాద్వైతదర్శనమే మూలం.[2] పోతన్నగారి భాగవతం జీవలక్షణమైన మధుర భావాభిప్రాయ విశిష్ట ప్రదర్శనాత్మకమైన రచన కావటంచేతనే అది జనముద్దు గ్రంథమైంది. ముఖ్యంగా మధురభక్తి మార్గమే ఈశ్వర సన్నిధికి సులభసుందరమైన మార్గంగా శ్రీమద్రామానుజుల విశిష్టాద్వైతదర్శనంలో ప్రతిపాదింపబడింది. పోతనగారి భాగవతం వింటా ఇదే కనిపిస్తున్నప్పుడు- దాని మూలానికి అద్వైతవ్యాఖ్య ఉన్నంత మాత్రం చేత- విశిష్టాద్వైత స్పర్శలేకుండా అద్వైత తాత్పర్యంతోనే ఆయన భాగవతాన్ని వ్రాశాడనీ, అద్వైతేతరంగా కనిపించే విశిష్టాద్వైతమంతా వెలిగందల నారయ్యలాంటి వాళ్ళెవరో అందులో చేర్చారనీ అనటం భాగవత గ్రంథ వాస్తవిక తత్వాన్నిబట్టి పోవటంగా అనిపించదు. అసలు గ్రంథతత్వ నిర్మాణం విశిష్టాద్వైత భక్తితత్వం మీద ఆధారపడివుంది గాబట్టి అంటే ఏమనవచ్చునంటే పోతన్నగారికంటె కవితాశక్తి ఎక్కువ లేకపోయినా గ్రంథ తాత్పర్యార్థ నిర్ధారణశక్తి నారయ్యకు ఎక్కువగా వుందని అనవచ్చు. ఇలా అనటం పోతన్నగారికి గౌరవం కాదు గనుక ఆయన రచించిన మహాభాగవతంలో అద్వైత వేదాంతము విశిష్టాద్వైత భక్తితత్వంగా ప్రతిపాదింపబడిన వైనాన్ని పండితులయినవారు సమదర్శనులై జిజ్ఞాస చెయ్యటం ఎంతైనా అవసరం. అదొక పెద్ద పరిశోధన విషయం. అద్వైతము యొక్క లౌకిక ముఖ సౌందర్యమే విశిష్టాద్వైత భాగవత భక్తితత్వం.

---

1. ధూళిపాళ శ్రీరామమూర్తి. శ్రీమద్భాగవతానుశీలనము- పుటలు 100, 157.
2. Visistadvaita is constructed on the science of love or aesthetics- Vedantakesari (1926) P. 30.
చూ. సర్వసిద్ధాంత సౌరభము- సంపుటం. 7. పు 228.

జీవేశ్వర భజనభాజన విశిష్టమైన అంతర్యామి యగు భగవంతుడే భాగవత స్తువు. భగవంతుడు సిద్ధవస్తువే గనుక వస్తుస్థాపనం గాక వస్తుప్రపంచ ప్రతిపాద మే భాగవత లక్ష్యం. అట్లు ప్రతిపాద్యమైన వస్తువునే భక్తితత్వంగా భాగవతులు చరించి అనుభవిస్తున్నారు. భగవంతుని భాగవత వస్తువుగా చెప్పటంలో తన్నగారు 'సమస్తంబు గాకయునగుచునుండు'- తద్ధర్మాన్ని లక్షణంగా చెప్పారు. ఉధర్మ విశేషం లేకపోతే అసలు భగవంతుణ్ణి ప్రతిపాదించట మేలాగా? అవి ద్ధర్మాన్ని పట్టుకొని బయలుదేరిన భాగవతాన్నీ, దాన్ని రచించిన పోతన్నగారినీ ద్వైత మతంలోకి కుదించటం న్యాయమా? విశిష్టాద్వైత పరంగా స్వీకరించటం న్యాయమా? న్యాయనిర్ణయానికి వేత్తలుకావలెను. కానివారికి భజన ఉండనేవున్నది ఇటు వేత్తలయినవారికీ, ఇటు కానివారికీ కూడా భాగవతం వస్తుతత్వాన్నీ ప్రతిపాదించి ఒకరికి జిజ్ఞాన చేయుటం ద్వారా ఒకరికి దాస్యం చేయుటంద్వారా మోక్షాన్ని చూపిస్తు న్నది. ఎఱుగదగిండి భాగవతవస్తువు మాత్రమే.

ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు ల
క్ష్మీమహిళాధినాథు తులసీదళధాము పరేశునాత్మ హృ
త్తామరసంబునందు ప్రమదంబున నిల్పి తదన్యవస్తువుం
దా మదిలో హసించు హరిదాస్య విహార వినిశ్చితాత్ముడై[1]

ముందు ముందెప్పుడో పుట్టబోయే ప్రహ్లాదుని భాగవతోత్తమ లక్షణాన్ని కశ్యపుడు తన భార్యయైన దితితో చెప్పిన పద్యమది. భాగవతులు గ్రహించే వస్తువు శ్రీమహావిష్ణువు తదన్యవస్తువును ప్రహ్లాదు డెట్లో భాగవతులంతా అట్లే పరిహరిస్తారు. శ్రీమహిళాధినాథుని చెప్పి తదన్యవస్తువనుటచేత భాగవత వస్తువు శ్రీమహావిష్ణువని చెప్పినట్లేకదా! చెప్పినట్లే. చెప్పినంత మాత్రం చేత ఆ వస్తువు సమస్తం కావటానికీ కాకపోవటానికీ ఇబ్బందిలేదు. "స్త్రీనపుంసక పురుషమూర్తియునుగాక, తిర్యగమర నరాది మూర్తియునుగాక, కర్మగుణభేద సదసత్ప్రకాశిగాక, వెనుకనన్నియు తానగు విభుదలంతు[2]-'' ఇది గజేంద్ర మోక్షణంలోని పద్యం, నానా జంగమస్థావర వస్తు

1. భాగవతం, తృతీయ స్కంధం- 492.
2. „ అష్టమ స్కంధం- 85.

గర్భాల్లో అంతర్యామిగా వుండే నిత్యవస్తువును[1] ఏ ఒక్క నామరూపానికీ పరిమిత
చేసి చెప్పటానికి వీల్లేదుకదా! ఆ విభుడైన విష్ణు వట్టివాడు. అతడే జ్ఞానయో
హ్యాద్ధ్యేయ వస్తువు.[2]

సమస్తంబుగాకయు నగుచునుండు వస్తువును ఈ భాగవతం నుండి ఎరు
దగును– అంటే తెలుసుకోవచ్చు నంటున్నాడు. పోతన్నగారు చేస్తున్న వస్తుప్రః
వన నన్నిచోడుని వస్తుకవితను స్మరింపజేయ గలుగుతున్నది. శివకవులకు ప్రి
పాదింపదగిన వస్తువు శివపరబ్రహ్మము. వైష్ణవులకు విష్ణుపరబ్రహ్మము. శివవ
పైతే శివకథ. విష్ణువస్తువైతే విష్ణుకథ. ఇలా కనిపించటం చేత వస్తువం
స్థూలంగా కథగదా అని అనుకొంటున్నాం. వస్తువు నిజానికి కథగాదు. ప్రతిపా
మవుతున్న దశలో వస్తువు కథారూపాన్ని పొందుతుంది. అందువల్ల కథాంశ
లలో ఏది వస్తువు అంటే ఏ ఒక్కటీకాదు, అన్నీకలిపి అవును అన్నట్లుగా వుంటుం
భగవద్వస్తువు జీవజగత్తులా అంటే ఎంతకాదో అంత అవును ఈ అర్థాన్ని నిద
నంగా చెప్పటానికే సముద్రతరంగ న్యాయమూ సువర్ణాభరణ న్యాయమూ అని ప్రా
భించటం. భగవద్వస్తువైన విష్ణువును భక్తపాలన కళాసంరంభ గాథా సముజ్
విజృంభణంగా చూపిస్తుంది భాగవతం. కనుక భాగవతాన్ని అధ్యయనం చే
ఎందుకు చెయ్యాలంటే తెలుసుకోదగిన భగవద్వస్తువును తెలుసుకోటానికి భగ
ద్వస్తు విజ్ఞానమే అధిక సుఖదం. ఆ అధికసుఖానికే ఆనందమని పేరు. ఆనంద
ప్రయోజనం.

---

1. భాగవతం దశమ స్కంధం– ఉ. భా. 1074.
2. „ సప్తమ స్కంధం– 277.

# II. 7. భాగవతమున వస్తువు ధ్వని

వస్తువనగా అభిప్రాయము కథాశరీరంతో కార్యరూపాన్ని పొందుతుంది. భాగవత గ్రంథం కొంత శాస్త్రనయమూ, కొంత కావ్యనయమూ కలిగింది కావటం చేత శాస్త్ర కావ్యలక్షణ లక్షితంగా వుంటుంది. పురాణాలు విషయబోధకాలు కాబట్టి విషయ భేదాలనుబట్టి దేనికథ దానికిగా బహువిధ కథా సంపుటాలుగా వుంటాయి. అర్థవాదమాత్ర ప్రయోజనదృష్టితో చెప్పబడే కథలు పురాణాల్లో తక్కువగా వుండవు. అందువల్ల ఆయాకథల్లో కావ్యగుణం అంతంత మాత్రంగానే వుంటుంది. భాగవత పురాణంలో విష్ణుభక్తి విషయం, సృష్టిస్థితి లయ, దేశ కాలవిభేద స్థితిగతుల విషయం దేవదానవ యుద్ధాల విషయం, రాజవంశాల విషయం మన్వంతరాల విషయం— ఈ విధంగా అనేక మహావిషయాలను చెప్పే కథలతో నిండివుంటుంది కావ్యాల్లో ఉన్నట్లు చెప్పబడుతున్న రసాత్మకత పురాణాల్లో వుండదు. వుండటానికి వీలులేదు ఎక్కడి కక్కడ చెప్పబడుతున్న ఆయా విషయాలకు సంబంధించిన కథలనుండి ఆయా అభి ప్రాయాలు పాఠకులకుగానీ శ్రోతలకుగానీ ప్రతీయమానాలు కావాలి. అలా ప్రతీయ మానమయ్యే అభిప్రాయమే వస్తువు. భాగవతంలో అనేక రకాల అభిప్రాయాలు ప్రతీయమానాలు అవుతూ అన్నీ కలిపి మొత్తంమీద మళ్ళీ ఒకేఒక అభిప్రాయాన్ని ప్రతీయమానం చేస్తాయి. అదే సమస్తంబు కాకయును అగుచునుండు వస్తువు. అదే భాగవతమునందు ఎరుగదగు వస్తువు. వస్తుధ్వని వాచ్యంగానూ వ్యంగ్యంగానూ కూడా వుంటుంది. కావ్య నాటకాల్లో వ్యంగ్యరచనకున్న గౌరవం పురాణాల్లో లేదు. అందువల్ల ఎక్కువ విషయం వాచ్యంగా వుండాలి వాచ్యమవుతున్న వస్తువు- అభిప్రాయం ఆస్వాదనీయంగా వుండటానికి అనుపాన మాధుర్య మర్యాదను మించని వ్యంగ్యం మాత్రమే పురాణరచనలో అనుసరణీయం రసధ్వని అంటే వ్యంగ్యానిదే అగ్ర స్థానం. వస్తుధ్వని అయితే వాచ్యంతోపాటు నేనూ వున్నానన్నట్లుగా వుంటుంది వ్యంగ్యం. భాగవత పురాణానికి ఉచితమైనది వస్తుధ్వనిగానీ రసధ్వని కాదు ఆ విషయాన్నే పోతన్నగారు భాగవతమునం దెరుగదగునది వస్తువనీ, అది ఫలానా ధర్మంకాదనీ సూచించారు. వస్తుధ్వనికో భేదంగానే అలంకార ధ్వనిని చెబుతారు ఇక్కడ గమనింపవలసిన అంశమేమిటంటే వస్త్వలంకారములు వాచ్యములు వ్యంగ్యములూ కూడా అగును కదా! వ్యంగములైనప్పుడు విభావాను భావరూపము లుగా రసభావాభి నివేశములై పర్యవసిస్తాయి. వాచ్యములైనప్పుడు వైలక్షణ్యము

చేత ఆస్వాదనీయములవుతూ రసస్పర్శవలన స్పందిస్తూవుంటవి. భాగవతపురాణమున ఈవిధమైన స్పందనయే ప్రధానము శాస్త్రకావ్యమైన పురాణ రచనకాత్మ వస్త్వలంకార సంరచనయేకాని రసముకాదు.

భాగవత పురాణ ఫలరసాస్వాదనమంటే వస్త్వలంకార ధ్వని వివేకమని అర్థం. కావ్యరసభావ వేత్తలయిన రసికులు భాగవత వస్తువు ప్రతీయమాన మయ్యేటట్లు అవలంబింపబడిన వస్త్వలంకార ధ్వనిమయమైన రచనావైచిత్రిని అనుసరించవలసిందిగా పోతన్నగారిచేత హెచ్చరింపబడుతున్నారు. భాగవత పురాణ పాఠకుల విషయంలోనూ పోతన్నగారి దృష్టి వాళ్ళంతా రసికభావవిదులు అని. రసికభావవిదులనగా రసమతమైన— రసస్వరూపమైన బ్రహ్మజ్ఞానభావము విషయమున వేత్తలని అర్థము. వేదములనుండి, ఉపనిషత్తులనుండి, బ్రహ్మసూత్రములనుండి, భగవద్గీత నుండి క్రమంగా విశదీకరింపబడుతూ రసికభావము అంటే బ్రహ్మజ్ఞాన భావము శుకముఖ సుధాద్రవమున మొనసి భాగవతపురాణ ఫలంగా రూపుగట్టుకొన్నది. ఈ భాగవత ఫలరసాస్వాదనం రసికభావ విదులకు ఒకానొక సమున్నత స్థితిని సంపాదిస్తుంది. తాదృశమైన పదవీ సంపాదనానికి పోతన్నగారు రసికుల నాహ్వానిస్తున్నాడు అందువల్ల రసశబ్దాన్ని కావ్యరస విషయాన్ని అర్థం చేసుకొన్నట్లు చేసుకోకూడదు. భాగవతం మహాపురాణం. మహాకావ్యం కాదు

వేదకావ్య విజ్ఞానాన్ని విస్తృత ప్రచారంలో పెట్టటానికే అవతరించిన పురాణ కావ్యరచన అంతా వేదభిముఖంగానే వుంటుంది కానీ, లౌకిక కావ్యాలంకార శాస్త్ర సరణి ననుసరించి వుండదు అందువల్ల వేదపురాణ కావ్యరసము అంటే విజ్ఞానమనే అర్థం. కవులు అంటే విద్వాంసులనే అర్థం.[1] వేదకావ్య రసాస్వాదనకు దూరమైన వాళ్లకు భాగవత పురాణ కావ్యరసాస్వాదన అవకాశాన్ని పోతన్నగారు తెలుగులో కల్గించారు. ఈ తెలుగు భాగవత శ్రవణమనన నిధిధ్యాసనఫలంవల్ల ఆధ్యాత్మతత్త్వ విదులయిన వారికి వేదకావ్య తత్త్వవేత్తృత సిద్ధించినట్లవుతుందని పోతన్నగారి ప్రతిపాదన. భాగవత రసాస్వాదనచేత వేదకావ్య రసాస్వాదన పదవిని చెందవచ్చని అర్థం రసికభావ విదులనగా రసాస్వాదన కుశలురు అని అర్థం. రసమనగా జ్ఞానమనీ, రసికభావ విదులనగా విద్వాంసులనీ చెప్పటానికే ఇదంతా. అందువల్ల మన కావ్యాలంకార శాస్త్రదృష్ట్యా భాగవతమువస్తుధ్వని కావ్యంకానీ రసధ్వని కావ్యంకాదు.

1. యేవిద్వాంస స్తేకవయః, భారతీనిరుక్తి – 469. మూలంలో కవి అని వుంటే పోతన్నగారు విద్వాంసుడనే తెలుగులో వ్రాశారు. ద్వితీయ స్కంధం. 20.

## II. 8. భాగవత ప్రభావం

తెలుగు సాహిత్యంలో ఆదికాలము కృతులన్నియు మతసంబంధములు.[1] ఆదిమకాలమంటే పదిహేనవ శతాబ్దం వరకు అని అనుకోవచ్చు. రాయలవారి మత భావాలు తక్కువా అంటే అది వేరువిషయం. తెలుగు సాహిత్యానికి బలం చేకూర్చి నది భారతీయ విధానమే. అది మానవలక్ష్యము నాధ్యాత్మిక సంపదయందు లగ్నము చేసినది- ఫలితంగా ఆంధ్రవిధాన లక్ష్యమును నాధ్యాత్మికపరముగ పరిణతినొందినది[2] తెలుగు సాహిత్యానికి ఆదిమయుగంలో వస్తుసంభారాన్నీ, భావజాలాన్నీ సమకూర్చిన భారతీయ విజ్ఞాన గ్రంథాలు మూడు- భారత భాగవత రామాయణాలు. తెలుగు సాహిత్యాన్ని మనం కొంతకాలంగా రెండుగా విడదీసుకొని ఒకదానికి ఈపేరే వాడుకొంటూ రెండవదానికి జానపద సాహిత్యమని వాడుతున్నాం. మనం గుర్తించిన రెండురకాల తెలుగు సాహిత్యాలు కూడా భారతీయ విజ్ఞాన వాహికలే. అయితే జానపద సాహిత్యం సంస్కృత గ్రంథాల మీదకంటె విజ్ఞానం నిండిన గాదెలని తెలుగు గ్రంథాలనే ఆశ్రి యిస్తుంది. భాషాభేదాన్ని అలావుంచితే తెలుగు సాహిత్యమంతా ప్రధానంగా ఆదిమ కాలంలోనూ తదువాతి కాలంలోను కూడా మానవ లక్ష్యాన్ని ఆధ్యాత్మికంగా పరిణ మింప చేయటం లక్ష్యంగా సాగినట్లు గమనించవచ్చు. ఒక విధంగా సంస్కృత సాహిత్యం దృష్ట్యా తెలుగు సాహిత్యం జానపద సాహిత్యమే ద్రావిడ వేదాలనే కీర్తితో తమిళభాషలో వెలసిన దివ్యప్రబంధాలు వైష్ణవాలయాల్లో అధ్యయనోత్సవా ల్లోకి ఎక్కటానికి కారణం తమిళదేశ ప్రజల్లో వైష్ణవమత ప్రచారం కావాలనుకోటమే కదా.[3] అలాగే భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞానం ప్రజల్లో ప్రచారాన్ని అభిలషించి వాళ్ల

1 కట్టమంచి రామలింగారెడ్డి- వ్యాసమంజరి. పు. 15.

2, కాశీనాథుని నాగేశ్వరరావు- ఆంధ్ర వాఙ్మయ చరిత్ర. పు. 29.

3. The original Vedas being in Sanskrit, were inaccessible to the ordinary man and the endeavours in the mather organising the recitation of the Prabanadhm in temples made by Ramanuja whose sympthy for them was unbounded, helped to open the door to the highest spiritual knowledge to one and all without discrimination of caste or creed, owing to the underst and ability by the common folk of the language of the Prabandham, Viz Tamil, Vernacular of the country, which "Vindicates the common man's right to workship as against the exclusiveness that insists on Sanskrit."-THIRUPATI DEVASTHANAM EPIGRAPHICAL RFPORT (1030) P. 89.

భాషల్లోకి వెళ్ళింది. తెలుగు సాహిత్యస్థాయి తెలుగు ప్రజలకందరికీ అందుకోటానికి వీలుకాక పోయేటప్పటికి, అందుకోలేని వాళ్లే అధిక సంఖ్యాకులు కావటం మూలంగా, వాళ్ళకొరకు వాళ్ళకందుబాటులో వుండే భాషలోకీ, వాళ్ళు రమించగలిగే బాణీల్లోకీ తెనుగు సాహిత్య గ్రంథాలయిన భారత భాగవత రామాయణాలను వేర్పాటుచేసి దేని కదిగా దాన్ని తిరిగి అనువదించినట్లు వ్రాయవలసి వచ్చింది. ఇలాంటి రచనల మొత్తాన్నే ఇంతవరకూ మనం జానపద సాహిత్యంగా దగ్గరకు తీస్తున్నాం. ఈ నేపథ్యం నుండి చూస్తే తెలుగు జానపద సాహిత్యంలో పోతన్నగారి భాగవత ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. జానపద సాహిత్యానికి రచయితలూ, రచనాకాలం తెలియని కారణంగా అవి చాలా ప్రాచీనకాలం నుండి వస్తూవున్న కళాఖండాలుగా అన్నింటి విషయంలోనూ అనుకోనక్కరలేదు అధునిక రచనలెన్నో జానపద సాహిత్యంలో వున్నాయి. పోతనగారి భాగవతాన్ని సన్నిహితంగా అనుసరించిన ప్రహ్లాద చరిత్రి, వామన విజయం, అంబరీషోపాఖ్యానం, గజేంద్ర మోక్షం వంటి జానపద గేయ సాహిత్యమెంతో వుంది. అంబరీషోపాఖ్యాన కర్తయైన ఉప్పలపాటి వెంకట రామయ్యలాగా అందరూ బమ్మెర పోతనగారిని పేరుపెట్టి స్మరించక పోయినా,[2] పోతన భాగవత గాథలను– భగవన్మహిమలను జానపదుల్లో ప్రచారం చెయ్యాలను కొన్న ఆధ్యాత్మిక వాద రచయితలు యథాశక్తి జానపద సాహిత్య[3]కర్తలయినారు.

ఇందులో మళ్ళీ జానపద సాహిత్యం కంటె మర్యాదావహంగా అనిపించటానికి వీలుగా యక్షగాన వాఙ్మయమనీ, పదకవితలనీ, ద్విపద వాఙ్మయమనీ ప్రక్రియలను ప్రధానం చేసి చెప్పటం కూడా వున్న సాహిత్యం లోనూ పోతన్నగారి భాగవత ప్రభావం ఎంతైనా వుంది.

భారతీయ సంప్రదాయ విజ్ఞాన వ్యాప్తికి ఆయాకాలాల్లో మన పూర్వీకులు చేసిన ఆప్పటికి అభ్యుదయకరమైన పనులను అందుకు మూలమైన వారి అవసరాలనూ ఆలోచనలనూ పరిశీలిస్తే ఒక నిరంతరాభివృద్ధి రూపమైన పరిణామాన్ని గుర్తించవచ్చు. వేదాలదగ్గర నుండి కదా మొదలు పెట్టాలి. వాటి విషయంలో స్త్రీలూ శూద్రులు అధికారులు కాదు అన్న సూత్రాన్ని తిరస్కరించకుండానే ఆ తరువాతి మన

2. డా॥ బి. రామరాజు– తెలుగు జానపదగేయ సాహిత్యము- (1958) పు 126.
3. చూడు చింతా దీక్షితులుగారి ప్రజా వాఙ్మయము, (1955).

పూర్వీకులు వేద విజ్ఞానాన్ని స్త్రీలకూ శూద్రులకూ కూడా అందించాలన్న సదుద్దేశంతోనే పురాణేతిహాసాలు వ్రాశారు అందుకు సంస్కృత భాషనే వాళ్ళుపయోగించారు. క్రమంగా సంస్కృత భాషతో నిమిత్తంలేని దేశభాషా వ్యవహారాభివృద్ధితో పైకి వచ్చిన అధిక సంఖ్యాకులలో స్త్రీ శూద్రులతోపాటు మిగిలిన అగ్రవర్ణాల ప్రజలుకూడా చేరారు. అందువల్ల మళ్ళీ వీళ్ళకోసం సంస్కృత పురాణేతిహాసాల్లోవున్న సంప్రదాయ విజ్ఞానం దేశ భాషల్లోకి అనువదించి వ్రాయటం మొదలయింది, భారతీయ విజ్ఞానం తానువస్తూ తనతోపాటు కొంత సంస్కృత భాషను కూడా దేశభాషల్లోకి తెచ్చింది. ఆవిధంగా భారతీయ దేశభాషలు సంస్కృత భాషా ప్రభావాలకు లోనయ్యాయి. ఆ విషయంలో తెలుగుభాష ప్రథమస్థానమాక్రమించినా ఆక్రమించవచ్చు. ఎందుకంటే సంస్కృత భాషా జీవలక్షణమైన దాని వ్యాకరణం- ఏ భాషకైనా దాని వ్యాకరణంగా వుంటుంది- తెనుగులోకి ప్రవేశించి అది సాహిత్యవాహిక కావటానికి తగినంత గతిశీలాన్ని దానికి సమకూర్చింది. అంటే సంస్కృత భాషా ప్రభావం తెనుగుమీద రెండు రకాలుగా వుంది. ఒకటి తత్సమపద బాహుళ్య రూపంగానూ రెండు వ్యాకరణ విశేషాత్మకంగానూ. ఈ రకమైన సంస్కృతభాషా జటిల ప్రభావం కారణంగా మళ్ళీ తెలుగు ప్రజల్లో స్త్రీ శూద్రులవంటి వారికి అనువాద సాహిత్యం ద్వారా విజ్ఞానం అందని పరిస్థితి ఏర్పడింది. దాన్ని తట్టుకోటానికీ అనువాద సాహిత్యమాధారంగా ఆ విజ్ఞానాన్నే జానపద కథా గేయ నృత్య వాఙ్మయంగా మళ్ళీ తిరుగ వ్రాశారు- ఈ మహాపరిణామమంతా ఏమి చెబుతున్నదంటే ప్రజలను వీలయినంత అధికసంఖ్యలో విజ్ఞానవంతులను చేయటానికి సాహిత్యం ప్రవర్తిస్తుందనీ, ప్రజలకు వాళ్ళ భాషలోనే వాళ్ళ బాణీల్లోనే ఇస్తేనేతప్ప వాళ్ళు విజ్ఞానాన్ని అందుకోరనీ అందుకోలేరనీ చెబుతున్నది. సాహిత్యానికి ప్రయోజనం ప్రజలకు విజ్ఞానాన్ని అందించటం వరకు బాగానే వున్నది. ఏది విజ్ఞానమూ అన్నదగ్గర దేశ కాలపరిస్థితులలో చాలా ర కాల వివాదాలున్నాయి. ఏదేశ కాలపరిస్థితులో ఎవరు దేనిని విజ్ఞానంగా భావించారో ఆ దేశకాల పరిస్థితుల్లో వారు దాన్ని తమ భాషాసాహిత్య నిర్మాణ నైపుణ్యం ద్వారా ప్రజల కందించారు. విజ్ఞానమూ దాని ఉత్పత్తీ, దాని ప్రబోధమూ, దాని ప్రయోజనమూ మొదలయిన మౌలిక విషయాల ఆలోచనల్లో అవలంబింపబడిన భావవాద భౌతికవాద తాత్విక ప్రాపంచిక దృక్పథాలను బట్టి విజ్ఞాన వాదులయిన మేధావుల్లో రెండు వర్గాలు ఏర్పడ్డాయి భారతీయ సంప్రదాయ విజ్ఞానంగా మన కందించబడుతూ వస్తున్నది భావవాద తాత్విక విజ్ఞానం అందువల్ల మొత్తంమీద జానపద వాఙ్మయంతో కూడా కలిపి మన తెలుగు భాషా సాహిత్యంలో భావవాదతాత్మిక విజ్ఞాన ప్రబోధముంటుంది. ఎక్కడైనా నూటికి కోటికి అన్నట్లు భౌతికవాద తాత్విక ఛాయలున్నా

అది పెద్దలెక్క కాదు. ఈ ఇరవయ్యో శతాబ్ది మొదలయిన తరువాత నుండి భౌతిక వాద తాత్త్విక ధోరణులు తెలుగుభాషా సాహిత్యాల ద్వారా ప్రబలంగా ప్రజల్లో వ్యాపిస్తున్నాయి. అంటే అది ప్రబోధించే విజ్ఞానాన్నిబట్టి ఆధునిక ఆంధ్ర సాహిత్యం భావవాద భౌతిక వాదభేదాలు కలిగి విశ్వనాథ మార్గంగా శ్రీశ్రీ మార్గంగా నడుస్తున్నది. ఈ విషయాన్ని ఇక్కడ వదిలేస్తే భారతీయ పురాణేతిహాసాలు తెలుగులో నన్నయ తిక్కన పోతనాది కవినాధుల చేతనూ, ఆ పిమ్మట జానపద కథా గేయాలుగానూ ఎందుకు వ్రాయబడ్డవో ఆ వ్రాయటంలో వున్న అభ్యుదయాంశ ఏమిటో అందువల్ల సాధింపబడ్డ ప్రయోజనాలేమిటో బుద్ధిమంతులు సులభంగా గ్రహించవచ్చు. అదికాకుండా ఈ ఇరవయ్యో శతాబ్దంలో భారత భాగవత రామాయణాది పురాణేతిహాసాలన్నీ ఎందుకు తెలుగులో తిరుగ వ్రాయబడ్డాయో కూడా గ్రహించవచ్చు.



# III. 1. కవితా వైచిత్రి

కవితా విచిత్రుడనని గద్యలో పోతన్నగారు చెప్పుకొన్న దానివిషయం విచారించాలి, కావ్యరచనా మార్గాలు రెండున్నవి. సుకుమార మార్గమొకటి, విచిత్రమార్గమొకటి. మొదటి మార్గాన్ని అవలంబించి పోయేవాళ్ళను సత్కవులనీ, రెండవ మార్గము నవలంబించిన వాళ్ళను విదగ్ధకవులనీ అంటారు. ఉభయమార్గాల్లోనూ రచనా వ్యాపారం కొనసాగించగలవాళ్ళు మధ్యస్థులయిన మహాకవులుగా చెలామణి కాగలరు. తానుభయ కావ్యకరణ దక్షుడననికూడా పోతన్నగారు చెప్పుకొన్నారు. దక్షత ఉన్న తరువాత స్వభావ సామర్థ్యాన్నిబట్టి ఏమార్గాన్నైనా ఎన్నుకోవచ్చు పోతన్న విచిత్ర కవితామార్గాన్ని ఎన్నుకొన్నాడు. పరమేశ్వరుని కరుణ తనయందందుకు అనుకూలంగా వుందని ఆయన అనుకొన్నాడు— పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర— అది అసిధారామార్గం కావచ్చు, అవునుకూడా, మనోరథ సాధన విషయంలో నిబద్ధతగల సుభటులు ప్రయాణం చాలా కష్టభూయిష్ఠమని తెలిసికూడా కావాలని ఖడ్గధారామార్గాన్ని అవలంబిస్తారు. సరిగ్గా సమర రంగంలో సుభటుల్లాగా సాహిత్య రంగంలో విదగ్ధులయిన కవులూ రచయితలూ ఖడ్గధారవంటి విచిత్రమార్గాన్ని అవలంబిస్తారు. పోతన్నగారు సుభటోపమానాన్ని అంగీకరించి విచిత్రమార్గాన్ని అవలంబించి— తాను సత్కవి బిరుదాన్నిపొందిన దానికంటె— విదగ్ధకవి బిరుదాన్ని పొందటమే గౌరవంగా భావించాడు. అందువల్ల ఆ కవితా విచిత్రుని భాగవతంలోని వైచిత్రి అవగాహన కావటానికి వక్రోక్తిజీవితకారుని సహాయ సంపత్తిని పొందటం చాలా అవసరం,

అయితే పోతన్నగారు సుకుమారమార్గాన కావ్యరచన చేయలేదా? చేయలేదని ఎవరన్నారు? అసలు విషయమేమనగా కుంతకాచార్యుడు వక్రోక్తి జీవిత శాస్త్రం వ్రాస్తున్నాడు గనుక అన్నివిషయాలను విడివిడిగా నిరూపించి చూపిస్తాడు. కవిచేసే సృజన వ్యాపారంలో యథోచితంగా అన్నీ కలగాపులగ మవుతాయి. అలంకారాలు కువలయానందంలో విడివిడిగా వుంటాయిగానీ కావ్యాల్లో వుండవు. అక్కడ శ్లేష ఉపమాన అను ప్రాణిత కావ్యలింగంగా, రూపకాను ప్రాణిత ఉత్ప్రేక్షగా, స్వభావోదాత్త ఉత్ప్రేక్షగా అన్నీ సంశ్లిష్టంగా వుంటాయి. అలాగే పోతన్నగారిది విచిత్ర రచనా మార్గమంటే దానికి మరింత ప్రాధాన్యముందనేగానీ సుకుమార మార్గస్పర్శయే లేదని అర్థం కాదు— పైగా పోతన్నగారు తాను ఉభయ కావ్యకరణ దక్షుడనని చెప్పు

కొన్నాడు. అందువల్ల ఆయన సుకుమార- విచిత్ర ఉభయ కావ్యరచనా విధానాల్లోనూ చేయి తిరిగినవాడే. అయితే విచిత్రమార్గం వైపు కాస్త మొగ్గుంటుంది. భాగవత రచనకు ఆమొగ్గు అవసర మనుకొన్నాడాయన. ఎందుకనుకొన్నాడు? ఎందుకనుకొన్నాడో- తన భాగవతాన్ని ఆయన అభిజాతులకు మాత్రమే ఉద్దేశించలేదు. ఉత్తమవంశ సంజాతులకు మాత్రమే ఉద్దేశిస్తే సుకుమార మార్గం అవలంబించాలి. తెలుగు ప్రజానీకానికి ఉద్దేశించిన కారణంగా ఉభయ కావ్యకరణ దక్షతగలిగి విచిత్ర రచనా మార్గాన్ని స్పృశించుకొంటూ వ్రాయవలసి వచ్చింది. నిజానికి ఆయనది మధ్యమ మార్గమే. సాహిత్య రంగంలో సుకుమార మార్గానికి వాలు ఎక్కువగా వుండటం చేత దాన్ని కాదనటానికి గుర్తుగా తాను విచిత్రమార్గం వైపు వాలినట్లు కనిపించాడు. కవితా విచిత్ర అని గద్యలో అందుకే వ్రాసుకొన్నాడు. దాన్నిమనం ఎగలాగటం గానీ దిగలాగటం గానీ రెండూ మంచివికావు. భాగవత వస్తువు- ప్రయోజనం- అది ఉద్దేశింపబడిన శ్రోతలు- ఆ దేశకాలాలు- పోతన్న గారి స్వభావం- ఈ అన్నింటని పరస్పరం సంబంధించిన విషయాలుగా, అన్యోన్య ప్రభావాలకు లోనయ్యే అంశాలుగా అఖండంగా సంభావించటం పెట్టుకొంటేనే పోతన్నగారి భగవతం సంగతి తెలుస్తుంది. ఏవిషయమైనా అంతే. చారిత్రిక వాస్తవిక తాత్విక దృక్పథం లేకపోతే అంతా విపరీతంగా కనిపిస్తుంది.

పురాణ ఇతిహాస సాహిత్యం కావ్యనాటక సాహిత్యం లాంటిదికాదు. ధర్మార్థ కామ మోక్షములను గురించి చెప్పటంతోపాటు లోక వ్యవహార వేత్తృత్వాన్ని ప్రజలకు బోధించాలి పురాణేతిహాసాలు. కావ్యనాటకాలు ముందు హృదయాహ్లాదకారకాలు కావాలి. తెలుగులో పురాణేతిహాస రచనకు పూనుకొన్న నన్నయ్యగారి నుండి ఈ రెండు ప్రయోజనాలను కలిపి సాధించుకొంటూ పోవలసి వచ్చింది. నన్నయ్యగారు ప్రసన్న కథా కలితార్థయుక్తి- అక్షర రమ్యత- సూక్తి రచన- ఇవన్నీ కలపటమందుకే. తిక్కన్నగారిది ఉభయ కావ్యప్రౌఢి పాటించు శిల్పమున పారగత్వము- అంటే పురాణకావ్య- కావ్యనాటక ఉభయ ప్రయోజన సాధన సామర్థ్యము- పోతన్నగారిది ఉభయ కావ్యకరణ దక్షత. పరమార్థమైన మోక్షపురుషార్థ విషయాన్ని సాధించుకొనేందుకు ఉపాయభూతమైన వస్తువును- శ్రీకృష్ణవాసుదేవ పరబ్రహ్మమును- తెలుగులకు హృదయ సంవాదకారిగా ప్రతిపాదించటానికి ఉద్యమించిన మహాకవి విచిత్రమార్గాన్ని అవలంబిస్తేనే ఆ ఉద్యమం సఫలమవుతుంది. ఎందుకంటే ప్రజలు విచిత్ర స్వభావులు. సుకుమార స్వభావులు కాదు. ఉద్దేశించిన తెలుగు శ్రోతల స్వభావాలు తన భాగవతాన్ని స్వీకరించటానికి ఏవిధమైన రచనా విధానాన్ని

తానవలంబిస్తే సుముఖంగా ముందుకువస్తాయో సరిగ్గా పోతన్నగారు ఆ విధానాన్ని అవలంబించారు. అదే విచిత్రవిధానం శాస్త్రవిషయాతిరిక్తమైన ఆహ్లాదకరత్వమును శబ్దార్థరచనా రూపమైన ఆహార్యశోభగా ప్రదర్శించి, ఆ ప్రదర్శనవల్ల ప్రసన్నచిత్తులయిన మహాజనానికి పురుషార్థ సాధనోపాయమైన వస్తుతత్వాన్ని బోధించటమే పోతన్నగారి కవితా వైచిత్రి. ఆ ప్రదర్శనం- ఈబోధ రెండూకూడా భాగవతంలో అసంలక్ష్య క్రమంగానే వుంటాయి. ఈ రకమైన అసంలక్ష్య క్రమవస్తు వ్యంగ్యమే పోతన్నగారి భాగవత కవిత్వ వైచిత్ర్యమంతా.

భాగవత వస్తువు కొత్తదికాదు. పోతన్నగారు సొంతంగా వర్ణించి చెప్పేది కాదు. సంస్కృత భాషలోవున్న దాన్ని తెలుగు జనానికి అది ఉపయోగపడుతుందని అనుకొన్నాడు గనుక వాళ్ళకు ఇష్టమయ్యేటట్లుగానూ అర్థమయ్యేటట్లుగానూ చెప్పాలి. ముందు ఇష్టమయ్యేటట్లుగా చెబితే వాళ్ళు దాన్నివదలకుండా అంటిపెట్టుకొని నెమ్మదిగా అర్థం చేసుకొంటారు. అందువల్ల పోతన్నగారి ప్రయత్నమంతా తెలుగులకుపయోగకరమైన భాగవత వస్తుతత్వాన్ని వాళ్ళకు ఇష్టమయ్యేటట్లుగా చెప్పాలనే. ఉక్తి వైచిత్ర్యం చేతనే పాతవస్తువు పరమ సౌందర్య నవ్యతను పొందుతుంది. వక్రోక్తి వైచిత్ర్యము వాచ్యవాచక వృత్తులనధికరించి వస్తుతత్వాన్ని ప్రతీయమానం చేస్తుంది. ఆ వక్రోక్తి వైచిత్ర్యమే భాగవత పురాణ కావ్యజీవితం, జీవితాన్ని పట్టుకొంటే ఆత్మ వస్తుతత్వం తెలుస్తుంది. జీవితానికీ ఆత్మ వస్తువుకూ అంత అవినాభావ సంబంధమున్నది. ఆధ్యాత్మిక భావవాదానికి భౌతికపునాది జీవితం. ఏది సహజము, ఏది ఆహార్యమూ అన్న విషయచర్చ నలావుంచితే భౌతిక భావవాదములు శబ్దార్థములవలె అవినాభావ సంబంధబంధురాలు.

పోతన్నగారి కవితా వైచిత్రి వైశిష్ట్యమది ఉభయతారకంగా వుండటమే. విచిత్ర స్వభావం సౌకుమార్యాన్ని అవలంబించినంత సులభంగా సౌకుమార్యం వైచిత్ర్యాన్ని అవలంబించలేదు. అందువల్లనే మధ్యమ మార్గమొకటి ఏర్పడింది. పోతన్నగారి భాగవత కవిత్వం నిండా నానారుచి మనోహరమైన సుకుమార విచిత్రమార్గ ద్వితీయ కవిత్వ సంపదలు పరస్పరం ఒరుసుకొంటూ ప్రవహిస్తాయి. ఆ ప్రవాహ వేగంవల్ల ఏర్పడ్డ సంకీర్ణ సాహిత్య సౌందర్యమే పోతన్నగారి భాగవత కవితా వైచిత్రి.

*

## III. 2. సహజ పాండిత్యం

పోతన్నగారిని అలా క్షణిక కవిగా పరిగణించాడన్న ప్రతిష్ఠకు పాల్పడిన అప్పకవి కూడా కవులను సంస్తుతించేటప్పుడు పోతన్నగారి పేరుకు ప్రతిగా ఆయన సహజ పాండిత్యాన్ని సంస్మరించాడు.[1] గురుకుల క్లిష్టంగా శబ్దశాస్త్రాధ్యయనం లేకుండా శిష్టజన వ్యవహారాన్ననుసరించి భాషనుపయోగిస్తూ కవిత్వం చెప్పగల్గటమే సహజ పాండిత్యానికర్థంగా భావించినవాళ్లూ,[2] స్వయంగా వేదోపనిషత్తులను చదివి సహజంగా అర్థం చేసుకొని మననంచేసి ఉపాసించటమే సహజపాండిత్యమని చెప్పిన వాళ్ళూ[3] ఉన్నారు. ఛందోవ్యాకరణ పాండిత్యం లేకపోవటమే సహజ పాండిత్యమైతే, సహజ పాండిత్యాన్ని కవిస్తుతిలో గుణంగా చెప్పి, రేఫఱకార ప్రాసమైత్రి విషయం వచ్చేటప్పటికి ఆయన సహజ పాండిత్యంలో దోషాన్ని ఉద్ఘాటించినట్లే కదా![4] ఆదిలాక్షణికుల మాటను కాదనగూడదన్న వ్రతమేమీలేదు గదా అప్పకవికి? వాళ్లాయననూ ఆయన కవిత్వాన్ని ఉదాహరించటం మానేశారని చెప్పి తానూ మానేయకపోతే తానా ప్రాసమైత్రిని అంగీకరించి పోతనగారి సహజ పాండిత్యాన్ని సలక్షణంగా ప్రదర్శించవచ్చు గదా? ఎందుకు చేయలేదు? కాబట్టి అప్పకవి దృష్టిలో సహజ పాండిత్యమంటే ఛందోవ్యాకరణ పాండిత్యం లేకపోవటం కానేకాదు.

పాండిత్యం అభ్యాసలభ్యమూ, కవిత్వం సహజం- అందువల్ల- పోతన్నగారు తనకు సహజంగా కవిత్వం వుంది, కవిత్వానికవసరమైన పాండిత్యముంది- కానీ అది అభ్యాసం చేసి సాధించిందికాదు అని చెప్పదలచుకొన్నదాన్ని సహజ పాండిత్య బిరుదాన్ని చెప్పుకోటం ద్వారా చెప్పుకొన్నట్లు అని కల్పన చేయటానికి కూడా వీలుంది. సహజపాండిత్య వ్యవహారం లాగా లోకంలో సహజ కవిత్వ వ్యవహారం లేదనీ, అయినా సహజ కవిత్వం అంటూ ఒకటున్నదనీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగా

1. అప్పకవీయం (1934) పీఠిక. 27 "సహజ పాండిత్యుని సంస్మరించి" ఇంకా అప్పకవి గగనాధిపత్యంవల్ల తగణం శుభప్రదమే అవుతుందని చెప్పదలచుకొన్నప్పుడు తనకు ప్రమాణంగా పరబ్రహ్మమునకు ఉపమానంగా నభమును చెప్పిన భాగవతంలోని పద్యాన్ని (2-213) ఉదాహరించుకొన్నాడు.
   చూ: అప్పకవీయం. 4-69.
2. డా॥ ప్రసాదరాయ కులపతి- ఆంధ్ర భాగవత విమర్శ. పుటలు 514-515.
3. విశ్వనాథ సత్యనారాయణ- పోతన్నగారి సహజ పాండిత్యం పీఠిక.
4. అప్పకవీయం. 2-234.

రొకసారి వ్రాశారు. "ఎన్నడూ సంస్కృతంలో శబ్దమంజరిగాని తెలుగులో విభక్తి చంద్రికగాని యే గురువుదగ్గిఱా గురుభ్యోనమః అని అభ్యసించటం మాట ఆలా వుండగా స్వయంగా చూచి చదువక పోవడమేకాక యీ పుస్తకాలంటూ వున్నాయని కూడా యెఱక్కుండానే సంస్కృతాంధ్రాలలో ధారాళంగా తప్పొఒప్పొ తన అభిప్రాయాలు ఛందోబద్ధంగామన్నూ లయబద్ధంగానున్నూ వెలువరించే కవిత్వం సహజ కవిత్వ మనిపించుకొంటుందని నేను అనుకుంటాను. ఇంతమాత్రం చేతనే దాన్ని సహజకవిత్వమనేది లేదుగాని ఆ రచన యెక్కువ హృదయంగమంగా కూడా వుండాలనే విశేషణం కూడా చేర్చడం యుక్తం కనుక ఆ మాటకూడా చేర్చుకుందాం"[1] సహజ కవిత్వమంటే ఈలా నిర్వచనమిచ్చిన వెంకటశాస్త్రిగారు పోతన్నగారి కవిత్వ మీలాంటిదన్న అభిప్రాయమే కలిగివుంటారా? ఆ వ్యాసంలోనే పూర్వకవుల్లో ఈలాంటి సహజ కవిత్వం వ్రాసిన వాళ్ళెవరైనా వున్నారా అని ఆలోచించిన శాస్త్రి గారు పోతన్నగారి సంగతి యెత్తలేదు. వారి వారి నోళ్ళద్వారా పూర్వకాలంలో ఈలాంటి సహజ కవిత్వం ప్రచారంలో వుండి వుంటుందన్నారు. కనుక భాగవత కవిత్వం గురించి అది సహజ కవిత్వమని అప్పకవిలాగానే వెంకటశాస్త్రిగారు కూడా అనుకోవి వుండరు. అసలు పోతన్నగారు తనది సహజ పాండిత్యమని చెప్పుకొన్నాడుగానీ, సహజ కవిత్వమని చెప్పుకోలేదు [2] కనుక పాండిత్యం గురించీ దాని సహజత్వం గురించీ మాత్రమే మనమాలోచించాలి. పాండిత్యాన్ని గురించి తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు వ్రాశారు. దాని సహజత్వం గురించి మనం వ్రాయాలి.

సహజ పాండిత్య బిరుదంలో ఆధ్యాత్మికవాదతాత్విక దృక్పథాన్ని చూడటమే నిగమార్థ ప్రతిపాదకమైన భాగవత శాస్త్రాన్ని తెలుగులో చెబుతున్న పోతన్న గారి విషయంలో సమంజసంగా వుంటుంది. ప్రకృతి మాయామహితం గాని పరబ్రహ్మము దేవకీ వసుదేవులకు కృష్ణుడుగా అవతరించి అతిమానుషములను ప్రదర్శించిన భక్తరక్షణ కళాపారీణతను కీర్తించిన భగవద్విషయం గదా భాగవతం. భాగవతంలో ప్రతిపాదింపబడిన వాసుదేవ భగవత్తత్వం గురించి తెలుసుకోటం ద్వారా సహజ పాండిత్యం గురించి కొంత తెలుసుకోవచ్చు.

---

1. కథలు- గాథలు. ద్వితీయ భాగం. సహజ కవిత్వం (21-1-1939 కృష్ణాపత్రిక) పుట. 831.

2. సహజ పాండిత్యమంటే పుట్టు కవిత్వమని కూడా చెప్పకూడదనిపిస్తున్నది. చూ. వెల్చేరు నారాయణరావు. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. పు. 48.

అసలు గురుముఖతః పోతన్నగారు ఏమీ నేర్చుకొన్నట్లు కనిపించదని పెద్ద లోకపక్క అంటుంటే పోతన్నగారినీ ఆయన సహజ పాండిత్యాన్ని గురించి ఆధ్యాత్మిక వాదదృక్పథం నుండి ఆలోచించాలనటం మరీ విడ్డూరం కాదా అని అనవచ్చు. తాను గరుముఖతః ఏమీ చదువుకోలేదని పోతన్నగారు చెప్పలేదు. గురువు గారి పేరు చెప్పనంత మాత్రం చేత పోతన్నగారుగానీ, ఆయన్నుచూచి నేర్చుకొని పోయిన ఇతరులుకాని నిజంగా గురువుగారితో నిమిత్తం లేని సహజ పాండిత్యులని అనటానికి వీలులేదు. ఒకవేళ ఏదైనా తగాదా వచ్చిన సందర్భాలుంటే గురువుల పేర్లు చెప్పక పోవచ్చు. అంతేకానీ అంతమాత్రం చేత అసలు గురుశిష్య న్యాయానికి అతీతంగా పోతన్నగారిని గూర్చి భావించటం పద్ధతిగాలేదు. ఎందుకంటె రామ కృష్ణులు కాశికిపోయి సాందీపని యొద్ద శుశ్రూషచేసి చదువుకొన్న వైనాన్ని పోతన్న గారు మానవులుగా పుట్టారు గనుక ఎంత సర్వజ్ఞులైనా ఎంత జగద్గురువులైనా వాళ్ళకు తప్పలేదని వ్రాశాడు.[1] మానవుడుగా అవతరించిన భగవంతులయిన రామ కృష్ణులకేలోక హితార్థంగానైనా గుర్వంగీకరణం చేయక తప్పలేదని వ్రాస్తున్న పోతన తన విషయంలో గురుప్రబోధం లేదనీ అందువల్లనే తనది సహజ పాండిత్యమనీ చెప్పుకొన్నాడనీ మనమిప్పుడు వ్యాఖ్యానం చెప్పటం సముచితం కాదు. శ్రద్ధగా అధ్యయనం చెయ్యటం మొదలుపెడితే పోతన్నగారి సహజ పాండిత్యంలోని గురు పరంపరా సంప్రదాయ ప్రాప్తవిజ్ఞాన వైదుష్య విశేషాలు బయటపడే అవకాశముంది. అందుకు పోతన భాగవత పరమార్థవిషయ పరిశోధన శాస్త్రీయంగా జరుగవలసి వున్నదని చెప్పటం. అందువల్ల భాగవత వాసుదేవ తత్వం అంటే ఏమిటో మనం విచారిస్తే దాన్ని ప్రతిపాదించి పోతన సహజ పాండిత్య తత్వార్థం తెలుస్తుంది.

అంతకంటె ముందు మరొక్క విషయం చెప్పాలి. గురుభ్యోనమః అని ఏ గురువు దగ్గరా ఏ మాత్రం నేర్చుకోకుండా చెప్పగల కవిత్వాన్ని సహజ కవిత్వమని వెంకటశాస్త్రిగారనుకొన్నా గురు పాదారవిందాలు భజించని వాని కవిత్వాది గద్యం

1. భాగవతం, దశమస్కంధం, పూర్వభాగం, 1406 – 1414 ఇంకా ఉత్తర భాగంలో (995. 98) గురు భజనంబు పరమ ధర్మంబని, యాచరించితిననీ గురు జనంబుల పరమభక్తి సేవించువారలం బరిణమింతునని కృష్ణుడు చెప్పినట్లుగాకూడ పోతన్న వ్రాశాడు గదా.

సుపద్యం అంతా నిష్ప్రయోజనమని శంకరులంటున్న సంగతి[1] పోతనకు తెలియనే తెలియదనటం కూడా సమంజసం కాదు. గురు శుశ్రూషను విజ్ఞాన వైరాగ్య లాభ సాధనా లయిన భాగవత ధర్మాల్లో మెట్టమొదటిగా చెబుతున్న[2] పోతన్నగారిని గురించి మాట్లాడేటప్పుడు జాగ్రత్త అవసరం.

చదువును గురించి ఒకటికి పదిసార్లు భాగవతం నిండా వ్రాసి పెట్టిన పోతన్న గారు చదువు సంధ్యలు లేనివాడు అని భాగవతం చదివిన తరువాత కూడా మన మనటం - అనుకోవటం రెండూ మంచిగాలేవు. చదువనివాడజ్ఞుడు కావటమన్నది కానీ, చదివిన తరువాతకూడా సదసద్వివేక చతురత కలగకపోతే[3] ఏమిటి చెయ్యటం? పోతన్నగారు తాను ఏది చదువు అని అనుకొన్నాడో దాని ప్రాశస్త్యాన్ని వివరించ టానికే ప్రహ్లాద చరిత్ర వ్రాశాడు. జీవితానికి లక్ష్యం శ్రీ కైవల్య పదం చేరటం. దానికి సరియైన మార్గం విష్ణుభక్తి చదువు, ఆ మార్గాన పోవటానికి సాధనం. కనుక విష్ణుభక్తిని గురించి చెప్పని చదువు చదివిన వాణ్ణి శ్రీ కైవల్యం చేర్చదు కనుక లక్ష్యాన్ని అందుకోటానికి తోడ్పడని చదువును చదువ వలసిన పనిలేదు. కాబట్టే ప్రహ్లాదుడు లక్ష్యశుద్ధి లేని చదువులను చదివించే గురువుల బారినుండి రాక్షస బాలురను రక్షించటానికి ఉద్యమించాడు ప్రభువుల దండనకు గురియైనాడు. అయినా చదువు విషయంలో నిర్దుష్టమూ అయిన శాస్త్రీయ నిశ్చయ దృక్పథమున్న కారణంగా లక్ష్యాన్ని చేరుకో గలిగాడు. పోతన్నగారు కూడా ఇంతే. లక్ష్యాన్ని చేరు కోటానికి మార్గమైన భాగవతంలోని భగవద్వాసుదేవ తత్వం తెలిస్తే ఆయన సహజ పాండిత్యం సంగతి తెలుస్తుంది.

---

1. షడంగాది వేదాః ముఖే శాస్త్ర విద్యాః
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి
గురోరంఘ్రి పద్మే మనశ్చేన దత్తం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం.

2. సప్తమస్కంధం 239.

3. సప్తమస్కంధం, 121. ఇంకా- చక్రహస్తుని ప్రకటించు చదువుచదువు (169) శోధింపంబడె సర్వశాస్త్రములు (183) గురువులు తమకును లోబడు తెరువులు చెప్పెదరు విష్ణు దివ్యపదవికిం దెరువులు చెప్పరు (216) గురుశిక్షితంబులయిన చదువులు చాలించి (250) - ఇలా ఎన్నో విషయాలు చదువును గురించి తెలిపిన పోతన్నగారికి చదువు రాదంటేనే గొప్ప అనీ, చదువుకోలేదంటేనే గొప్ప అని భావించటం తప్పు

ద్వాదశాక్షరి- ఓంనమో భగవతే వాసుదేవాయ. మరి వాసుదేవ తత్వమంటే ఏమిటి? వసుదేవ దేవకులకు పుత్రుడుగా పుట్టిన కృష్ణుడు వాసుదేవుడు వాసుదేవుని సహజ తత్వమేదో అది వాసుదేవతత్వం వసుదేవుని కొడుకైనాడు గనుక వాసుదేవుడు కాకపోతే? ఈ ప్రశ్నకు సమాధానమే వాసుదేవతత్వం. వాసుదేవుడు సగుణుడు. తత్వం నిర్గుణం. మహర్షుల యోగదృష్టికి కూడా అందని ఆనందమాత్రమైన తత్వం మాంస నయనాంచల గోచరంగా శ్రీకృష్ణుడుగా పుట్టాడు. ఈ శ్రీకృష్ణుడైన వాసుదేవుని యొక్క ఆనందమూర్తమైన తత్వము సగుణస్వరూప స్వభావాలతో ప్రవర్తించిన వైనమంతా వాసుదేవ తత్వమే. వాసుదేవుని ఆకారం చేసుకొని విస్తరింపబడిన భగవద్విలాసమంతా భాగవతంగా వ్రాశాడు గనుక ఇందులో ఏమున్నదయ్యా అంటే వాసుదేవ తత్వమున్నదంటాడు సర్వభూత అంతర్యామిగా వుండే ఈ తత్వానికి ఈశ్వరుడనీ జీవాత్మ అనీ పేరు శరీరమాయా కవచంలో ఇరుక్కొన్న జీవులకు శరీరధర్మాలు సోకి సహజమైన ఈశ్వరభావనను కప్పిపుచ్చి శరీరతాదాత్మ్యం రూఢిచేస్తాయి. ఈ శరీరాభిమానం చేతనే లోకంలోని స్వామి భృత్యసంబంధ వైరుధ్యాలు ఏర్పడుతున్నాయని అందువల్లనే సంసార జీవనం ప్రజానీకానికి కష్టభూయిష్ఠమవుతున్నదనీ- స్వామి భృత్యసంబంధ మూలకారణం తెలిసి దేవాభిమానం నుండి జీవులను వైదొలగ లాగి సహజమైన ఈశ్వరభావాన్ని పొందించటమే వాసుదేవ తత్వాన్ని విశదీకరించటంలో భాగవతం ఉద్దేశం. వాసుదేవ భగవత్తత్వ విజ్ఞానమే సహజ పాండిత్యం. దేహాభిమానాన్ని విసర్జించి తన ఈశ్వర స్వరూప స్వభావానుసంధాన ప్రవణత చేత అంతర్యామిత్వము నందుకొన్న పోతన్నగారి సంసార భయవిముక్త జీవుడు సహజ పండా.[1] తన సహజ పండా లక్షణాన్ని తానెరిగినవాడు గనుక పోతన్నగారు సహజ పండితుడు పండితుని కర్మ పాండిత్యము శ్రీ మహాభాగవత మహాపురాణమన్న తెలుగుభాషా సాహిత్యనిర్మాణం పోతన్నగారి పాండిత్య కర్మ. అందువల్లనే గద్యలో సహజపాండిత్య పోతనామాత్య అని చెప్పుకొన్నాడు. పోతన్నగారి కవిత్వ అవగాహనకు ఆయన సాభిప్రాయంగా చేసే రచనను అనుసరించాలి. భాగవతతత్వ సమస్త భావాభిజ్ఞతకు కీలకం సహజపాండిత్య ప్రత్యభిజ్ఞలో

---

1. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు - పోతన్నగారి సహజ పాండిత్యం, 1969 (వావిళ్ళ - మద్రాసు) పుటలు 3-5.

వుంది.[1] సహజ వాసనారూపమగు యోగ[2]సిద్ధినే సహజ పాండిత్యమని అనవచ్చును కూడా.

మరొకటి కూడా వుంది. శ్రీమద్రామానుజులవారి మతంలో నిర్గుణ పరబ్రహ్మానికి స్వాభావిక దివ్యరూపమొకటి ఉన్నది.[3] స్వాభావికమంటె సహజమని. ప్రాకృత హేయగుణ రహితత్వమే బ్రహ్మముయొక్క నిర్గుణమైన సహజస్థితి. అదే అపహత పాపమును సమస్త కల్యాణ గుణోపేతమును అయిన బ్రహ్మముయొక్క స్వభావము. స్వభావమే స్వరూపము. అదీ సహజస్థితి అంటే ఆ పరబ్రహ్మము యొక్క సహజ స్వాభావిక దివ్యరూపం గురించిన విజ్ఞాన వివేకమే సహజ పాండిత్యం. ఈవిధంగా కూడా భాగవత పోతన బిరుదునామాన్ని అర్థం చేసుకోవచ్చు.

మహిత యశోవిలాస గుణమండన సర్వశరణ్య యింద్రియ
స్పృహులకు గానరాక యతసీ కుసుమద్యుతి నొప్పుచున్న నీ
సహజ శరీరమిప్పుడు భృశంబుగ జూచి మదీయ దృక్కులిం
దహహ కృతార్థతం బొరసె నచ్యుత మ్రొక్కెద మాదరింపవే.[4]

నిత్యముక్తమైన జడపదార్థ సంబంధంలేని జీవ సహజస్వభావ వివేకానుభవానికి సాధనరూపమైన పాండిత్యమే సహజ పాండిత్యం.[5] నిత్యముక్తమంటే నిత్యమన్నట్లుగా చుట్టి ముట్టి వుండే సంసారభయం నుండి విముక్తం కావటం. అదే అసలు మోక్షం. జీవితంలో ముక్తిముక్తిగానీ విదేహముక్తి ముక్తికాదు.

సహజ పాండిత్యమంటే మరొకవిధంగా కూడా వుంది. కవియొక్క కావ్య రచనా కౌశలాన్ని సహజమనీ ఆహార్యమనీ అంటారు. కావ్యంలో వస్తువూ దాని

1. ఇంద్రియ స్పృహులగు వారికి కానరాని వాసుదేవ పరబ్రహ్మముయొక్క అతసీ కుసుమద్యుతి నొప్పు సహజ శరీరదర్శన భాగ్యానికి నోచుకొన్న జ్ఞానమే సహజ పాండిత్యం. చూ: భాగవతం, 3-554.
2. భాగవతం, 5-2-67
3. శ్రీభాష్యం.
4. భాగవతం, తృతీయస్కంధం - 554. ఇంకా పంచమస్కంధం 2-67 వచనం చూడండి.
5. సర్వేపల్లి రాధాకృష్ణుల భారతీయ తత్వశాస్త్రం, (అను) 5-350, 51.

రచనా రెండూ వుంటాయి. ఆ రెండింటి ఏకరూపతకు నిర్మితి అనిపేరు. వస్తువు అనగానే వర్ణింపబడటానికి కవిచేత స్వీకరింపబడిన విషయపదార్థం. వర్ణించటమంటే ప్రతిపాదించటమని అర్థం. వస్తురూప పదార్థలక్షణ మేమిటంటే దానికొక స్వపరిస్పంద సుందరత్వముంటుంది, అది దాని స్వాభావిక ధర్మం. సూక్ష్మ సుకుమార సుందరమైన వస్తుస్వభావమును ప్రకటించే కవియొక్క రచనా కౌశలాన్ని సహజమన్నారు. వస్తుసహజ తత్వాన్ని పట్టుకోగలిగిన కవి శక్తినికూడా సహజ శబ్దంతోనే వ్యవహరించటం వల్లనే కావ్యరచనా కౌశలంలో సగానికి సహజలక్షణం పట్టింది. కావ్యవస్తువుయొక్క సహజతత్వదర్శన పాండిత్యమే సహజ పాండిత్యం. అయితే వస్తువుయొక్క స్వాభావిక సౌకుమార్యమే ప్రతిపాద్యమైతే కావ్యరచనలో కవి ఏమి చేసినట్లు? కవిచేసే పనితనానికి అలంకారమని పేరు. అలంకారమే ఆహార్యము, వస్తుస్వాభావికత దీప్తిమంతం కావటానికి మాత్రమే ఆహార్యాన్ని ప్రయోగించగల కవి యొక్క కౌశలం సహజాహార్యం. ఈ సహజాహార్య పరికల్పనా పాండిత్యమే సహజ పాండిత్యం. ఆహార్య విషయం కవి శిక్షాభ్యాసములవల్ల సంతరించుకొనేది. వస్తు సహజత్వదర్శన మేదికలదో అది మెదడు యొక్క ప్రతిఫలనశక్తి. పోతన్న గారి భాగవత కవిత్వం మూడువంతులకు పైగా ఆయన కావ్యవస్తువు యొక్క స్వాభావిక సహజ తత్వదర్శన శక్తికి నిదర్శనంగా వుంటుంది.

భాగవతంలో ఏది ప్రతిపాద్య వస్తువు? ఆత్మతత్త్వం.[1] అది నిర్విశేషమా సవిశేషమా అంటే ప్రతిపాదింప బడుతున్నది గనుక సవిశేషమే. అందువల్ల భాగవతం ప్రధానంగా పరమాత్మతత్త్వాన్ని సవిశేష శ్రీకృష్ణ పరబ్రహ్మముగా ప్రదీప్తం చేసింది. జనమార్గవర్తియైన కృష్ణ వాసుదేవుని అతిమానుషకర్మ విశేషాలను వర్ణించటం ద్వారా భాగవతం ఆత్మతత్వ ప్రదీపకమైంది సర్వభూతాంతరాత్మ అంతర్యామి అయిన భగవంతుని లీలామానుష వ్యవహారమును ఆహార్యకల్పనా సల్పమైన రచనా కౌశలంచేత అతని స్వాభావిక సౌకుమార్య మహత్వమును పోతన్న గారు ప్రజ్వలింపజేశాడు అది ఆయన సహజ రచనా పాండిత్యానికి నిదర్శనం

పోతన్నగారి భాగవతంలో శబ్దాలంకార భూయిష్ఠంగా కనిపించే రచనా విశేషమంతా భాగవత వస్తుతత్త్వ ప్రదీపకమయిన అతని ఆహార్య రచనా కౌశలం — వక్రోక్తి జీవితకారుని మతాన్ని అనుసరించి ఆలోచన చేయటంవల్ల పోతన్నగారి సహజ పాండిత్య విషయం మరికొంత తెలియటం ద్వారా భాగవత అధ్యయన

1. భాగవతం 2 - 155.

విధానం సలక్షణమయ్యే అవకాశముంది. సలక్షణ మవుతున్నకొద్దీ పోతన భాగవత కవిత్వంలోని చిత్రవిచిత్రాలు తెలుస్తుంటాయి. పోతన్నగారి కవిత్వంలోని విచిత్రం సంగతి అనుభవైకవేద్యంగా చాలామందికి తెలుసు. ఆయన తెలివి కావాలని మనకు తెలియాలని తాను సహజ పాండిత్యుడననీ, తన కవిత్వంలో విచిత్రమున్నదనీ చెప్పినందుకైనా మనమాలోచించాలి.

## III. 3. శ్రీ కైవల్యం

శ్రీ కైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్—

శ్రీ కైవల్య పదము అంటే పరమపదం. అదే మోక్షస్థానం, స్థానమనగానే అదెక్కడో ఒకచోట భౌతికసత్యంగా వుందనికాదు. అదొక విశిష్టమైన అనుభూతి పరమైన భావన. భావన కనుకనే వైష్ణవులకది వైకుంఠం. శైవులకది కైలాసం. అద్వైతులకది బ్రహ్మానంద పదం. అసలు కైవల్య పదానికర్థం కేవలమైనదానికి సంబంధించినదని, అన్యవిషయ సంబంధవర్జితంగా నిరూపితమైనవస్తువు కైవల్యం శరీరేంద్రియాది విరహిణ ఆత్మనః అద్వితీయతయా అవస్థానం కైవల్యం. అని అమరవింపహుడు. ఆ కైవల్యపదమన్నది సగుణమా నిర్గుణమా అని చర్చ. అది ఉభయాత్మకమే అయినా అందులో ఏది పరమార్థమన్న దగ్గర మతభేదాలున్నాయి. ఆ విధంగా అద్వైతుల కైవల్యం ఒకటి విశిష్టాద్వైతుల కైవల్యం ఒకటి. పోతన గారు అద్వైతియో విశిష్టాద్వైతియో ఇక్కడనే తేలిపోవాలి కైవల్యపదానికి శ్రీకార మెందుకు చుట్టినట్లు? వైష్ణవులు విష్ణుపదమైన కైవల్యాన్ని విష్ణువునకు అనపాయినిగా శ్రీమహాలక్ష్మి యొక్క ఉనికితో కలిపి చెబుతారు. అందువల్ల పోతన్నగారి శ్రీకైవల్యపదాన్ని విశిష్టాద్వైత మతానుసరణంగానే అర్థం చేసుకోవాలి. ఆ పరమపద ప్రాప్తి సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యములనే నాల్గు స్థాయిభేదాలతో ఉన్నది. ఈస్థాయి భేదగతికి క్రమముక్తియని పేరు. తరవాతి కైవల్యస్థితి. అది సూర్యోదయము వంటిది [2] పరమముక్తి. పునరావృత్తి రహితస్థితియే మోక్షము. పోతన్నగారు భాగవత రచన కుద్దేశించిన ప్రయోజనం పునర్జన్మలేకుండా పోవటం. అయితే

1. అమలం నిత్యం వ్యాపకం అక్షయం సమస్త హేయరహితం విష్ణ్వాఖ్యం పరమం పదం. విష్ణుపురాణం, 6-4-40.
2. సూరి రామకోటిశాస్త్రి, మోక్ష స్వరూపము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (1970) ప్రచురణ. అమరవాణీ ప్రసారములు. పు. 278 - 282.

పోతన్నగారు స్వర్గసుఖాలు కోరలేదా? లేదు స్వర్గసుఖము వైదిక కర్మను ఆచరించటంవల్ల వచ్చేఫలితం. కర్మఫలం.. ఇహలోకానికి సంబంధించినదైనా, పరలోకానికి సంబంధించినదైనా అనుభవింపబడి నశించిపోతుంది. కర్మఫలానుభవానికి తదుచితమైన ఉపాధి- శరీరం- ఉండాలి. మోక్షానికి ఉపాధిసంబంధం లేదు. అయితే పోతన్నగారు కోరినముక్తి జీవన్ముక్తియా? విదేహముక్తియా? ఆయన శ్రీకైవల్య పదం కోరుకొంటున్నాడు గనుక అది విష్ణుపదమైన వైకుంఠం గనుక[1] వైకుంఠము చేరి విష్ణుసన్నిధిలో దివ్యశరీరంతో సాలోక్యముక్తిని కోరుకొన్నట్లు. సాలోక్యముక్తి దశకూడా పునరావృత్తి రహితమే అందువల్ల పోతన్నగారు విదేహముక్తినే కోరుతున్నాడు. శరీరం నడుస్తున్నంతసేపు జీవుడు పరమాత్మతో తనకుగల అంశాంశిభావజ్ఞానంతో ప్రపన్నుడు కావటమే విశిష్టాద్వైత లక్షణం జీవన్ముక్తిలక్షణం కాదు ప్రపన్నుడు- సిద్ధుడుగా, పరమభక్తుడుగా నుండి పరమాత్మ నామకథా సంస్మరణం చేస్తూ ఒక తన్మయస్థితిలో వుండిపోతాడు. పోతన్నగారి భాగవత రచనా ప్రవృత్తి అంతా ఆయన ప్రపన్నార్తిదశా విశేషం. అందుకనే ఆయన వ్రాసుకొన్నాడు "భాగవతముఁ- దీనిం- దెనిఁగించి నాజననంబుఁ సఫలంబుచేసెద పునర్జన్మంబు లేకుండఁగ[2]-" అని. ప్రపన్నార్తి హరుండైన హరి భక్తుడు తనను చేరుకోటానికి సహాయపడతాడు. వానికి అనన్యత్వ సత్యలక్షణ ప్రబోధాన్ని కలిగించి పునర్జన్మ లేకుండాచేసి తనతో వుంచుకొంటాడు. ఈ విశిష్టాద్వైత విజ్ఞానం కలవాడు గనుకనే పోతన ఆవిధంగా వ్రాయగలిగాడు. కైవల్యపదం అద్వైతం వైపు మొగ్గకుండా కూడా దానికి శ్రీకారం చుట్టి వైశిష్ట్యాన్ని కాపాడినాడు.

భాగవతం భక్తి ప్రపత్తులమయం. ప్రపత్తికి నిత్య నిదర్శనం శ్రీమహాలక్ష్మి. తననే ఉదాహరణంగా చూపిస్తూ ఆమె భగవదనుగ్రహ ప్రాప్తికి భక్తులకు ఉపాయాన్ని సూచిస్తుంది. ఆవిధంగా ప్రపత్తిరూప ధ్రువాస్మృతిని కలిగించి భక్తసముద్ధరణకు ప్రధాన సహాయ భూతురాలు అమ్మవారు గనుక ఆమెనుకూడా స్మరించినట్లవుతూ విశేషంగా వుంటుందని భక్తబాంధవుఁడుండే ఆ పరమపదాన్ని శ్రీకైవల్యమన్నాడు పోతన.

1. దశమస్కంధం, ఉ. భా. అమృతపదం బైనట్టి కైవల్యముఁ, 1336.
2. భాగవతం 1 - 10.

పోతన్నగారి భాగవతం అద్వైతగ్రంథం అని బయలుదేరేముందు పరమేశ్వరుడు హంసావతారం ధరించ నారదునకు భాగవత మహాపురాణాన్ని ఉపదేశించాడు[1] అని పోతనగారు వ్రాసినదాన్ని చూడాలి భాగవత పాంచరాత్రము లొక్కటేనన్న విషయాన్ని విచారించాలి. అద్వైత వేదాంత మతమున జీవబ్రహ్మములకు అభేదము. భాగవత మతంలోని వాసుదేవ పరబ్రహ్మము అద్వితీయుడు కావటం, ఆయనయే ప్రపంచ స్థితికి ఉభయకారణుడు కావటం వరకు వేదాంత మతానికిష్టమే. అభిగమనాదులచేత ఆయనను సేవించాలనట కూడా ఇష్టమే.[2] ఈ లక్షణాలు సవిస్తరంగా భాగవతంలో కథారూపాలుగా కూడా ప్రదర్శించటంచేత భాగవతం అద్వైతవేదాంత మత గ్రంథమేమో ననిపిస్తుంది కానీ కాదు.

పోతన్నగారి శ్రీకైవల్యపదం చేరుకొనటం గురించిన చింతించటం బ్రహ్మవిచారం లాంటిదే. శ్రీకృష్ణ వాసుదేవ పరబ్రహ్మ ప్రతిపాదికమైన భాగవతాన్ని అనుష్ఠాన విచారణ రూపంగా తెనిగించాడు. బ్రహ్మమును తెలుసుకొనటం జిజ్ఞాసకు ప్రయోజనమా ఉపాసించటం ప్రయోజనమా- ఇదొక సమస్య. అయితే భాగవతం కర్మకాండం గురించి ప్రవర్తించేదా? బ్రహ్మకాండం గురించి ప్రవర్తించేదా? అది పురాణం గదా ఇతిహాస పురాణాలు బ్రహ్మకాండం గురించి ప్రవర్తించేవే. ఉపాసనాదికకమంతా కర్మకాండ వట్టి వస్తుతత్వ వివేకజ్ఞానం బ్రహ్మకాండం మరి భారతాన్ని గురించి "వేదములకు నఖిలస్మృతివాదములకు బహుపురాణ వర్గంబులకు వాదైన చోటులను తామూదల ధర్మార్థ కామమోక్ష స్థితికిన్-" అని తిక్కన్నగారు చెప్పారు. వేదాల్లో కర్మజ్ఞానాలు రెండూ వున్నాయి. స్మృతులు కర్మకాండను ప్రపంచించేవి పురాణేతిహాసాలు బ్రహ్మజ్ఞాన కాండను ప్రపంచించేవి. అయితే అందులో పురాణములు చాలా వున్నాయి. అందులో వర్గభేదాలు కూడా వున్నాయి. అందువల్ల వేదార్థానికీ, స్మృతులు చెప్పేదానికీ, పురాణవర్గాలు చెప్పేదానికీ భేదాలుండి సందేహాలను బట్టిస్తాయి. దానిమీద వాదవివాదాలు అటువంటిచోట భారతం ప్రమాణమవుతుంది అంటున్నాడు తిక్కన్నగారు. అంటే భారతం కర్మజ్ఞాన విషయాలు రెండింటిలోనూ మధ్యవర్తిగా ప్రమాణస్థాయిలో వున్నదనేగదా! అప్పుడు ఇతిహాస పురాణాలు కేవలము బ్రహ్మకాండను వివరించటానికే పుట్టినవంటున్న వైష్ణవ లోకాచార్యులవారి అభిప్రాయానికి భిన్నమవుతుంది తిక్కన్నగారి అభిప్రాయం. మరి

1. „ 2-155.
2. శ్రీవచన భూషణం, 1-2, 3.
3. బ్రహ్మసూత్రార్థ చంద్రిక. 1955, వావిళ్ళ ప్రచురణ- సంపుటం 1. పుట 798.

భాగవతం వైదిక కర్మకాండను,[1] శుద్ధాద్వైత బ్రహ్మజ్ఞాన కాండనూ[2] రెండిటిని మించి బ్రహ్మోపాసన విషయమును భక్తిజ్ఞానంగా ప్రతిపాదిస్తుంది. ఈ భక్తిజ్ఞాన సముచ్చయరూప భక్తి వేదాంతమే విశిష్టాద్వైతతత్వం. జీవజగత్తులు బ్రహ్మమునకు విశిష్టంగా. అంటె బ్రహ్మమునకు అన్యం కాకుండానూ, మరీ బ్రహ్మమే కాకుండానూ అంశాంశి సంబంధంగానూ అవయవ అవయవి సంబంధంగానూ, వుండటాన్ని పునాదిగాచేసి చేసే విచారమే భాగవత విశిష్టాద్వైత భక్తి వేదాంతం. అలాంటి పునాదిమీద అయితేనే భక్తి వేదాంత సౌధం లేస్తుంది. ఇందలి విశిష్టభూమిక కారణంగానే భగవంతుని విషయంలో భక్తులకు శరణాగతికి[3] అవకాశం కలిగింది. దాస్యానికి[4] అవకాశం కలిగింది. సఖ్యానికీ ప్రేమకూ అవకాశం కలిగింది. ఆయనతో వైరానికి కూడా అవకాశముంది. అసలు వైరాను బంధమే మోక్షానికి దగ్గరితోవ "అలుకనైన చెలిమినైన కామంబుననైన బాంధవముననైన భీతినైన తగిలి తలప నఖిలాత్ముడగు హరి చేరవచ్చు వేఱు సేయశతడు[6]" ఇది భాగవత ప్రతిపాద్య వస్తు వైశిష్ట్యం. కనుకనే భాగవతంలో రాక్షసులు భాగవతులలో భాగంగానే లెక్కకు వస్తారు. వాళ్లను రాక్షస భాగవతులంటారు. ఇటువంటి భగవంతుని యొక్క, ఇంతమంది భాగవతుల యొక్క లీలలను, గాథలను పరమభక్తుడైన పోతన్నగారు తన్మయుడై చేసిన రచన గనుకనే భాగవతం ఇంత జనరంజకంగా వుంది పోతన్నగారి అనన్యభక్తిరచన ఆంధ్రభాషా భాగవత మహాపురాణం. "అతినిశిత చంచుదళన క్షతనిర్గత పక్వఫల రసాస్వాదన మోదితరాజ శుకప్రోద్ధ శ్రుతిఘోషము సెలగ శ్రవణ సుఖదంబగుచు—[7]" జయించుకొంటూ వస్తున్నది.

అసలు శ్రీకైవల్య లక్షణమే సముచ్చయ లక్షణంగా వుంది. అమ్మవారు స్వామికి అనపాయిని కావటమే సముచ్చయ లక్షణం కదా? ఆ శ్రీకైవల్య పద మెప్పుడూ భాగవత బంధు సందోహంతో కిటకిటలాడుతూనే కళకళలాడుతుంటుంది.

1. భాగవతం, ద్వితీయస్కంధం, 20.
2. ,, ప్రథమస్కంధం. 61, ద్వితీయస్కంధం. 34.
3. భాగవతం, చతుర్థస్కంధం 357.
4. ,, ,, ,, 302.
5 కొండవోగి కామమంద్రు మహాత్మా. 4 356; కామోత్కంఠత గోపికల్ 7. 18.
6. సప్తమస్కంధం. 14.
7, తృతీయస్కంధం. 769. ఇంకా చూడండి— ప్రథమస్కంధం, వేదకల్పవృక్ష...35

భక్తులంతా ముక్తులవుతారు. భగవత్సారూప్యాన్నికూడా పొందుతారు,కాని సృష్టిక్రియా నిపుణులుకారు. ఎంత అద్వైతమైనా భగవద్భాగవత వైశిష్ట్యం వుండనే వుంది. ఆ విశిష్టసంబంధాన్నే సముచ్చయమంటారు సముచ్చయ వాదమతానికి బోధాయనుని ఆలోచనా విధానమే ప్రధాన కారణం కావచ్చు. కర్మజ్ఞాన సముచ్చయ వాదమతాన్ని అంగీకరించని శంకరులు జీవేశ్వర సముచ్చయాన్నికానీ జీవుల ఉత్పత్తినికానీ అంగీకరించరు. ఉత్పత్త్యసంభవాది కరణం[1]లో సముచ్చయ వాదమతాన్ని భాగవత మతంగా చెబుతూ శంకరులు ఈ పాంచరాత్ర ఆగమానికి వేదవిప్రతిషేధాన్నికూడా చెప్పారు. బోధాయనీయ భాగవత మతతాత్పర్యం అద్వైతం కానప్పుడు భాగవత సాత్వత సంహితను సేవించటంద్వారా పోతన్నగారు చేరదలచిన శ్రీ కైవల్య పదము అద్వైతుల కైవల్యంకాదు. మహానందాంగనా డింభకుడైన శ్రీ కృష్ణావతారము నందలి నిష్ణ వాసుదేవ పరబ్రహ్మమును గూర్చిగదా పోతన్నగారు చింతించుటకు అనగా జిజ్ఞాస చేయుట కుపక్రమించింది! భాగవతంలో భగవద్విషయ మితరమైనది ఎంత ఉన్నా శ్రీకృష్ణ కథాతత్వానుసంధానమే కైవల్య హేతువన్నమాట. ఈ ప్రధాన దేవతా వందన సమర్పణంలో ప్రప్రథమంగా పేర్కొన్న శ్రీకృష్ణ పరమాత్మ యొక్క శ్రీ కైవల్య ప్రధాన లక్షణాన్ని దశమ స్కంధాంతంలో పోతన్నగారు పునరుద్ఘాటిస్తూ వ్రాసిన పద్యం ఆయన జాగ్రత్తకు నిదర్శనం.

"మనుజేంద్రోత్తమ యేను నీకు త్రిజగన్మాంగల్యమై యొప్ప చె
ప్పిన యీ కృష్ణ కథా సుధారసము సంప్రీతాత్ములై భక్తి గ్రో
లిన పుణ్యాత్ములు గాంతురిందు సుఖముల్ నిర్ధూత సర్వాఘులై
యనయంబున్ తుదిగాంతు రచ్యుత పదం బైనట్టి కైవల్యమున్."

1. పురాణపండ మల్లయ్యశాస్త్రి గారి ఆంధ్ర సూత్ర భాష్యము (1919) రెండవ సంపుటం పుటలు 265 - 172.

## III. 4. ఇష్ట దేవతలు

పోతన్నగారు పాల్కురికి సోమనాథునివలె వీరశైవమతస్థుడుగానీ రాయల వారివలె వైష్ణవుడుగానీ కాదనటానికి ఆయన భాగవతావతారికలోని ఇష్టదేవతాస్తుతియే నిదర్శనము. నన్నయ్యగారు హరిహరాజ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ

ఇష్టదేవతలుగా పోతన్నగారాశ్రయించినట్లు, పోతన్నగారికి పురుషదేవతలు ప్రధాన దేవతలు. స్త్రీ దేవతలు ఇష్టదేవతలు. స్త్రీపుంసాత్మక దేవతా నామరూపాల విషయంలో ఈ భేదబుద్ధిలక్షణ మేమిటి ?— యదున్మీలన శక్త్యైవ విశ్వమున్మీలతిక్షణాత్ స్వాత్మాయతన విశ్రాంతాం తాంవందే ప్రతిభాం శివామ్— శివుని ప్రతిభయే శివాదేవి. ఆ విధంగానే వైష్ణవీదేవి, బ్రాహ్మీదేవి. ఆ త్రిమూర్తుల ఈ ప్రతిభలు శక్తులు. ఈశక్తి పరిస్పందమనే ఉపకరణం లేకపోతే ఆ త్రిమూర్తులేమీ చేయలేరు. ఎవరేమి చేయగలిగినా అది వారిశక్తి పరిస్పందలక్షణమేగాని అన్యం కాదు. వారికీ వారిశక్తికీ అభేదమే పరమార్థం.

వ్యవహార యోగ్యతా లక్షణమంతా భేదబుద్ధిమీద ఆధారపడివుంది. అందువల్ల శక్తిస్వరూపిణులయిన స్త్రీ దేవతలను ఇష్టదేవతలనీ పోతన్నగారు సంభావనచేశారు. అంటే నన్నయ్యగారికంటె పోతన్నగారు విశిష్టాద్వైతం వైపుగానూ అందులోనూ శక్తి విశిష్టాద్వైతం వైపుగాకూడా కాస్త మొగ్గుగా వున్నట్లు. అసలు విశిష్టాద్వైత ప్రపత్తి మార్గదర్శకురాలు శ్రీమహాలక్ష్మియే కదా ? అందుకే పోతన్నగారు మహాలక్ష్మికి మహాకాళీ మహాసరస్వతులను లీలావిలాస క్రీడాసఖీజనంలో పార్శ్వచర స్థానంలోవుంచి వర్ణించాడు. ఈ ధోరణి శాక్తేయమే.

అయితే సరస్వతిని గురించి రెండు పద్యాలు[1] ఎందుకు వ్రాయాలో అర్థం కావటంలేదు. పుట్టంబుట్ట శరంబున౯ మొలవనన్న పద్యంలో అది సరస్వతీదేవి ప్రార్థనయే అయినా వాల్మీకి వ్యాసకాళిదాసుల స్మరణమున్నది. కుమారస్వామి కూడా వున్నాడుకదా అన్నా అతనితో కలుపుకొని వాల్మీకి వ్యాస శుకభాస మయూర కాళిదాస భారవిమాఘులను తరువాత వచనంలో నుతించటం మ్రొక్కటం నమస్కరించటం ప్రణమిల్లటం కొనియాడటం పొగడటం వినుతించటం వుండనేవున్నది. ఈ పుట్ట౯ బుట్ట శరంబున౯ మొలవ పద్యంలోని రెండు విషయాలూ— సంస్కృత కవిస్తుతి బ్రాహ్మీదేవిస్తుతి— పునరుక్తాలుగానూ అధిక పాఠాలుగానూ కనిపిస్తున్నాయి. అందువల్ల ఈ పద్యం పోతన్నగారిదే అయినా[2] పాఠాంతరంగా పుట అడుగు భాగాన

---

1. ప్రథమస్కంధం. 6, 7 పద్యాలు.
2. ఈ పద్యంలో కుమారస్వామిని సంస్కృత భాషా కవులలో ఒకడుగా చేర్చటం కూడా బాగాలేదని నిడుదవోలు వెంకటరావుగారు చూపించిన పాఠాంతరం బాగానే వుంది. చూడండి— పోతన. పుట 222.

ఇదంతా నన్నయ్యగారు బ్రాహ్మణుల నుంచిసస్థానంలో శివభక్తులను, వైష్ణవ కవులు విష్ణుభక్తులను నెలకొల్పి తమతమ అధిక్యతలను ప్రచారం చేసుకోటం తప్ప మరేమీకాదు. సాహిత్యం ద్వారా మత విశ్వాసాలను ప్రజలలో నెలకొల్పటానికి అన్ని మతాలవారూ యథావకాశంగా ప్రయత్నం చేశారు. సమస్త భావాలకూ సాహిత్యం ప్రచార సాధనం మాత్రమే. భాగవతమూ అంతే—

మనమలవాటుగా ఇష్టదేవతాస్తుతి అని అంటున్నాం గానీ ఇష్టదేవతా చింతన మనటం పోతన్నగారి కిష్టం. చింతించటమనేది బహుళార్థ సాధకమైన మాట. స్మరణ ధ్యాన సమాలోచనాదికమంతా చింతనమే. పోతన్నగారికి దేవతల విషయంలో ఒక చూపున్నది. వాళ్ళనాయన ప్రధాన దేవతలనీ, ఇష్టదేవతలనీ తదితరులనీ మూడు రకాలుగా చూచాడు. ప్రధాన దేవతలంటే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. మనకు ఇష్టం కావటం కాకపోవటంతో నిమిత్తం లేకుండానే వాళ్ళు ముగ్గురూ నిఖిల భువనాలకూ సృష్టి స్థితిలయ కారకులుగా అధిదేవతలై స్వయం ప్రకాశకులుగా వున్నారు. కనుక వాళ్ళకు విధేయులుగా వందనాలు చేయటం మానవులకు తద్ధర్మమన్నమాట. అంటే మన నమస్కారాలకు వాళ్ళు మన ఇష్టాలను సమకూర్చటానికి సిద్ధంగావుండే దేవతలుకాదు. మనకావిషయం తెలియాలి. ఆ త్రిమూర్తు లీడేర్చగలిగిన వలసిన ప్రయోజనాలు మనమన ఇష్ట సిద్ధులకంటె చాలపెద్దవి. అందువల్ల ప్రధానదేవతలకు నమస్కరించ వలసినదే తప్ప ఇష్టప్రయోజన సంసిద్ధికి వెంటబడి లాభం లేదు. అందుకు వేరే దేవతలున్నారు. విఘ్నేశ్వరుడు, సరస్వతి పార్వతి లక్ష్మి. వీళ్ళు ఇష్టదేవతలు. ఇది అందరికీ వర్తించాలన్న నియమం లేదుగనుక పోతన్నగారి విషయంలో వారిష్టదేవతలు. మూడవ రకం తదితరులన్నామే వాళ్లు దేవతా ప్రముఖులు. సూర్యుడు కుమారస్వామి మొదలయిన వాళ్లు. ఇలా చెప్పటంచేత పోతన్నగారేమిచేసినట్లంటే నన్నయ్యగారు ఏ తొమ్మిదిమంది దేవతలకు నమస్కరించాడో ఆ తొమ్మిదిమందినీ ప్రధాన దేవతలని పేరుపెట్టి ముగ్గురికి వందనంచేసి; ఇష్టదేవతలని పేరుపెట్టి నలుగురిని— మ్రొక్కటంగా యాచించటంగా నమ్మితినని చెప్పుకోటంగా, ఆశాభావాన్ని వెలిబుచ్చటంగా, ఇష్టసిద్ధి విషయంలో నిశ్చయబుద్ధి కుదరటంగా— మొత్తంమీద చింతించి; ప్రముఖులన్న పేర ఇద్దరిని తలచినట్లుగా నన్నయ్యగారి మార్గాన్ని వదిలిపెట్టకుండా చిరుమార్పులతో కొనసాగించటానికి తెలిసి తెలిసి పూనుకొన్నట్లే

ఇష్టదేవతల్లో విఘ్నేశ్వరుణ్ణీ, ప్రముఖులయిన దినకర కుమారస్వాములనూ అలావుంచితే బ్రహ్మ విష్ణు మహేశ్వలనూ వారి అర్ధాంగులనూ ప్రధాన దేవతలుగా

ఇష్టదేవతలుగా పోతన్నగా రాశ్రయించినట్లు, పోతన్నగారికి పురుషదేవతలు ప్రధాన దేవతలు. స్త్రీ దేవతలు ఇష్టదేవతలు. స్త్రీపుంసాత్మక దేవతా నామరూపాల విషయంలో ఈ భేదబుద్ధిలక్షణ మేమిటి ?– యదుస్మిలన శక్త్యైవ విశ్వమస్మిలతిక్షణాత్ స్వాత్మాయతన విశ్రాంతాం తాంవందే ప్రతిభాం శివామ్– శివుని ప్రతిభయే శివాదేవి. ఆ విధంగానే వైష్ణవీదేవి, బ్రాహ్మీదేవి. ఆ త్రిమూర్తుల ఈ ప్రతిభలు శక్తులు. ఈశక్తి పరిస్పందమనే ఉపకరణం లేకపోతే ఆ త్రిమూర్తులేమీ చేయలేరు. ఎవరేమి చేయగలిగినా అది వారిశక్తి పరిస్పందలక్షణమేగాని అన్యం కాదు. వారికీ వారిశక్తికీ అభేదమే పరమార్థం.

వ్యవహార యోగ్యతా లక్షణమంతా భేదబుద్ధిమీద ఆధారపడివుంది. అందువల్ల శక్తిస్వరూపిణులయిన స్త్రీ దేవతలను ఇష్టదేవతలనీ పోతన్నగారు సంభావనచేశారు. అంటే నన్నయ్యగారికంటె పోతన్నగారు విశిష్టాద్వైతం వైపుగానూ అందులోనూ శక్తి విశిష్టాద్వైతం వైపుగాకూడా కాస్త మొగ్గుగా వున్నట్లు. అసలు విశిష్టాద్వైత ప్రపత్తి మార్గదర్శకురాలు శ్రీమహాలక్ష్మియే కదా ? అందుకే పోతన్నగారు మహాలక్ష్మికి మహాకాళీ మహాసరస్వతులను లీలావిలాస క్రీడాసఖీజనంలో పార్శ్వచర స్థానంలోవుంచి వర్ణించాడు. ఈ ధోరణి శాక్తేయమే.

అయితే సరస్వతిని గురించి రెండు పద్యాలు[1] ఎందుకు వ్రాయాలో అర్థం కావటంలేదు. పుట్టంబుట్ట శరంబునన్ మొలవనన్న పద్యంలో అది సరస్వతీదేవి ప్రార్థనయే అయినా వాల్మీకి వ్యాసకాళిదాసుల స్మరణమున్నది. కుమారస్వామి కూడా వున్నాడుకదా అన్నా అతనితో కలుపుకొని వాల్మీకి వ్యాస శుకభాస మయూర కాళిదాస భారవిమాఘులను తరువాత వచనంలో నుతించటం మ్రొక్కటం నమస్కరించటం ప్రణమిల్లటం కొనియాడటం పొగడటం వినుతించటం వుండనేవున్నది. ఈ పుట్టన్ బుట్ట శరంబునన్ మొలవ పద్యంలోని రెండు విషయాలూ– సంస్కృత కవిస్తుతి బ్రాహ్మీదేవిస్తుతి– పునరుక్తాలుగానూ అధిక పాఠాలుగానూ కనిపిస్తున్నాయి. అందువల్ల ఈ పద్యం పోతన్నగారిదే అయినా[2] పాఠాంతరంగా పుట అడుగు భాగాన

1. ప్రథమస్కంధం. 6, 7 పద్యాలు.

2. ఈ పద్యంలో కుమారస్వామిని సంస్కృత భాషా కవులలో ఒకడుగా చేర్చటం కూడా బాగాలేదని నిడుదవోలు వెంకటరావుగారు చూపించిన పాఠాంతరం బాగానే వుంది. చూడండి- పోతన పుట 222.

చూపించవలసింసేకానీ ఇష్టదేవతా స్తుతిలోని పద్యంగానే చూపించటం సముచితంగా కనిపించదు. సముచితంగా కనిపించేటట్లు భాగవత పద్యాలను సంస్కరిస్తే త్రిమూర్తులకు మూడు వారిశక్తులయిన భార్యలకు మూడుగా వినాయకుడి పద్యం మధ్యలోవుంచి పోతన్నగారు ఆరు పద్యాలను వ్రాసినట్లవుతుంది. ఈ ఆరుపద్యాలూ నన్నయ్యగారి శ్రీవాణీ గిరిజాశ్చిరాయ శ్లోకానికి పోతన్నగారి వ్యాఖ్యానప్రాయంగా బాగానేవుంటాయి.

భాగవతాన్ని తెలుగులో వ్రాసినందువల్ల పోతన్నగారాశించిన ప్రయోజన మొక్కటే— తనకు పునర్జన్మ వుండకూడదు. అయితే పోతన్నగారభిలషించింది విదేహముక్తి కావచ్చు. జీవన్ముక్తికాదా? భాగవతం తెనిగిస్తే నీకు భవబంధాలు తెగిపోతాయని శ్రీరామచంద్రుడే ముందు పోతన్నగారికి చెప్పాడు.

మరొక సంగతికూడా ఆలోచించవచ్చు. మహేశ్వర ధ్యానం చేస్తుంటే రామభద్రుడు కనిపించాడని గదా పోతన్నగారు చెబుతున్నది! రామనామం గురించి ముఖ్యంగా అద్వైతులయిన స్మార్తులలో ఒక అభిప్రాయముంది శివపంచాక్షరి— నారాయణ అష్టాక్షరి— రెండు శివ విష్ణుదేవతాకములయిన మంత్రాలనుండి మకారాన్నీ దీర్ఘరకారాన్నీ స్వీకరించి ముందు వెనుకలుగా సంపుటీకరించి రామ మంత్రాన్ని తయారుచేసి వసిష్ఠుడు దశరథుని పెద్దకొడుక్కు దానితో నామకరణం చేశాడనీ అందువల్ల శైవ వైష్ణవ భేదాలకతీతంగా రామభద్రుడు ఉభయతారకమైన దైవమనీ అంటారు. వీరశైవులుకానీ, తీవ్రవైష్ణవులుకానీ స్మార్తుల అభిప్రాయాన్ని అంగీకరించరు. మరి పోతన్నగారు తన అనుభవంగా శివుణ్ణి ధ్యానిస్తుంటే రాముడు కనిపిస్తున్నాడు అని చెబుతున్నప్పుడు అనుభూతి వాదాన్ని అంగీకరించే భావవాద తాత్విక దృక్పథం కలిగిన మనం శివకేశవ భేదం వట్టివాదాలతా రూపమేగానీ అనుభవ విషయం కాదు అని పోతన్నగారు ప్రదర్శించినట్లు తెలుసుకోవాలి కదా! రెండు మంత్రాలలో నుండి రెండక్షరాలను గ్రహించి రామనామ మంత్రం తయారు చేయబడిందన్న అభిప్రాయాన్ని అర్థవాదంగా అనుకొన్నా స్మార్తులయిన అద్వైతుల లౌకికదృష్టి శివకేశవ భేదభావాన్ని ఏ పరిస్థితుల్లోనూ అంగీకరించదన్న సిద్ధాంతాన్నే పోతన్నగారు భాగవతావతారికలో కల్పనామయం చేసి ప్రదర్శించారు. మహేశ్వరుడు రామభద్రుడూ, రామభద్రుడు శేషశాయి కావటంతో ప్రదర్శన ముగిసింది.

రామనామాన్ని శివనారాయణ మంత్రంగా సంభావించిన స్మార్త సంప్రదాయం బాగానే వుందిగానీ షష్ఠంత్యాల దగ్గరకు వచ్చేటప్పటికి మళ్ళీ శ్రీకృష్ణావతారాన్ని ఆశ్రయించట మేమిటి? ఇది రామకృష్ణావతారాలను రెండింటినీ సమంగా గ్రహించటానికి నిదర్శనము కావచ్చు. పూర్ణావతారాలయిన రామకృష్ణావతారాలలో శ్రీమద్రా

మానుజులకు ముందునుండి కూడా వైష్ణవుల్లో కృష్ణావతారమే ఆకర్షణీయంగా వుంది. క్రమంగా శ్రీరామచంద్రుని ఏకపత్నీవ్రతము, పితృవాక్య పరిపాలన, భ్రాతృవాత్స ల్యము, శరణాగతత్రాణ పరాయణత, రాజధర్మ నిర్వహణ, మొదలయిన మానవ సంబంధ మహనీయ గుణములే అనంత కల్యాణ గుణములుగా భావింపబడి శ్రీకృష్ణ పరబ్రహ్మ స్థానములో శ్రీ సీతారామ పరబ్రహ్మమును నెలకొల్పటం జరిగివుంటుంది. ఈ పనిచేసిన శ్రీరామానందుడు పదిహేనవ శతాబ్దం ప్రారంభంలో పరమపదించటం పోతన్నగారు జన్మించటం రెండూ తక్కువ వ్యవధిలోనే జరిగివుంటాయి. అందు వల్ల వైష్ణవశాఖా భేదాల నన్నింటినీ భాగవత మతంలో కలుపుకొని రావటానికి వీలుగా సమకాల ప్రభావమైన సీతారామ పరబ్రహ్మముతో పాటు పద్యాంతాలలో శ్రీకృష్ణ పరబ్రహ్మమును స్మరించి వుంటాడు. శ్రీరాముడు కనిపించటానికి రామాంకి తంగా భాగవతం వ్రాయటానికి శ్రీరామానందుల రామాయణ సంప్రదాయ ప్రభావం పోతన్నగారి మీద పనిచేసి వుండటానికి వీలున్నది.

## III. 5. కవిత్వ సంపదలు

మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదలను- దుర్గ- మాయమ్మ- వాగ్భవాని- దయచేస్తుందని చెబుతున్నాడు పోతన్న. ఈ నాలుగూ నాల్గు విషయాలా? లేక ఒక విషయము యొక్క నాల్గంశాలా? కావ్య సాహిత్య విషయంలో సంపదలంటే అర్థ మేమిటి? మహత్త్వంగానీ పటుత్వంగానీ దేనికైనా సంబంధించిన విశేషాంశాలు కావాలి. కవిత్వ మనేదానికి స్వభావము మహత్త్వమునూ, స్వరూపము పటుత్వమునూ కలిగి వుండటానికి వీలున్నది. కవిత్వంలో వస్తువూ దాని నిర్మాణమూ రెండూకలిసి వుంటాయి. కవితా వస్తువు యొక్క మహత్త్వ స్వభావ మేమిటంటే. కవివస్తు తత్త్వాన్ని ఏలా ప్రదర్శింప దలచుకొన్నాడో అలా దర్శనీయమయ్యే వస్తుస్వభావ తత్త్వమే దాని మహత్త్వము. కవిత్వానికి మహత్త్వం కలగాలంటే కవికి తాను ప్రతి పాదింప దలచుకొన్న వస్తుతత్త్వము అవస్తువునం దాయనకుముందు దర్శనం కావాలి. ఆవిధమైన దర్శనశక్తిని దుర్గాదేవి దయచేయాలి. అదే వస్తుస్వభావ దర్శన పటిష్ఠ మైన ప్రతిభా మహత్త్వం కావ్య నిర్మాణానికి ప్రాథమిక భూమిక అది పటుత్వము కావ్య నిర్మాణానికి సంబంధించింది. శబ్దార్థాలంకార బంధరూపం గదా కావ్యం. బంధ మంటే వాచ్యవాచక సౌభాగ్య లావణ్యపరిపోషక వ్యాపారశాలి వాక్యవిన్యాసం. ఈ విధమైన నిర్మాణ నిపుణత్వంవల్ల ప్రస్ఫుటమయ్యే సామాజిక జనాహ్లాదవిషయాన్నే వక్రోక్తి జీవితకారుడు బంధ సౌందర్య సంపద అన్నాడు. కావ్యనిర్మాణ నైపుణ్య

విషయాంశాలన్నీ కూడా సంపదలు. అలాంటి సర్వ సంపత్పరిస్పందత ఏకావ్యనిర్మాణమునందు సంలీనమై వుంటుందో ఆ కావ్యము తన సర్వోత్కృష్టమైన జీవిత ప్రదర్శనం చేత సామాజిక జనాహ్లాదాన్ని సంపాదిస్తుంది. వస్తుమహత్త్వము చేతనూ, నిర్మాణ పటుత్వముచేతనూ కవిత్వం కవిత్వ ప్రయోజనాన్ని ఈడేరుస్తుంది. మహత్త్వం చేతనూ పటుత్వం చేతనూ కవిత్వం సుసంపన్న మవుతుంది. పోతన్నగారు కోరిన సాహిత్య సంపదల స్వరూప స్వభావాల నింకనూ విచారించవచ్చును.

## III. 6. ఉభయ కావ్యకరణ దక్షుడు

"ఉభయ కావ్యకరణ దక్షుడనై శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలుండనై"తి నని పోతన్నగారు చెప్పిన దాని అర్థమేమి? శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనా కుతూహల మీడేరవలెనంటే ఉభయకావ్య కరణదక్షత అవసర మన్నమాట. అయినచో ఉభయ కావ్యమనగా నేమని చెప్పవచ్చును? సుకుమార విచిత్ర రచనామార్గములు రెండునుగల కావ్యము ఉభయ కావ్యమని చెప్పవచ్చును. వక్రోక్తి జీవితకారుని అనుసరించి ఈ విధముగా చెప్పినట్లే కావ్య మీమాంసాకారుని అనుసరించి మరొక విధంగా కూడా చెప్పవచ్చు. కవులు శాస్త్రకవులనీ, కావ్యకవులనీ ఉభయకవులనీ మూడు రకాలుగా వుంటారు. అందులో ఉత్తరోత్తరంగా ఒకరికంటె ఒకరు గొప్పవాళ్ళని ఒకరంటే, అదేమీలేదు ఎవరి మార్గంలో వాళ్ళే గొప్పవాళ్ళని మరొకరంటారు. శాస్త్ర సంస్కారాలు కావ్యాలకు శోభాతిశయాన్ని అనుగ్రహిస్తాయి. అలాగే కావ్య సంస్కారాలు శాస్త్ర విషయాలకు పరిపక్వతను సంపాదిస్తాయి. అందువల్ల శాస్త్రాలకూ కావ్యాలకూ ఉపకార్యోపకారక భావ సంబంధ మున్నది. శాస్త్రము విచారిత రమణీయ స్వభావం కలిగి వుంటుంది కవిత్వం అవిచారిత రమణీయ స్వభావం కలిగి వుంటుంది.[1] శ్రీమన్నారాయణ కథా ప్రపంచం విచారిత రమణీయార్థ సముదాయంగా వుంటుందా లేక అవిచారిత రమణీయార్థ సముదాయంగా వుంటుందా? ఉభయాత్మకంగా వుంటుంది మరి ఉభయాత్మకంగా వుండే భాగవత వస్తువైన అర్థాన్ని పురాణ కావ్యంగా చెప్పాలంటే కవికి ఉభయకావ్యకరణ దక్షత కావాలి భాగవత రచనకు అవసరమైన దక్షత తనకున్నదన్న సంగతి నొకసారి జ్ఞాపకం చేసుకొంటున్నట్లుగా పైకిచెప్పనే చెప్పాడు పోతన్న. భాగవతం తత్త్వవివేచన గ్రంథం. తత్త్వమూ దాని వివేచనా రూపమైన రచనా రెండూ శాస్త్రమర్యాదాత్మకములే. భాగవతంలో ఉన్నది శ్రీమన్నారాయణ కథా ప్రపంచం. నారాయణాఖ్య

1. రాజశేఖరుడు– కావ్యమీమాంస, 5, 9. అధ్యాయాలు.

బ్రహ్మ జిజ్ఞాసగా వుండే భాగవత భాగమంతా శాస్త్రం. భగవద్వ్యాసుదేవుని లీలా మానుష విలాస ప్రవృత్తి వర్ణనమంతా కావ్యం. అది విచారిత రమణీయం— ఇది అవిచారిత రమణీయం. ఇది కారణంగానే పోతన్నగారి భాగవతానికి ఎంతగా ప్రజల్లో ప్రచారమున్నదో, అంతగా అది మనకు అర్థంకాకుండా కూడా వుంటుంది. సప్రమాణంగా తత్త్వవివేచన చేయగల శక్తిసామర్థ్యాలు లేని కారణంగా భాగవతం అర్థం కాదు. విచారణకు అవకాశమూ, నిమిత్తమూ లేకుండా రమణీయ వస్తువర్ణనగా లీలా మానుష విలాస ప్రదర్శన విషయాత్మకంగా వుండటం చేత భాగవతం జనానికి ఇంద్రియాలు పట్టనంత అనుభవానందాన్ని ప్రసాదిస్తూ ప్రచారంలో వుంది. పోతన్నగారు తన వ్యుత్పత్తి సంపద చేతకంటె తన ప్రతిభా వైభవం చేత భాగవతాన్ని చైతన్యవంతం చేశారు. "ప్రతిభా వ్యుత్పత్తిమిథః సమవేతే శ్రేయస్యౌ" ఇతి యాయావరీయః.

ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడనని తనను గురించి నన్నయ్య చెప్పుకొన్నాడు. తిక్కన ఉభయకవి మిత్రుడని కేతన్న వ్రాసినాడు ఉభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమున తాను పారగుడనని తిక్కన్న చెప్పుకొన్నాడు తాను ఉభయ కావ్యకరణ దక్షుడనని పోతన్న స్వయంగా చెప్పుకొన్నాడు. ఈ అన్నిచోట్లా ఉభయ శబ్దానికి అర్థంగా చెప్పబడే జంట ఒక్కటే కాదు. నన్నయ్యగారి దగ్గర ఉభయశబ్దం సంస్కృతాంధ్ర భాషాయుగ్మాన్ని చెబుతుంది. కేతన వాడకంలో కూడా సంస్కృతాంధ్ర భాషాకవులను చెబుతుంది. ఋజువులుంటే మార్గదేశికవుల నిద్దరినీ ఉద్దేశించి కేతన ఉభయశబ్దాన్ని వాడినాడని చెప్పవచ్చు. ఉభయకావ్య ప్రౌఢి శిల్పమును గురించి మాట్లాడుతున్న సందర్భాన్నిబట్టి అక్కడ ఉభయశబ్దానికి దృశ్యశ్రవ్య కావ్యములని అర్థం చెప్పవచ్చు. ఆ రచనాశిల్ప మర్యాదల నాయన కృతులలో చూపించవచ్చును. భాగవత పురాణ గ్రంథ తత్వాన్నిబట్టి పోతన్నగారి ఉభయ కావ్యకరణ దక్షతకు— శాస్త్రకవి దక్షత, కావ్యకవి దక్షత, రెండూ కలిసిన— దక్షత అని చెప్పవచ్చు. ఉభయ వేదాంత మన్నప్పుడు ఉభయ శబ్దానికర్థం వేరుకదా? శ్రీమన్నారాయణాఖ్య పరబ్రహ్మము దోషవివర్జితత్వం చేతా కల్యాణగుణ మయత్వం చేతగదా ఉభయలక్షణ లక్షితంగా చెబుతున్నది? ఆయా సందర్భాలను బట్టి, ప్రయోక్తల అంతర్యాన్ని బట్టి, అందుకనువుగా వున్న ఋజువులను బట్టి అర్థసంయోజన విషయం ఆలోచించాలిగానీ ఏదో ఒక్క అర్థాన్నిమాత్రమే అన్నిచోట్లకూ శాసనగించాలన్న చూపు మంచిదికాదు. ఉభయకవి శబ్దప్రయోగం చేసి మాట్లాడినాడు కదా అని రాజశేఖరుని మాటను తిరుమంత్రంగా భావించి అన్నిచోట్లా అదే అర్థమని బయలుదేరటం సముచితం కాదు. పోతన్నగారి విషయంలో రాజశేఖరుని అర్థమే అర్థం.



## III. 7. ఇమ్మనుజేశ్వరాధములు

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు( గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసికాలుచే
సమ్మెట వాటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఈ పద్యం భాగవతంలో ఎక్కడైతే (1-11) వున్నదో అక్కడి చోటు దీనికి సముచితమైన స్థానం కాదు కాదన్న సంగతి తెలిసికూడా ఈపద్యాన్నక్కడి నుండి ఇంతవరకూ ఎవ్వరూ తొలగించలేదు. తొలగించాలని అనుకోలేదు. అకాడమీ ప్రతి సంపాదకులు కూడా 'చూచిన వ్రాత ప్రతులన్నింటిలో నీపద్య మిచ్చటనే యుండుట చేత అట్లే యుంచబడినది' అని వ్రాసి యథాతథస్థితిని కాపాడినారు. అవతారికనంతా ఉత్తమ పురుషలో వ్రాసుకొంటున్న పోతన హఠాత్తుగా ప్రథమ పురుషముగా తనను గురించి వ్రాసుకొంటాడా? వ్రాసుకొంటే మాత్రం అంత అసందర్భంగా ఇరికిస్తాడా? నన్నయభట్టులాగా అవతారికను ప్రథమ పురుషంగా పోతన్న వ్రాయలేదు. అందువల్ల ఆ పద్యం పోతన్నగారిదే అయివుండదు అయినా భాగవత రచన పూర్తి అయిన తరువాత చెప్పుకొన్న పద్యమై యుండాలి. పోతన తననుగురించి తాను ప్రశంసించు కొంటూ భాగవత రచన చేయకముందే చేశాను సుమా అని పద్యం వ్రాసుకొని వుండరు. భాగవత రచన అయిన తరువాత ఆ పద్యాన్ని పోతనే వ్రాసుకొని వుంటా రన్న దానికంటె ఆయన సంగతి బాగాతెలిసిన ఆయనయందు భక్తి గౌరవాదరాలు కలిగిన మంచివాడెవడో చెప్పి వుంటాడనటం సమంజసంగా వుంటుంది. సందర్భ శుద్ధిలేకుండా భాగవత తాళపత్ర ప్రతుల్లోకి ఎల్లాగో చేరింది. చేరిందికదా అని కదలించ కుండా వుంచదగిన స్థలంలో లేదా పద్యం.[1] అయినా పోతన్నగారి కీర్తిలో సగమైనా ఆపద్యం మీద ఆధారపడి వుంది.

పోతన్నగారి లాగా ప్రభువులను ఆశ్రయించకుండానూ నిందాపూర్వకంగా వాళ్ళను తిరస్కరిస్తూనూ తలఎత్తుకొని తిరిగిన మహానుభావులలో వేదాంత దేశికుల వారిని ముందుగా చెప్పవచ్చునేమో. శైవులు జైనమతాన్ని పడగొట్టిన తరువాత తెలుగు దేశంలో రామానుజ వైష్ణవంలో కూడా వైదిక ధర్మమతం వైపు కొంత

1. వెంపరాల సూర్యనారాయణశాస్త్రి. పోతన- పు 62

మొగ్గ పదునాల్గవ శతాబ్దానికి కనిపించింది. ఈ మొగ్గదలకు వేదాంత దేశికులవారిదే నాయకత్వం. లోకాచార్యులవారి నాయకత్వం కంటే దేశికులవారి నాయకత్వ ప్రభావం తెలుగు ం మీద ఎక్కువగా పడింది. దేశికులవారి అత్మశిష్యుడు రాచకొండ సర్వజ్ఞ సింగమనాయని వారివి దర్శించి వారిని వైష్ణవులుగా మార్చి తెలంగాణంలో తమ మతాన్ని ప్రచారం చేయటానికి ఎక్కువ కృషి చేశాడు. వేదాంత దేశికులవారి వైదిక వైష్ణవమత ప్రభావానికి చిన్నప్పటినుండి పోతన్నగారు గురియై ఉండవచ్చు. వేదాంత దేశికులవారు రాజాశ్రయాన్ని తిరస్కరించి చెప్పిన శ్లోకాలు అద్భుత విషయంగా ప్రచారంలో వుండివుంటాయి. అందులోని "క్షోణీకోణ శతాంశ పాలనకలా దుర్వార గర్వానల క్షుభ్యత్ క్షుద్రనరేంద్ర చాటురచనా ధన్యాన్ న మన్యామహే.." ఈలాంటి భావాలు పోతన్నగారి బుర్రకెక్కి వుండవచ్చు ఇమ్మనుజేశ్వరాధముల నన్న పద్యం పోతన్నగారు వ్రాసినా మరెవరన్నా వ్రాసినా వారికంతటి ధైర్యాన్ని ప్రసాదించే దేశికులవారి ప్రభావ నేపథ్యం ఆకాలంలో వుందని చెప్పటమే తాత్పర్యం.

పోతన్నగారి విషయం మాట్లాడుతున్నాం గనుక దేశికులవారిని స్మరిస్తున్నాం. ప్రభువులను తిరస్కరించి తూలనాడిన శివభక్తుల ఉదంతాలు కిన్నర బ్రహ్మయ్య లాంటి వాళ్ళవి చాలా వున్నాయి. శివభక్తులు మహిమలు ప్రదర్శించి తమ మతానికి మహారాజులను దాసులను చేశారు. శాపానుగ్రహ సామర్థ్య ప్రదర్శనం చేత రాజులను వశవర్తులుగా చేసుకొన్న కవులు భీమకవి లాంటి వాళ్లున్నారు ముఖ్యంగా శివాచార దీక్షావ్రతులు తమను తాము రాజ్యాధిపతులతో సమానంగానూ అంతకంటె ఎక్కువగానూ భావించారు[1] ప్రకటించి అలా ప్రవర్తించారు కూడా. ఈ ఉద్ధృతిని పోతన్నగారి కంటె ముందు చాలాకాలంగా తెలుగు సాహిత్య వాతావరణం పోషించుకొంటూ వస్తున్నది. పదిహేనవ శతాబ్దం వచ్చేటప్పటికి దేశికులవారి పవైదిక వైష్ణవ ప్రచారంలో కూడా ప్రవర్తకులు ప్రభువులను త్రోసి రాజనగల ఉద్ధృతిని ప్రదర్శించటానికి ముందుకు వచ్చారు. అయితే దేశికులవారి వైదికవైష్ణవం వీరశైవ ఉద్ధృతి వల్ల దానికి కలిగిన లాభనష్టాలను లెక్కచూచుకొని గుణపాఠాన్ని గ్రహించి తాను ప్రవర్తించింది. తన ప్రచారానికి అనుకూలపడే ఎన్నో పద్ధతులను శైవం నుండి వైష్ణవం స్వీకరించింది. ప్రధానమైంది మత ప్రచారానికి దేశభాషా కవులనూ, దేశభాషా సాహిత్యాలను ఉపయోగించుకోటం. శివభక్తిస్థానంలో విష్ణుభక్తిని కీర్తించటం శివాశ్రమాచార్యులకు లాగా వైష్ణవాచార్యులు శిష్యులను సమకూర్చుకొని నామనంకీ

1. పండితారాధ్య చరిత్ర వాద ప్రకరణం - పు. 509.

ర్తన పరివారాల కుపయోగించటం.[1] వీరశైవుల పరమత అన్యదైవత నిందను వైష్ణవం సిద్ధాంత రీత్యా వదలివేసింది. హింసను భౌతికంగా తిరస్కరించి దయా దాక్షిణ్యాలను, సహనాన్నీ, ప్రధానంగా ప్రదర్శించింది భగవంతుని మహిమకు నిదర్శనంగా భక్తులను వీరశైవం ప్రవర్తింప జేసింది భక్తుల మహిమకు నిదర్శనంగా భగవంతుని ప్రవర్తింపజేసింది వైష్ణవం. భగవదపచారం కంటె భాగవతాపచారం గొప్పదంటే అర్థమదే.

అందువల్ల పోతన్నగారు వ్రాసినట్లున్న ఇమ్మనుజేశ్వరాధము లన్న పద్యం భగవద్భక్త మాహాత్మ్యాన్ని నిదర్శనంగా చూపుతూ ఎవరో భాగవతుడొకడు వ్రాసి వుంటాడు. అది పోతన్నగారి రచనగా భాగవతంలోకి ఎక్కింది. అసందర్భంగా ఈమాట చెబుతూ ఇస్తే ఆ పద్యాన్ని ఫుట్‌నోటుగా శారదనీరదేందు, అంబనవాంబు జోజ్వల మొదలయిన ప్రక్షిప్త పద్యాల నిచ్చినట్లు ఇయ్యవచ్చు[2] భాగవత అవతారిక చట్టంలో ఇముడదు కనుక కిందికి దించటం మంచిది.

మరొకటి కూడా వుంది. పోతన్నగారి కీర్తి సగానికి పైగా ఆ పద్యంమీద ఆధారపడి వుందని అంటున్నాం గదా? దాని సంగతేమిటి? ఆ పద్యంవల్ల వచ్చిన ఆయన కీర్తి రెండు దశలుగా వచ్చింది. తనకృతిని నరాంకితం చేయకుండా భగవద్దత్తం చేశాడు గనుక ఆయన అసాధారణమైన పనిచేసిన మహానుభావుడని కొన్నాళ్ల మన పూర్వతరం వాళ్ళదాకా కీర్తించుకొంటూ వచ్చాం. ఇమ్మనుజేశ్వరాధములని రాజులను దూషించాడు గదా అని, రాచరిక ప్రభుత్వాలకు వ్యతిరేకంగా కార్యాచరణ శీలమైన జాతీయ విముక్తి పోరాట విజయ గీతికలకు ప్రేరకమైన భావజాలం వ్యాపించిన వాతావరణ కాలజ్ఞానం వల్ల మన తరంలోనూ పోతనగారిని కీర్తిస్తున్నాం.[3]

1. పండితారాధ్య చరిత్ర వాద ప్రకరణం- పు. 511.
2. ఇవి ప్రక్షిప్తాలు కావు. పోతన్నగారే వ్రాశారు. అవి ఆయన సహజ పాండిత్యానికి నిదర్శనాలు, అనేవాళ్ళున్నారు. చూ: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి పోతన్నగారి సహజ పాండిత్యం అనే పుస్తకం- పుట. 48.
3. కొడవటిగంటి కుటుంబరావు, సాహిత్య ప్రయోజనం. పు. 28. ఇంకా మద్దుకూరి చంద్రశేఖరరావుగారి వ్యాసావళిలోని సాహిత్యం- రాయిస్టులు అన్న వ్యాసం కూడా చూడండి, ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి మొదలయిన పద్యాలన్నీ పోతన్న గారివేనన్న నమ్మకంతో ఆయనలో జమీందారీ తత్వానికి ఎదురు తిరిగిన రైతుకవి హృందామ చూడగలిగారు చంద్రంగారు. పుట. 88.

మన పూర్వాలోక విషయం, మనమొక విషయం గురించి ఆలోచిస్తే నిజంగా పోతన్నగారి కీర్తి సౌధానికి అది పునాది కానేకాదు సరే మరేమీకాదని కూడా తెలుస్తుంది.

పూర్వుల విషయం : ఏ పురుషుండైన నేమి? మహాత్ములయందు తితిక్షయు, సములయందు మైత్రియు, హీనులయందు కృపయు, నితరములగు సమస్త జంతువులయందు సమత్వంబును గలిగి వర్తించు వానియందు సర్వాత్మకుండైన భగవంతుండు ప్రసన్నుండగు"[1] అని భాగవతలక్షణమునూ, మహిమనూ చెప్పిన పోతన్న, మరియు "అచ్యుతు పరమునన౦తు గుణాతీతు పురుషోత్తముని నాదిపురుషుననఘు నర్థి భజియించువారు రాగాదిరహితు"[2] అని వక్కాణించిన పోతన ఊరక నిష్కారణంగా రాజులను అధములని తిడుతూ వ్రాయటం న్యాయమా! రాగద్వేష రహితుడైన పోతన్న అలా వ్రాయటానికి వీలుందా? అర్థ కామములందు అనాకాంక్షుడు భాగవతోత్తముడు అయిన పోతన్న, ఒకవేళ ఏరాజైనా పుస్తకాన్ని అంకితమీయుమని కోరినా బలవంతపెట్టినా కూడా అంతర్యామియైన ఈశ్వరుని జీవలక్షణ జ్ఞానం గలిగిన పోతన్న వాళ్ళయందు జాలిపడతాడేగానీ వట్టి అధములూ అని అనడు, అనుకోడు కూడా. ఇలా అనుకోకుండా వున్నాడనటం వల్ల పోతన్నగారి భాగవతోత్తమ లక్షణం ప్రశస్తికెక్కుతుందిగానీ, అధములని వాళ్ళను తిట్టాడంటే ఆయన తనకున్న దనుకొంటున్న సహజ పాండిత్యం లేదని మనమంటున్నట్లవుతుంది. కాదా మరి! శమీక మహాముని ఇలా అంటున్నాడు.[3]

పొడిచిన తిట్టిన కొట్టిన, పడుచుందురు కాని పరమ భాగవతులు తా
రొడబడరు మాఱు సేయగ, కొడుకా! విభుడెగ్గుసేయ గోరడు నీకున్.
అలుగరు కలగరు సాధులు మిళితములయి పరులవలన మేలుం గీడున్
వెలకొనివ నైనవాత్మకు నొలయవు సుఖదుఃఖచయము యుగ్మములగుచున్.

పోతన్నగారు పరమ భాగవతుడు. మరియు ఆయన తాను సాధునయ యుక్తుడనని గూడా చెప్పుకొన్నాడు[4] చెప్పుకొంటూ సాధుజనానురాగ సంధాయికి శేషశాయికి సమ

1. భాగవతం, 4. 356.
2. భాగవతం, 10. 1228.
3 భాగవతం ప్రథమస్కంధము– 449, 450.
4. ,, ,, 25, 30.

ర్పితంగా రచించిన భాగవత గ్రంథ విషయంలో పోతన్నగారు కర్తృత్వాన్ని అంతగా మీదవేసుకొని ఇమ్మనుజేశ్వరాధములని సమకాలికులయిన రాజులను దహారం మీద నిందిస్తూ[1] అపద్యం వ్రాసి వుండటం సమర్థనీయంగా వుంటుందా? సాధులక్షణమంటే యేమిటో చిత్రకేతువి కథగా భాగవతంలోనే వుంది. సమర్థతవుండి కూడా శాంతం వహించి పరులను సహించటంగా చెప్పబడింది.[2]

శృంగి రాజును చచ్చిపొయ్యేటట్లుగా శపించాడు. శమీకుడు తన కొడుకు శృంగి చేసిన పనికి సంతసింపక 'రాజును తిట్టదగునే'? అని వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకంగా మందలించాడు.[3] శృంగిపద్యాలూ పోతన్నగారే వ్రాశాడు. శమీకుని పద్యాలూ పోతన్నగారే వ్రాశాడు. పోతన్నగారి ఆంతర్యం శృంగిదా? శమికునిదా? కథా సందర్భంగా రచయితను ఏ ఒకపక్షానికీ లాగగూడదు నిజమేకానీ– అసలు కావ్యనీతి ఏమంటే రచయితకు పక్షాన్ని చెప్పదలచుకొంచే సిద్ధాంతపక్షాన్నే చెప్పాలిగానీ పూర్వ పక్షాన్ని చెప్పకూడదు. శమీకుని పరిణతబుద్ధి విచారం ముందు శృంగిచేసిన పని దుడుడుకు తసంగావుంది. అందువల్ల పోతన్నగారికి శమీకునితోనే తదాత్మ్యం. కాబట్టి రాజును తిట్టదగదు అని ఘోషిస్తున్న పోతనను పట్టుకొని ఆయనవి కాని పద్యాలను ఆయన కంటగట్టి రాజనిందా రాజద్వేషము లాయనయందు భాగవతము నాటికి పరిణతమై 'ఇమ్మనుజేశ్వరాధముల' యందు విశేషాకారముగా రూపొందినవని సిద్ధాంతీకరించుట భాగవతాపచారం తప్ప మరొకటి కాదు.

నిజంగా నరులకు కవులు కృతులను అంకితం చెయ్యకుండా వుండటం గొప్ప లక్షణమైతే ఆపనిచేసిన వాళ్ళను కీర్తించినట్లే, చెయ్యని వాళ్ళను నిందించాలి మనం నరాంకితం చేసినవాళ్ళ నింతకంటె ఎక్కువగానే మెచ్చుకొంటున్నాం.

మన విషయం: పోతన్న రాజులను తిట్టాడు నిజమే ఆధునిక వ్యవస్థకు వ్యతిరేకత వచ్చింది. మనతరం రాచరిక వ్యవస్థకు వ్యతిరేకం, మనం రాజులను తిట్టం. ఎవర్నీ తిట్టవలసిన అవసరం లేదు. నిజానికి పోతన్న రాచరిక వ్యవస్థకు వ్యతిరేకికాడు. కావటానికి వీలులేని కాలమిది. పైగా పోతన్నగారు భాగవతంలో వర్ణాశ్రమాచారాలను ప్రబోధించాడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణధర్మా

1. ధూళిపాళ శ్రీరామమూర్తి– శ్రీమద్భాగవతానుశీలనము, పుట: 48.
2. భాగవతం షష్ఠస్కంధం, 509
3. భాగవతం– ప్రథమస్కంధం, 441.

లను పునరుద్ఘాటిస్తూ పుస్తకం వ్రాసి ప్రజా పాలకులయిన క్షత్రియులను 'ఇమ్మనుజేశ్వరాధములు' అని పీఠికలో తిడతాడా? తిడితే ఎందుకు తిట్టివుండవచ్చు. బ్రాహ్మణులకు అణగి మణగి లేకపోతే ఆ లేనివాణ్ణి ఒక్కణ్ణే అనకుండా మూక ఉమ్మడిగా అందర్నీ అనటం కావచ్చు. "ధారుణీ దివిజులకంటె దైవ మొకడు కలడె భువిని." ఈమాట పోతన్న చెప్పినా ఆధునికు లంగీకరించరు. ఈ భావంతోనే గనుక ఆయన ఇమ్మనుజేశ్వరాధములు అని రాజులను తిడితే మనమదొక గొప్పలక్షణంగా కీర్తించం- రాచరిక వ్యవస్థకు పోతన్నగారి కాలం. ఆయన దృక్పథం, ఆయన తత్వం ఏదీ కూడా వ్యతిరేకం కాదు.

కనుక ఆ పద్యాన్ని పోతనగారిదని చెప్పి దానిమీద కథల్లి ఆయన కీర్తిని ఆ కథచే పెంచుతున్నా యనుకోవలసిన పనిలేదు. భాగవత రచనకు ముందుగానీ తరువాతగానీ అది పోతన వ్రాసింది కాదు. ఎవరో ఆయన భక్తుడు వ్రాసి వ్యాకరణానుక్రమం కూడా చూచుకోటానికి ఓపికలేని భక్తితొందరలో ఆ పద్యాన్ని సరిగ్గా సందర్భ శుద్ధిలేనిచోట భాగవతంలో ప్రవేశపెట్టాడు. ఆలాగే కొనసాగివస్తున్నది. ఒకవేళ అది పోతన పద్యమే అయినా చాటువు మాత్రమే అవుతుందిగానీ భాగవతంలోని పద్యం కాదు.

కలియుగ ధర్మలక్షణం చెప్పే మిషమీద పురాణ రచయితలంతా రాజుల అధర్మ ప్రవర్తనను బాహాటంగా వ్రాస్తారు. కలియుగపు రాజులంటే పురాణ రచయితల యుగపు రాజులు కారా? ఆ విధంగా పురాణ రచయితలు తమ ఆస్తిక బ్రాహ్మణ మత ధర్మాలను పాలకులు పాటించక పోవటాన్ని గమనించి, సూటిగా ఆ విషయాలను ఖండించలేక కలియుగ భవిష్యద్రాజ విషయమని భంగ్యంతరంగా వ్రాయనే వ్రాశారు. ఆపని పోతన్నగారు భాగవతంలో చేయనే చేశారు. పురాణ రచయితగా ఆయనకాపని చేయక తప్పదు. అసలు కలియే శూద్రరాజ లక్షణ లక్షితుడని పోతన్నగారికి తెలియదా?[1] శూద్రుడైనా రాజయిన తరువాత క్షత్రియుడనే గనుక ఆయనదృష్టి అయితే సర్వదేవమయుడైన క్షత్రియుణ్ణి[2] మనుజేశ్వరాధముడు అని అననే అనడు.

---

1. ప్రథమస్కంధం. 393.
2. సప్తమస్కంధం. 411.

దశమస్కంధం ఉత్తరభాగంలో రుక్మిణి శ్రీకృష్ణుణ్ణి స్తుతించే సందర్భముంది. అందులో ఆమె కృష్ణ భక్తులయిన రాజులను నరేంద్రమౌళి మణులనీ, రాజ ఋషులనీ ప్రశంసిస్తూ కానివారిని నృపాలకీటములనీ, మానవాధములనీ, నిందిస్తుంది.[1] అక్కడి పద్యాల్లో పోతన్నగారి అభిప్రాయాలను మనస్సులో పెట్టుకొని ఇమ్మనుజేశ్వరాధములన్న పద్యార్థాన్ని భావించినా విష్ణుభక్తులుకాని రాజులను మాత్రమే మనుజేశ్వరాధములని అన్నాడు కానీ దహరం మీద రాజుల నందరినీ ఆయన దూషించలేదని మాత్రమే అనుకోగలం. అలా అనుకొని సరిపెట్టుకోటానికైనా భాగవత అవతారికా భాగంలో ఇమ్మనుజేశ్వరాధములన్న ఆ పద్యం సందర్భంగానూ లేదు నిర్దుష్టంగానూ లేదు. అందువల్ల ఆ పద్యాన్ని పోతన్నగారు గాక ఆయనమీద భక్తిమాత్రమే గలవాడెవడో వ్రాసి అక్కడపెట్టి వుంటాడనే చెప్పక తప్పదు.

అయితే మరొక ఆలోచన చెయ్యవచ్చు. ఇమ్మనుజేశ్వరాధములు అని ఏ సమకాలికులను[2] దృష్టిలో పెట్టుకొని పోతన అంటున్నాడో వాళ్లెవరుగానీ క్షత్రియ వంశజులు కారు. గనుక— అలా రాజ్యాధికారానికి వచ్చిన ఇతర కులస్థులను ఆశ్రయించి వాళ్ళను సూర్యచంద్ర వంశస్థులుగా కీర్తించి ముఖ్యంగా భాగవతం లాంటి గ్రంథాన్ని వాళ్ళ కంకిత మియ్యటం ఇష్టంలేక అంకితం కోరిన రాజులను కాదని తిరస్కరించి భగవ దంకితం చేసినట్లూ, ఆ విషయాన్నే ఆ పద్యంలో చెప్పుకొన్నట్లూ చెప్పకూడదా? అని. ఇలా చేస్తూపోతే మన ఆలోచన లెప్పటికీతెగవు ఇంతకు పైదాని అర్థమేమని తేల్తుందంటే రెడ్లుగానీ, వెలమలుగానీ ప్రభువులై నరనాథ కులస్థులుగా పాలించటాన్ని పోతన్నగారు అంగీకరించటం లేదని ఆయన ఆంతర్యాన్ని ఆలా తేల్చటమూ ఆయన మహనీయ భాగవత ధార్మిక వ్యక్తిత్వం దృష్ట్యా మంచిదికాద ఎందుకంటే కలిలో శూద్రకులజులే ప్రభువులై పాలింతురని ఆయనకు తెలుసు.[3] ఆ యుగధర్మమని చెబుతూ దాన్ని తానేలా వ్యతిరేకిస్తాడు?

సైద్ధాంతికంగా పరమ భాగవత ధర్మపరుడే అయినా మనిషికదా కామక్రోధాలూ రాగద్వేషాలూ వుండవా అంటే ఆ వున్నవాటిని పోగొట్టుకోటానికే గదా సంసారు

---

1. దశమస్కంధం, ఉత్తరభాగం 253, 255— ఈ రెండు పద్యాలు— ఇలాంటి భాగవతంలోని మరికొన్ని పద్యాలు చదివిన వాడు ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి అన్న పద్యం కట్టవచ్చు.
2. విజయనగరం ప్రౌఢ దేవరాయలు, కొండవీడు కోమటి వేమారెడ్డి. రాచకొండ సర్వజ్ఞ సింగభూపాలుడు.
3. భాగవతం, ప్రథమస్కంధం. 393

లయినవారికి భక్తిమార్గము నుపదేశిస్తున్నది? దానివల్ల జ్ఞానమూ విరక్తీ ముక్తీ కలగాలి కదా? కలగటం లేదనటానికి పోతన్నగారినే నిదర్శనంగా చూపించటంవల్ల మనం ఏం చేస్తున్నట్లు! ద్రోహం చేస్తున్నట్లు కాదా?

ఆ పద్యార్థాన్ని కూడా విచారిద్దాం. ఈ నీచులయిన పాలకులకు కావ్యాల నంకిత మిచ్చి వాళ్ళందుకు ప్రతిఫలంగా ఇచ్చే అగ్రహారాలూ, బంగారు ఆభరణాలూ, చీని చీనాంబరాలు మొదలయినవి పుచ్చుకొని వాటిని అనుభవించి చచ్చిన తరువాత యమ లోకంలో బాధలుపడే దానికంటే తాను రచించిన భాగవతాన్ని శ్రీహరికిచ్చి ఆ బాధలు తప్పించుకోటం మంచిదని పోతన అపని చేశాడు- యమలోకంలో సమ్మెట ప్రేటులు ఎందుకు? కావ్యాన్ని ఇమ్మనుజేశ్వరాధముల కంకితమిచ్చినందుకా? లేక వారిచ్చిన పురములు- వాహనములు- సొమ్ములు అనుభవించి నందుకా? అయితే ఆలా కావ్యా లంకితాలిచ్చి వాళ్లిచ్చినవి పుచ్చుకొని అనుభవించటం యమలోకంలో శిక్ష అనుభవింప వలసినంత నేరమా? అదే నేరమైతే ఆ సమ్మెట ప్రేటుల శిక్షనుండి తప్పించుకొన్న తెలుగు కవులు పోతన్నగారు గాక మరెంతమంది వుంటారు?- తిక్కన్నగారు భారతాన్ని మనుమసిద్ధి నాలా పక్కనపెట్టి హరిహరనాధున కంకితమిచ్చాడు గానీ ఆయన్నుగానీ రాజులనుకానీ నీచపరిచి మాట్లాడలేదుకదా! ఈ విషయాలన్నీ పోతన్న గారికి తెలియవా? తెలిసే ఆ పద్యం వ్రాశాడని అనగలమా?

భాగవత రచనకు ముందుగానీ తరువాతగానీ ఆ పద్యాన్ని పోతన్నయే తన భాగవత అవతారికలో భాగంగా రచించి వుంటాడనుకోటం సహేతుకమూ కాదు- సలక్షణమూ కాదు. అసలది పోతన్నగారి పద్యం కాదు. ఆయనను ప్రశంసిస్తూ ఎవరో ఆయన భక్తుడు ఆయనకు సమకాలంలోనే వ్రాసినా వ్రాసి వుండవచ్చు పోతన్నగారి పద్యం కాకపోయినంత మాత్రం చేత ఆ పద్యం యొక్క అర్థమూ దాని విలువా ప్రభావమూ తగ్గిపోటం గానీ, పోతన్నగారి కీర్తిప్రతిష్ఠలకు దెబ్బ తగలటం గానీ జరుగదు.

ఇమ్మనుజేశ్వరాధములతోపాటు పోతన్నగారి రాజనిందా రాజద్వేషభావ తీవ్ర తకు దోహదకారులుగా కల్పింపబడిన మరి రెండు పద్యాలు కాటుక కంటి నీరొకటి, బాలరసాలసాల మరొకటి. ఈ రెండు పద్యాలు కూడా భాగవతం లోనివే అనీ, పోతన్నగారివే అనీ పరంపరగా నమ్ముకొంటూ రావటంచేత వేదాల తిరువెంగళా చార్యులంతటివారు ఆంధ్ర ధ్వన్యాలోకంలో (పుటలు 415, 425) ఆ పద్యాలనుండీ ప్రతీయమానము లయ్యే అర్థ విశేషాలను వివరించారు. అవి పోతన్నగారి వన్ని

నమ్మకము— ఆయన విషయంలో ప్రసిద్ధమైన రాజాంకిత వ్యతిరేక ప్రవృత్తి అన్నీ తోడైన ఆ సందర్భాన్ని పురస్కరించుకొని వ్యంగ్యార్థాలు భావింపబడ్డాయి. కాబట్టి కంటె నీరు అన్న పద్యంలో పోతన్నగారు గుర్తురావటానికి తగిన ఏ కించిత్తు ఆధారమూ లేదు. బాలరసాల సాల— పద్యానికి పద్యం కేయూర బాహుచరిత్ర లోది.[1]

ఆయా పద్యాలు మూడూ రాజనిందా రాజద్వేషాలను ప్రకటించేవే కానీ అవి పోతన్నగారివి కావు అయితే పోతన్నగారికి అధికారమూ డబ్బూవున్న వాళ్ల విషయంలో తిరస్కారభావం కాకపోయినా ఉదాసీన వైఖరి అయినా వుండి వుండవచ్చు. "ధనమదాంధుల కొలువేల తాపసులకు" (2-21) ఈ మొదలయిన అభిప్రాయాలు పోతన్నగారి సొంత విషయంలో కూడా వర్తిస్తాయంటే పెద్ద కాదనవలసిందేమీ కనిపించదు ఇంతమాత్రమైతే సరేకానీ, ఆయన రాజులను తిరస్కరించి తిరుగుబాటు చేసిన వీరుడని ఆయనవి కాని పద్యాలను పట్టుకొని ఢంకా బజాయించటం చాలా శోచనీయం.

పాలకులు అధర్మపక్షం అవలంబించటాన్ని ధైర్యంగా కవులూ రచయితలూ ఎదుర్కోటాన్ని అజ్ఞాత కవిరచిత అయిన ఇమ్మనుజేశ్వరాధముల నన్నపద్యం సమర్థిస్తున్నది. 'రాజదండనంబునకు భయంబులేక వడిబోయెడు ధీరు'లుగా నిలబడగల స్థైర్యాన్ని కవులకు సమకూర్చిన పద్యంగా దానివిలువ తరిగేదికాదు. 'ప్రభుదురాత్మునెవ్వడు ప్రస్తుతించు'నని స్వతంత్రంగా నిలబడిన సంకుసాల నృసింహ కవికీ,[1] 'రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయమన్న' ధూర్జటికీ,[2] 'హరిముకుందు గొనియాడు నాజిహ్వ నినుగొనియాడంగ నేర'దని సాళువ నరసింహరాయల వారి నుద్దేశించి పలికిన అన్నమయ్యకూ[3] నైతికమైన వెన్నుబలంగా ఆ పద్యం పనిచేస్తుంది. పోతన్నగారికీ భాగవతానికీ గల అవినాభావమైన వైశిష్ట్యాన్ని ప్రశంసాపూర్వకంగా ప్రకటించటానికి ఉద్దేశింపబడిన ఆ పద్యము యొక్క చారిత్రకమైన విలువను కర్త పోతన్నగారు కాకపోవటమే మరింత పెంచుతుంది. అది భాగవతంలో భాగం కాకపోవటమే అందువల్ల సముచితం. అది ప్రక్షిప్తమే.[4]

---

1. ఆంధ్ర— సమగ్రాంధ్ర సాహిత్యం. V. పు. 252. ఈ పద్యం వెంకటకవి పంచతంత్రం లోనిదని చిలుకూరి పాపయ్యశాస్త్రి శ్రీనాథుని కవితా సమీక్ష అను గ్రంథంలో వ్రాసినట్లు వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు వ్రాశాడు. పోతన. పు 82
2 కవి కర్ణరసాయనం. పీఠిక. 24.
3. శ్రీకాళహస్తీశ్వర శతకం,
4. అన్నమాచార్య చరిత్రము, పుట 32, 36. చూడు: రాళ్లపల్లి పీఠికలు, పు. 47.
5. నిడుదవోలు వెంకటరావు, పోతన— పుటలు 221. 222. ఇంకా 133. 128 పుటలు కూడా చూడండి.

## III. 8. పలికించెడు వాడు

రామభద్రుడు తన చేత భాగవతమును పలికిస్తున్నాడని చెబుతున్నాడు పోతన్న గారు. రామభద్రుడు కనిపించి చెప్పటానికి ముందు పోతన్న గారికి శ్రీమన్నారాయణ కథా ప్రపంచరచనా కుతూహలం బాగానే వుంది. ఆయన కనిపించి చెప్పిన తరువాత రచన విషయంలో తనకు ఉపపత్తిలేదని పోతన్నగారికి తెలిసింది.[1] తాను బద్ధుడైనా ముక్తుడైనా ముందు జీవుడుగదా! అంటే అంశభూతుడు. అంశ మెప్పుడును స్వతంత్రముగాదు. జీవుడు చేతనుడే అయినా అస్వతంత్రుడు కర్తృత్వాదికములను వదిలిపెట్టి అపరోక్ష జ్ఞానియైన ఈశ్వరుని లీలాపరికర మాత్రుడనేనని తెలిసి శరణాగతిని పొందుతాడు. పోతన్నగారు భాగవత రచన విషయంలో తాను కర్తగా కనిపిస్తున్నా, సృష్టిస్థితి లయాదికమైన జగద్రచనా వ్యాపార సామర్థ్యము విషయంలో పరమాత్మతో ఎంత సారూప్యస్థితిని పొందినా జీవుడు అంశమాత్రుడేన నన్న వివేకశీలం దృఢంగా నిలబడివున్న కారణంగా, అసలు కర్త ఎవరో అతనికి తానెంతమాత్రపు పరికరమో అట్లుపయోగపడటం చేత ఈశ్వరుడు తనకే ప్రయోజనాన్ని అనుగ్రహిస్తాడో చెబుతున్నాడు. జీవజగత్తులు రెండూ బ్రహ్మముయొక్క అంశములయినట్లుగా పోతన్న గారును- భాగవతమును వాసుదేవ పరబ్రహ్మము యొక్క ప్రకాశరూపాలే సమస్త సృష్టికిని నిమిత్తోపాదాన ఉభయకారణమైనందున పరబ్రహ్మముయొక్క అద్వితీయమ భవిస్తున్న పోతన్నగారు తాను పలుకుతున్న భాగవతమును తనలో అంతర్యామిగా వున్న రామభద్రుడు పలికిస్తున్నాడని చెప్పటం తన పారతంత్ర్యమును ప్రకటించటమన్నమాట.[2] ఈశ్వరుని స్వాతంత్ర్యమును కీర్తించటమన్నమాట. ఇదంతా ఉపాయాన్ని తెలుసుకోటం.

నామరూప విభాగయోగ్యంగా చిదచిద్వస్తు స్థూలశరీరములం దంతర్యామిగా భగవంతుడు ప్రవర్తించిన కార్యావస్థరూపమే మహాభాగవతం. కార్యావస్థకు కారణభూతుడుకూడా భగవంతుడే. అయితే కారణావస్థయందు నిర్దేశించుటకు, ఇంద్రియాల

---

1. బ్రహ్మసూత్ర భాష్యం. ద్వితీయాధ్యాయం. ద్వితీయపాదం. రచనానుపపత్త్యధికరణం, చూడండి.

2. స్వయత్న నివృత్తి పారతంత్ర్య ఫలమ్, స్వప్రయోజన నివృత్తి శేషత్వఫలమ్. శ్రీవచన భూషణం. 1-71.

చేత గ్రహించుటకు వీలుకాని దివ్యసూక్ష్మ లక్షణంగా వుంటాడు భగవంతుడు.[1] అలాంటి కారణావస్థగల భగవంతుణ్ణి చిత్రమునందు దర్శించి కర్తృత్వాన్ని ఆయన కప్పజెప్పాడు పోతన్నగారు. రామభద్రుడు భాగవతం విషయంలో తనకు "ఆనతి ఇచ్చి తిరోహితు" డైనాడని చెప్పటంలో పోతన్నగారి ఉద్దేశమేమిటి? భగవంతుడు స్వతంత్రుడు. బ్రహ్మాదులు ఆయనకు పరతంత్రులు. స్థిరచర రూపాలుగల చేతన కోటికి ఆయన సర్వవిధి నియంత. ఆయన కృపావలోకనానికి నోచుకొన్నవాళ్ళకు మోక్షం కరతలామలకం- నియంత గనుకనే మన్నామాంకితంగా భాగవతాన్ని తెనుగు చేయుమని చెప్పి ఏమంటావని అడుగకుండా తిరోహితుడైనాడు భగవంతుడు- ఇదంతా పోతన్నగారి ఉద్దేశమే. భాగవతంలోనే వ్రాశాడు.[2]

ఎంతగా కర్తృత్వం రామభద్రుని యందు పెట్టినా ఆయనను పలికించెడువాడు గానూ, తనను పలికేవాడుగానూ చెప్పక తప్పటం లేదు పోతన్నగారికి. ఎంత పారమార్థికమైనా వ్యావహారికం తప్పదు ఈ రెండింటినీ ఆలోచించినప్పుడు భగవంతుడు కారయిత. కారయితకుండే కర్తృత్వాన్ని సాన్నిధ్యసాధ్య కర్తృత్వమంటారు. పోతన గారు పరమ భాగవతుడు. సాధ్యసాధ్య కర్తృత్వాన్ని అంగీకరించడు, స్వీకరించడు. పలికించెడు వాడు రామభద్రు డన్నప్పుడు పరమేశ్వరుని యందు సాన్నిధ్యసాధ్య కర్తృత్వాన్ని చెప్పినట్లవుతున్నది. షష్ఠ్యంతాలకు ముందు వెనుకలుగా "నా చిత్తంబున పెన్నిధానంబుం బోని శ్రీరామచంద్రుని సన్నిధానంబు గల్పింపుకొని—" 'నేనాంధ్రంబున నొనర్పం బూనిన శ్రీమహాభాగవత పురాణంబు' అని వ్రాసిన వ్రాతలను కూడా సమన్వయ పరచుకొంటే సాన్నిధ్యసాధ్య కర్తృత్వమంటే ఏమిటో బోధ పడుతుంది.

---

1. అరవిందాక్ష భవత్స్వరూప మిల ప్రత్యక్షంబునం గాన నెవ్వరికిం బోలదు శాస్త్ర గోచరుడవై వర్తింతు- దశమస్కంధం, ఉ. భా. 1219, ఇదికారణావస్థ. కార్యావస్థలో నామరూప విభాగయోగ్యతతో శ్రీకృష్ణుడుగా భాగవతంలో అభిముఖులయిన మూర్ఖులకు కూడా 'మాంస నయనాంచల గోచరుడైనాడు గదా' ఉ. భా. 1048.

2. దశమస్కంధం: ఉ. భా. 1223.



## III. 9. భాగవతము తెలిసి పలుకుట

భాగవతమంటే భగవద్విషయం. అది తెలిసింది అని అనటానికి వీల్లేదు. ఆలాగని తెలియలేదని గానీ, అసలది తెలియదనిగానీ అనటానికి కూడా వీల్లేదు. తెలుసుకోటానికి మార్గాలూ అవకాశాలూ లేకపోవచ్చు ఈవాళ. అవి ఏర్పడితే తెలియబడని విషయమంటూ ఏమీవుండదు. లోకాన్ని చూస్తుంటే జీవిస్తుంటే తెలియని విషయాలేవేవో తెలుస్తున్నట్లే వున్నాయి. ఆ తెలిసీ తెలియనట్లున్న బృహత్పదార్థాన్ని గురించిన ఊహాపోహల విజ్ఞానానుభవ విషయమంతా భగవద్విషయమని ప్రాచీనులనుకొన్నారు తర్జనభర్జనలు చేశారు. అది సవిశేషమని కొందరు నిర్విశేషమని కొందరు చెప్పారు. సవిశేషమని చెప్పినవారి పక్షం నుండి బయలుదేరిన సిద్ధాంత తాత్పర్య ప్రదర్శక లక్షణ గ్రంథం భాగవతం.

పోతన్నగారు అద్వైతియా విశిష్టాద్వైతియా అని చర్చిస్తుంటారు. ఏదో తేలలేదు. ఎందుకు తేలలేదు? భగవద్విషయం సగుణమో నిర్గుణమో తేలింది గనుకనా? తేలని విషయాన్ని తేలినట్లూ అది తనకేమో తెలిసినట్లూ తెలివిగలవాడెవడైనా చెబుతాడా? ఎవడైనా ఒకడు తెలుసును అని చెప్పటానికి మొదలుపెడితే అదేదో చిత్రమనిపిస్తుంది తేలదుగదా అని తెలిసిన వాళ్ళకు. వాళ్ళెవరయ్యా అంటే ఒకడు శూలి, మరొకడు తమ్మిచూలి వీళ్ళిద్దరూ ఎవరంటే— నిర్గుణం కాక స్వయంప్రకాశమైన బృహత్పదార్థం గుణమయత్వం చేత జగజ్జనన వృద్ధి విలయములకు క్రమంగా హేతురూపములనూ, బ్రహ్మ విష్ణు రుద్రనామములనూ పొందిన జగత్కారణ భూత మూర్తిత్రయంలో విష్ణువుకాక మిగిలిన ఇద్దరూ. మరి విష్ణువు మాటేమిటి? ఆయనే అద్వితీయ పరబ్రహ్మము. భగవద్విషయమంటే బ్రహ్మము విషయమే. అద్వితీయ బ్రహ్మమునకు వాళ్ళిద్దరూ కింకరాదులవంటి వాళ్లు. అందువల్ల భగవద్విషయాన్ని అద్వితీయమని తెలుసుకోటం తెలుసుకోటమా? భిన్నరూపమని తెలుసుకోటం తెలుసుకోటమా? రెండుగాను కాగలిగిన దాన్ని ఒకటిగా తెలుసుకోట మేలాగా? ఒకటిగానే భగవద్విషయాన్ని తెలుసుకొన్నాను— అది నిర్గుణం— అది సగుణం అని అటో ఇటో మొగ్గి పలకటం చూస్తే చాలాచిత్రంగా వుంటుంది సుమా! అని తనతీర్పును పోతన్న ఆశ్చర్యరూపంగా వెలిబుచ్చుతున్నాడు. 'అద్వితీయ బ్రహ్మం తోటివారైన బ్రహ్మరుద్రులకే భగవద్విషయం ఫలానా అని చెప్పగలగటం అసంభవం. ఈ విషయం భాగవతంలో రకరకాలుగా చెప్పబడుతుంటుంది.[1] అయితే భగవద్విషయం ప్రతిపాద్య

1. హరచతురాస్యులెన్నెఱుగనట్టి నినుం గనుగొంటి— దశమస్కంధం, ఉ.భా. *119*

వస్తువు కాదా? అంటే ప్రతిపాద్య వస్తువే. ప్రతిపాదింప బడుతున్నది అద్వితీయ పరబ్రహ్మము యొక్క విశేష నామరూపాత్మకమైన భూతజాలము యొక్క సంచలనమేగాని అసలు వస్తువుకాదు. కథనంగానీ వర్ణనంగానీ వస్తుచిత్ర ప్రదర్శనంగా వుంటుందిగానీ వస్తు ప్రదర్శనంగా వుండదు. అసలు వస్తువైన ఆత్మతత్వం మనకు సుగమం కావటానికే రామకృష్ణాది దివ్యావతారాలు భజిస్తుంది. అందువల్ల ఆవిధంగా భగవద్విషయమైన భాగవతం కాస్త తెలిసినా పలుకవలసి వచ్చేటప్పటికి బ్రహ్మరుద్రాదులకైనా చిత్రప్రదర్శనం లాగా చేయవలసిందే కాని వస్తుప్రదర్శనం చేయటానికి వీలుకాదు. మరొకటి కూడా వుంది. విషయాన్ని చెప్పవలసి వచ్చేటప్పటికి ఒక పద్ధతినీ తర్కాన్నీ అనుసరించాలి. తర్కం బుద్ధిశక్తి. న్యాయవైశేషిక సాంఖ్య వాదాలూ బౌద్ధమూ మొదలయిన మతాలన్నీ తమతమ తర్కవాదలను సమర్థించుకొంటూ కూర్చుంటాయికానీ ఆత్మతత్వాన్ని తెలుసుకోలేవు చెప్పలేవు.[1] ఆత్మతత్వం ఒక్క యోగీంద్రులకు మాత్రమే— భక్తియోగానుష్ఠాన పరులకు మాత్రమే భగవద్వస్తువు అనుభవరూపంగా తెలుస్తుంది. చెప్పగలిగితే అలాంటి వాళ్లెవైనా చెప్పాలి. వాళ్ళకు తెలుస్తుంది. సచరాచర వస్తుజాతమునకు భగవద్వస్తువు అంతర్యామిగా వుంటుందని. అది తెలియని విపరీత బుద్ధులకు భగవత్తత్వము నిజం తెలియదు[2] అందువల్ల భాగవతం తెలిసి పలుకుట చిత్రం.

భగవద్విషయంలో ఇంకా చిక్కులున్నాయి భగవంతుడు వేదస్వరూపుడంటారు వేదం అతీంద్రియ విషయాలయిన ధర్మ బ్రహ్మస్వరూప స్వభావబోధకం. పురుషార్థాలలో అర్థకామాలు జీవులకు జీవితమే అనుభవ రూపంగా సాధించి పెడుతుం. ధర్మమోక్షాలు జీవుల కతీంద్రియ విషయాలు. వాటిని వేదం చెబుతుంది. భగవంతుడు వేదస్వరూపుడు గనుక భగవంతుణ్ణి ఆశ్రయించి ఆరాధిస్తే మనకు ధర్మ బ్రహ్మముల సంగతి తెలుస్తుంది. అందువల్ల భగవంతుడైన వాసుదేవ బ్రహ్మమును గూర్చిన భాగవతం వేదరూపం. వేదమప్రమేయం. భగవంతుడు అప్రమేయుడు. వేదస్వరూపమైన భాగవతం తెలియాలంటే ప్రమేయాలయిన మీమాంసాది న్యాయ విషయాలెన్నో తెలియాలి.[3] ముందుగా వాటన్నిటినీ తెలిసికొనికానీ భాగవతం

---

1. జగదధి నాథుడైన హరిసంతత లీలల నామరూపముల్
దగిలి మనోవచో గతుల తార్కిక చాతురి యెంతగల్గినన్
మగిలి కుతర్కవాది తగమేరలు సేసి యెఱుంగ నేర్చునే—
ప్రథమస్కంధం, 33.

2. దశమస్కంధం: ఉ. భా. 1220.

3. హరిసోదరులు, భారతీనిరుక్తి. 28.

గురించి పలుకుట సాధ్యం కాదు. వేదాంగములయిన పరిమేయ గ్రంథ విజ్ఞానంవల్ల కానీ వేదం అర్థంకానట్లే భాగవతతత్వం తెలియాలన్నా ఎన్నో విషయాలు తెలియాలి. ఇన్ని తెలిసి ఎక్కడికక్కడ విరోధాలను పరిష్కరించుకొంటూ భగవద్భాగవత విషయాన్ని చెప్పగలగటం నిజంగా ఆశ్చర్యపడవలసిన సంగతే.

## III. 10. విన్నంత – కన్నంత – తెలియ వచ్చినంత

భాగవతం సంగతి పోతన్నగారు విబుధజనుల వలన విన్నాడట. ఈ విబుధజనులు ఆయనకంటె వయస్సులోనూ అనుభవంలోనూ పెద్దవాళ్ళు అయితే సమవయస్కులూ అయివుంటారు అంటే ఒకవిధంగా భాగవత పరిచార ప్రబోధాలు పోతన్నగారి కాలంలో జనంలో జరుగుతున్నట్లే ఆయన తాను భాగవత విషయాన్ని వినటమేకాదు కనటంకూడా చేశానంటున్నాడు, అంటే తనచిత్తమునకు నెంతగానబడె నంత[1] అన్నమాట. భాగవత విషయాన్ని కనటం–చూడటం–అంటే ఏమిటి? కన్నాడవు పెక్కులయిన గ్రంథార్థంబుల్–[2] చదవటమన్నమాట. గ్రంథార్థాల లోతులు చూచివుండటం. ఈ లోతులు ఏలా తెలుస్తాయి? గురువులు ప్రియశిష్యులకుం బరమ రహస్యములు తెలియ బలుకుదురు–[3] గదా! అవిధంగా తెలుస్తాయి. విబుధజనుల వలన అనగా విష్ణుభక్తిగల గురువుల వలన అని అర్థం.[4] వాళ్లదగ్గరే చదువవలసినవన్నీ చదివాడు. వినదగినవన్నీ విన్నాడు. ఆపైన ఆయనకు తెలియవచ్చినంత అంటే చిత్తమునకు నెంతగానబడె నంత– ఓటపడుతునవగా మీకు తప్పక చెప్పెదననుట.

మరొకటికూడా వుంది. భాగవతం ప్రధానంగా మోక్షశాస్త్రం గనుక బ్రహ్మజ్ఞానరూప ఫలము లక్ష్యంగానే ప్రవర్తిస్తుంది. ఆ లక్ష్యసాధనకు ప్రధాన సాధనంగా భాగవతం భక్తిని ప్రతిపాదిస్తున్నది. అంటే భాగవతంలో భక్తి శేషిత్వస్థానంలో వుంది. వేదాంతులు చెప్పే బ్రహ్మమే భాగవతంలో భగవంతుడైన వాసుదేవుడు.

1. ప్రథమస్కంధం. 415.
2. ,, ,, 6.
3. ,, ,, 5.
4. సప్తమస్కంధం. 170, మరియు చూడు: అష్టమస్కంధం. 83.

పోతన్నగారు వాసుదేవ భగవత్తత్వాన్ని తాను గ్రహించిన సంప్రదాయ విద్యాపద్ధతిని చెబుతున్నాడు– విన్నంతయనీ– కన్నంతయనీ– తెలియ వచ్చినంతయనీ. బ్రహ్మ జ్ఞాన ఫలప్రాప్తికి సాక్షాత్సాధనం శ్రవణం. శ్రవణమంటే ఊరక చెప్పింది వినటం కాదు– ప్రమాణ విచారరూప జిజ్ఞాసా కార్యక్రమంలో గురుశిష్యులు కలిసి పాల్గొనటం. అప్పుడే ఉపయోగముంటుంది. అందుకే ఆఖ్యాతకు తోడవర్ణకం. బ్రహ్మ జ్ఞాన ఫలప్రాప్తికి శ్రవణం అంగి. బ్రహ్మజ్ఞాన రూపఫల సముత్పత్తి విషయంలో శ్రవణానికి అంగాలుగా పనిచేసేవి మనననిధి ధ్యాసనాలు. "ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః"– ఈ విధి విధానాన్ని తూచా తప్పకుండా అనుష్ఠించిన విషయాన్ని చెప్పటమే పోతన్నగారి తాత్పర్యం.[1]

తెలియవచ్చినంత తేటపరతుననగా ఇప్పటికి తెలిసినంతవరకు అని, ఇదంతా ఎలా తెలిసిందంటే శ్రవణమననాదులవల్ల తెలిసిందనే గదా। అంతకు మునుపు ఈ తెలియలేదు. నవిజానామియదివేద మస్మినిణ్యః సన్నద్ధో మనసాచరామి యదామాగన్ ప్రథమజాఋతస్యా దిద్వాచో అశ్నువే భాగమస్యాః[2] అని ఒక వేదమంత్ర ముంది. మనస్సుచేత గట్టిగా బంధింపబడి సంచరించేవాళ్ళకు ఈ విశ్వమంతా తామే అయివున్న సంగతి తెలియదు. తెలియటమంటే అపరోక్షానుభవంగా తెలియటమే. ఈ అపరోక్షానుభవం గూడా శ్రవణమననాది శాస్త్రానుష్ఠాన సమధిగమ్యమేగానీ వట్టి పురుష బుద్ధి సామర్థ్యం కాదు. శ్రవణమననాదుల వలన బ్రహ్మ విషయకమైన అపరోక్షానుభవము– చిత్త ప్రత్యక్ప్రవణ జనితానుభవం– యొక్క స్థాయిని బట్టి తెలియటం యొక్క స్థాయి వుంటుంది. వేదశాస్త్ర ప్రతిపాదితమైన భాగవత విషయాన్ని అతీంద్రియమైనదాన్ని పురుషబుద్ధిచేత తెలుసుకోటం అసంభవం. ఆస్థాయిలో భాగవతము తెలిసి పలుకుట చిత్రం. శ్రవణమననాదులవల్ల అంతర్ముఖమైన చిత్తమున కెంత కానబడెనో అనగా అపరోక్షానుభవముగా ఎంత తెలిసెనో ఆ తెలియవచ్చిన దాన్నంతా చెప్పుకొంటూ పోతానంటున్నాడు పోతన్న. భగవద్విషయమై తాను చేసిన శ్రవణ మననాలను పోతన్నగారలా విన్నంతయనీ కన్నంతయనీ చెప్పుకొన్నాడు; ఇక భాగవత రచన అంతా నిధిధ్యాసన క్రియాకలాపం శ్రవణమననాలచేత ఎంత తెలియ వచ్చిందో ఆ తెలియవచ్చిన భగవద్విషయాన్నంతా భాగవత మహాపురాణంగా

1. చూడు: ఎఱ్ఱన్నగారి నృసింహ పురాణం, 1–24.
2. బంకుమల్లె మల్లయ్యశాస్త్రిగారి ఆంధ్రవేదములు– ఋగ్వేదము, ప్రథమ సంపుటం పుట : 470.

తెలుగులో ప్రవహింప చేశాడు. అపరోక్షానుభవమువల్ల తాను భాగవతుడు కావటమే భాగవత రచనకు సజాతీయ వృత్తి. ఆవిధమైన సజాతీయవృత్తి విశేషము పోతన్న గారియం దత్యంతంగా వుండటం వల్లనే ఆయన తరువాత ఆయనలాగా భాగవతాన్ని వ్రాయటానికి మరొకరికి సాధ్యం కాలేదు. అంటే పోతన్నగారికివలె ఆ విషయం మరొకరికి తెలియరాలేదన్న మాట.

అయితే పోతన్న గారికంటె ముందునుండి ఆయన కాలంలో కూడా ప్రచార ప్రబోధాల్లో వున్న భగవద్విషయ గ్రంథాలు దక్షిణాదిన నాథమునులు సంపాదించిన నాలాయిర దివ్యప్రబంధము, శ్రీమద్రామానుజుల మతతాత్త్విక వ్యవస్థా నిర్ణయ సిద్ధాంత గ్రంథాలూ, ఆయన తరువాత వచ్చిన లోకాచార్యులవారి, వేదాంత దేశికుల వారి తెంగళ, వడగళ వైష్ణవశాఖాభేద విజ్ఞాన గ్రంథాలూ అయివుండాలి. అయితే ఆళ్వారు స్వాముల దివ్యప్రబంధాలన్నీ తమిళంలో వున్నాయి. ఆ ప్రబంధాలనిండా భగవద్విషయమే. భగవంతుడైన శ్రీకృష్ణుని లీలావిశేష సంకీర్తనమూ– కృష్ణ భక్తి– భగవద్గుణస్తుతీ– భగవద్విరహము– ప్రేమా– ఈ మొదలయిన భాగవత విషయాలన్నీ ఆళ్వారుల ప్రబంధాల్లో వున్నాయి. పోతన్నగారికా దివ్య ప్రబంధాలతో సంబంధమున్నదని చెప్పటానికి వీలులేదు. ఇకపోతే శ్రీమద్రామానుజుల రచనలతో పరిచయముండి వుండటానికి అవకాశమున్నది. వేదాంత దేశికులవారి గ్రంథాలతోనూ పరిచయముండి వుంటుంది– ఆళ్వారుల గ్రంథాలు తమిళంలో వుండటంచేత పోతన్న గారి కవి పరిచయములై వుంటాయని చెప్పలేక పోతున్నాంగానీ– భాషారచన విషయం చూస్తే[1] పోతన్నగారా పద్ధతిని పట్టుకొన్నారా యేమనిపిస్తుంది.

పదిహేనవ శతాబ్దంలో తెలంగాణంలో వున్న తెలుగు కవికి పదునాల్గవ శతాబ్దానికల్లా ప్రసిద్ధికెక్కిన మహారాష్ట్రంలోని భక్తిజ్ఞానోద్యమ సాహిత్య పరిచయం తప్పనిసరిగా వుండి వుంటుంది. వుండే అవకాశాలున్నాయి. పండరిపురం పాండురంగ విఠల దేవుడు ఇటునుండి తెలుగులను, అటునుండి కర్ణాటకులనూ కూడా

---

1 ఆళ్వారుల భాషలో ప్రత్యేకముగా ఒక వైలక్షణ్యమున్నది. అది– చిత్రాత్మకత. కావ్యములలో అధికముగా శబ్ద చిత్రము లుపయోగింప బడుటచే. వారి భాషకు ఒక అపూర్వమైన శక్తియేర్పడెను. ఈ శబ్దచిత్ర నిర్మాణములో అన్నిటికంటెను అనుకరణాత్మక శబ్దములకు మిక్కిలి ప్రాముఖ్య మున్నది– ధనకుధరం వరదాచార్యులు– ఆళ్వారులు– దివ్యప్రబంధములు (1970) పుట: 234. "ఆళ్వారుల యుగమునందే సంస్కృతశబ్దములు తమిళభాషలో మిశ్రితములైనవి. పుట: 222.

మిక్కిలిగా ఆకర్షించటం మొదలయిన కాలమిది. దక్షిణ భారత భక్తి ఉద్యమంలో గొప్పపాత్రి నిర్వహించిన ప్రధాన దేవుళ్లలో పాండురంగ దేవుడొకడు. దేశభాషా భక్తిజ్ఞాన సాహిత్య నిర్మాతలయిన బ్రాహ్మణేతర భక్తకవులు కూడా అధికసంఖ్యలో రావటానికి పాండురంగ భక్తి ఉద్యమ మెంతగానో దోహదం చేసింది. మహారాష్ట్రి దేశభాషా సాహిత్యాలతో పోతన్నగారికి పరిచయముండి వుంటుంది. వైష్ణవభక్తిమత మే మతంగా అప్పటినుండి ఇప్పటిదాకా కూడా నడుస్తున్న దగ్గర్లో పక్కనేవున్న మహారాష్ట్రి ప్రభావం పోతన్నగారి కాలానికి తెలుగు దేశం మీద అధికంగానే వుండి వుంటుంది. మహారాష్ట్రి భక్తిజ్ఞాన ఉద్యమ సాహిత్య నిర్మాతలయిన జ్ఞానేశ్వర నామదేవులు పోతన్నగారికి సరిగ్గా వందసంవత్సరాల ముందటివాళ్లు వాళ్ళిద్దరూ ఆ భాషలో నిర్వహించిన పాత్రను పోతన్నగా రొక్కరూ తెలుగులో నిర్వహించారు. అనుష్ఠాన మతాచారపరుడూ, భక్తిజ్ఞాన తాత్త్విక విషయ ఆలోచకుడూ, కవితాశక్తి సంపన్నుడూ అయిన జ్ఞానేశ్వరుడు తన గీతా వ్యాఖ్యానాన్ని మహారాష్ట్రిభాషలో ఎంత అనుపమాన మైన మతతాత్త్విక సాహిత్య సౌష్ఠవంగల గ్రంథంగా నిర్మించాడో సరిగ్గా అటువంటి అన్నిలక్షణాలూ కలిగిన పోతన్న, అటువంటి గ్రంథంగానే మహాభాగవతాన్ని తెలుగులో వ్రాశాడు. ఈ విషయాన్ని తులనాత్మకంగానూ చారిత్రకంగానూ చూడటంవల్ల మరింత తెలుసుకోవచ్చు- విన్నంత అంటే ఏమిటో కన్నంత అంటే ఏమిటో అప్పుడు బాగా అర్థమవుతుంది.

## III. 11. కొందఱికి తెనుగు గుణమగు

సర్వసామాన్యమైన తెనుగుభాష నుపయోగించి చేసే కావ్యరచన ఉభయతర సంస్కృత గద్య పద్యోక్తులకంటె సరసంగా వుంటుందన్న ఒక సిద్ధాంతాన్ని పాల్కురికి సోమనాథుడు తన వీరశైవమత ఉద్యమానికి నినాదంగా[1] చేసుకొన్నాడు. ఆ నినాద ప్రభావానికిలోనై తెనుగు సాహిత్యభాష కొద్దిగానైనా తనపద్ధతిని మార్చుకో వలసి వచ్చింది. పాల్కురికి సోమనాథుడు- తెలుగుమాట లనంగ వలదు- వేదముల కొలదియకా చూడుడిల- అని అనటం ఆళ్వారుల దివ్యప్రబంధాలకు తమిళ వేద ప్రతిపత్తి రావటాన్ని ఆదర్శంగా పెట్టుకొని అన్నాడనవచ్చు. ఆ విధంగా వీర శైవ వాఙ్మయం తెలుగుభాషలో ఎక్కువ గుణాన్ని చూచింది. నిజానికి ఆచరణలో సోమనాథుడు సంస్కృత వేదమంత్రాలను యథాతథంగా ద్విపదల్లో ఎగలాగి దిగలాగి

1. జాను తెనుగు విశేషము ప్రసన్నతకు, పండితారాధ్య చరిత్ర- దీక్షాప్రకరణం.

కుదించటానికి చూచినా సిద్ధాంతరీత్యా ఆయన తన ఉద్యమంలో తెలుగుభాషా వినియో గాన్ని అధికం చేసి దాని గౌరవ మర్యాదలను పెంచటం లక్ష్యంగా గలిగినవాడు. అది కారణంగా తెలుగు భాష పక్షాన నిలబడే విద్వాంసులు పోతన్నగారి కాలానికి గుర్తింప బడగలిగిన స్థితికివచ్చి వున్నారన్న మాట. అందుకే తెనుగుభాషా రచనలో గుణం చూచే ఆ కొందరిని పేర్కొన్నాడు పోతన్న. సంస్కృతం గుణమైన వారె వ్వరెనుండో వున్నారు. వాళ్ళెటూ వుంటారు. పోతన్నగారు కొత్తగా వచ్చిన సమ కాలికులయిన తెలుగు భాషాభిమానం గల వర్తమాన కవులకు వారి తెలుగు గుణాన్ని ప్రశంసిస్తూ ప్రియముపలికి— తన రచనావిధానం వాళ్ళ అభిప్రాయాన్నికూడా అనుస రిస్తుంది అని చెబుతున్నాడు. అయితే అంతా పూర్తిగా గుణవంతమే గదా అని తెనుగును నింపటానికి ఆయన ఒప్పుకోడు. అలాగని పాతదైన సంస్కృత భూయిష్ఠ మైన రచనా విధానమే వుండాలనీ అనడు. క్రొత్తగా వచ్చిన తెనుగు అభిమానంలో గుణమున్నది దాన్ని తగినట్లుగా వాడుకోవాలి. తన రచనలో తానావిధంగా దాన్ని వాడుకో దలచుకొన్నాడు. ఏలా వాడినాడనేది భాగవతం చదివితే తెలుస్తుంది. చెప్పిన పని చేయకుండా మాత్రం లేడు పోతన. ఆ విషయంలో ఆయనను 'చుట్టనవ్రేల నెవ్వరికి చూపగా వచ్చును' (3-31) మాట అంటే మాటే 'తిరుగన్నేరదు వాని జిహ్వ' (8-593)— పోతన్నగారు భాగవతంలో తెలుగు భాష నుపయోగించటంలో. నిత్యజీవిత వ్యవహారంలోని నుడికారాలనూ పదబంధాలనూ ఎన్నికచేసి ప్రయోగించ టంలో, శ్రద్ధచూపాడు. ఆ విషయంలో మనం చప్పుడు చేయటానికి వీలులేదు.[1] చేయవలసింది భాగవత భాషా పరిశీలనమే.

1. షష్ఠస్కంధం, 264.

## III. 12. కర్షక కవి - సంవాద రచనలు

"కావ్యార్థము లనంతము లయినను, నవీనములైనను బుద్ధిమంతులలో పరస్ప రము సంవాద ముండియే తీరును. సంవాద మననేమి? సాదృశ్యమే కదా! బుద్ధి మంతులలో నొకరి బుద్ధితోడి సాదృశ్య మింకొకరి బుద్ధియందు స్ఫురించుట కబ్బుర మేమున్నది?— ఈ సంవాదము ఇతరుని యందు గౌరవముచేగానీ, తరచుగా నతని గ్రంథములు చదువుటవలనగానీ ఏర్పడుచుండును. ఇవియేకాక సంవాదమున కింకను కారణాంతరము లుండును. మహాకవులు తరచుగా మొదటి రెండుకారణముల నవలను

సంవాదము నొనర్తురు–" సంవాద రచనల గురించి ధ్వన్యాలోక కర్త అభిప్రాయ మిది. మరికొన్ని కారణాంతరా లుండవచ్చునని కూడా అంటున్నాడు. ఎప్పుడూ ముందువాణ్ణి చూచేకదా వెనుకవాడు వ్రాస్తాడు. ఉభయులూ శక్తిసామర్థ్యాలున్న మహాకవులయితే కారణాంతరా లుండవు తరువాతి వాడు అశక్తుడైతే పూర్వ మహాకవుల రచనలను యేకొద్దిపాటి మార్పులతోనో సొంతం జేసుకొని ఆయనంత బుద్ధిమంతుణ్ణే నేనుకూడా గనుక ఆయన చేసినలాంటి రచననే నేనూ చేయగలిగాను అని దబాయించటానికి సంవాద రచనలో వీలున్నది. ఆ విషయాన్ని హెచ్చరించటానికే ఆచార్యులవారు కారణాంతర స్మరణ చేశారు.[1]

పోతనగారి పద్యాలను అనుసరించి సంవాద రచనలుగా కాసుల పురుషోత్తమ కవి మొదలయిన వాళ్లెందరు వ్రాసినా అది పోతన్నగారికి గౌరవమే. పోతన్నగారు తన పూర్వులయిన తెలుగు కవులలో ఎవరెవరి రచనల ననుసరించి సంవాద రచనలు చేశాడన్నది విచారించటంలో కూడా ఆయన మహాకవి గనుక ఆయన గౌరవానికి వచ్చే భంగమేమీ లేదు.

1. తరుణుడగు శీత కరునిన్
మరగి వియల్లక్ష్మి తన్నుమాని ముదుకడున్
ఖరకరుడు ననుచు ద్రొబ్బిన
కరణిన్ రవిపశ్చిమాద్రి కడ గ్రుంకె నృపా.

( పూ. భా. 1288 )

కంసుడు పంపగా అక్రూరుడు బృందావనానికి పోయి రామకృష్ణులను మధురానగరానికి తీసుకొని వచ్చాడు. ఆరోజు మధురలో సూర్యాస్తమయ మైనదని ప్రకృతిని వర్ణించి చెప్పే పద్యాలలో ఈ కందము రెండవది. ఈ పద్యం ఏమాత్రం మార్పు లేకుండా చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమ సేనంలోవుంది. విక్రమసేనం గ్రంథం పూర్తిగా దొరకలేదు. అందులో యాభై యేడు పద్యాలు మాత్రమే దొరికాయి. ఇది పై నాలుగో పద్యంగా ఈ కందాన్నెచ్చి ఈ వర్ణన కథలోని వ్యంగ్యాన్ని సూచిస్తున్నదేమో మనకు తెలియదు[2] అని ఆరుద్ర వ్రాశాడు. అమరేశ్వరుడు శ్రీనాథునికంటె కచ్చితంగా పూర్వుడు అంటే పోతన్నగారి కంటె పూర్వుడని సిద్ధించినట్లే. మరి ఈ పద్యమేమంత గొప్పగా వున్నదని పోతన్నగారు ఎత్తి వ్రాసుకొన్నారో అర్థంకాదు. మరొక అనుమానానికి కూడా ఆస్కారమున్నది. పెదపాటి జగ్గన్నగారి సంకలన

1. వేదాల తిరువెంగళాచార్యులు– ఆంధ్ర ధ్వన్యాలోకం, పు: 701.
2. సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటం: 3. పుట. 115.

గ్రంథం[1] లోగదా ఈ పద్యం విక్రమసేనం లోనిదిగా ఉన్నది భాగవతంలోని పద్యాన్నే విక్రమసేనం లోనిదని జగ్గన్నగానీ, అంతకుముందు వాళ్లుగానీ పొరపాటు పడివుండవచ్చు. పడివుండరని నమ్మకమేమున్నది. అది సూర్యాస్తమయ వర్ణన పద్యం. అలాంటి దాన్ని ఏ గ్రంథంలో నుండి తీసి ఏగ్రంథంలో పెట్టినా పెద్ద ఇబ్బంది వుండదు భాగవతంలోని మరొక పద్యం గూడా విక్రమసేనం లోనిదిగానే వున్నది.

భూమినిండి మింట పూర్ణమై కర్కట
మకర మీనరాశి మహితమైన
హరియశస్సుధాబ్ధి యందలి తుంపురు
లనగ జుక్క లొప్పె నాకసమున.

(దశమస్కంధం– పూ భా. 1291)

ఇదికూడా ఇంతకు ముందటి పద్యం తరువాత సూర్యాస్తమయ వర్ణనలోనిదే. ఈ పద్యం విక్రమసేనంలో 53వ పద్యంగా వున్నది. అంటే వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంపాదించిన గ్రంథంలో[2] నన్నమాట.

ఈ పైరెండు పద్యాలే కాకుండా 'విటసేనపై దండు వెడలెడు వలతేని' అనే భాగవతంలోని పద్యం[3] ప్రబంధ రత్నావళిలో వుంది.

ధన్యవిభూతి శోభితుడు తామరసేక్షణు డొ త్తెనూర్జిత
ధ్వన్యతులోగ్రతా దళిత దానవసైన్యము భూతమాత చై
తన్యము తోషితేంద్రముఖ దైవత సంస్తుతి మాన్యమున్నదీ
జాన్యుదరాంతర స్థగిత సన్నుత జన్యము పాంచజన్యముఁ.

ఈ పద్యం కూడా ప్రబంధరత్నావళిలో (పు. 54) వుంది. ఇదికూడా భాగవతం దశమస్కంధంలో 1276వ పద్యంగా వున్నదని నిడుదవోలు వెంకటరావుగారు వ్రాశారు[4] పూర్వోత్తర భాగాలు రెంటింటిలో గూడా ఆ సంఖ్యతో ఆ పద్యం భాగవతంలో కనిపించటం లేదు. పూర్వభాగంలో 'అన్యులు తల్లడిల్ల దనుజాంతకుడొత్తె-చైతన్యము- మాన్యము- జన్యము- సైన్యము- పాంచజన్యము' (1538) అనేది పై పద్యంతో సంవదించేది ఒకటి కనిపిస్తున్నది. ధన్యవిభూతి శోభితుడనే పద్యం భాగవతంలోనే మరెక్కడైనా వున్నదేమో వెతకటం కూడా మంచిదే.

---

1 ప్రబంధ రత్నాకరం.
2. ప్రబంధ రత్నావళి, (1976) పు. 6, 11.
3. దశమస్కంధం, పూర్వభాగం- 965.
4. ప్రబంధ రత్నావళి, పీఠిక– పుట, 54.

1. బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్— అనే పద్యం పోతన్నగారిది కాకపోయినా ఆయనదిగా ప్రసిద్ధిలోకి రావటానికి ఆ పద్యార్థం ఆయన జీవితాని కన్వయించటమనే కారణ మలావుండగా "అతుల సరస్వతీ సరిదుదంచిత బాల రసాల సాల శోభిత తటతుంగ రంగమగు బిందుసరంబు —" (3-763) అని కేయూరబాహు చరిత్ర పద్య రచనకు సంవాద రచనగా తాను పద్యం వ్రాయటం కావచ్చు. అలాగే శారద నీరదేందు ఘన సారపటీర మరాళమల్లికా హార— ఇత్యాది చాటు పద్యం పోతన్నగారి రచనగా భాగవతంలోకి కూడా ఎక్కటానికి కారణం పోతన్నగారు తృతీయస్కంధంలో వ్రాసిన "చారుపటీర హీర ఘన సార తుషార మరాళచంద్రికా పూర్ణ మృణాలహార పరిపూర్ణ సుధాకర కాశమల్లికా సారనిభాంగ శోభిత భుజంగమ తల్పమునందు -" (357) అనే పద్యంలోని సంవాద రచనా విధానం కారణం కావచ్చు

2. పరుజూచుక వరుజూచు నొంప నలరింపక— (10. ఉ.భా. 178) ఇత్యాదిగా వున్న పోతన్నగారి పద్యం నన్నెచోడుని కుమార సంభవంలోని హరుజూచు మగుడ ప్రాణేశ్వరు జూచు (8 68) అనే పద్యానికీ, నాచన సోముని ఉత్తరహరి వంశంలోని అరిజూచుక హరిజూచు చూచుకముందంద (1-102) అనే పద్యానికీ సంవాద రచన.

3. సహకార మత్ప్రియ సహకారు, పున్నాగ పున్నాగు తిలక భూభువన తిలకు (భారతం, అరణ్య. 2 94) అనే నన్నయ్యగారి పద్యానికి పోతన్నగారు దశమ స్కంధంలో వ్రాసిన పున్నాగ కానవే పున్నాగ వందితు. తిలకంబ కానవే తిలకనిటలు (1008 పూ. భా.) అనే పద్యం సంవాదరచన.

4. వీరెవ్వరు శ్రీకృష్ణులుగారా— (10. పూ. భా 374) అనే పోతన్నగారి పద్యం నన్నయ్యగారి ఆదిపర్వంలోని (6-90 పద్యానికి సంవాదరచన.

5. ప్రాణంబుతో గూడ రక్కసి చన్నుల పాలుద్రావిన ప్రౌఢబాలు డితడె (భారతం. ఉద్యోగం 3 160) అనే పద్యానికి దశమస్కంధం పూర్వభాగం లోని 'వీడటే రక్కసి విగతజీవిగ చన్నుబాలు ద్రావిన మేటి బాలకుండు' (1249) పోతన్న గారి పద్యం సంవాదరచన.

6 పోతన్నగారి ప్రసిద్ధమైన మందార మకరంద పద్యం. పాల్కురికి సోమనాథుని బసవ పురాణంలోని (3) "క్షీరాబ్ధిలోపల గ్రీడించు హంస. గోరునే పడియల నీరు ద్రావంగ... విరిదమ్మివాసన విహరించుతేటి, పరిగొని సుడియునే ప్రబ్బలి విరుల—" అనే ద్విపద పంక్తులకు సంవాదరచన.

7. పుణ్యుడు రామచంద్రుడట వోయి మునంబున గాంచె దండకారణ్యము (9-263)
ఇత్యాది పోతన్నగారి పద్యం భాస్కర రామాయణం అరణ్యకాండ లోని పుణ్య చరిత్రు డత్రిమునిపుంగవు వీడ్కొని రాముడంచితాగణ్య గుణాభిరాము డుపరంత మునం జనికాంచె దండకారణ్యము– ఇత్యాది పద్యానికి సంవాదరచన.

ఇటువంటి సంవాద రచనలనే పూర్వకవుల కనుకరణాలుగా కూడా చెబుతారు. నిడుదవోలు వెంకటరావుగారు పోతన యనుసరించిన పూర్వకవులు అను శీర్షికకింద చాలా పద్యాలనూ గద్యాలనూ ఉదాహరించారు. వాటిని పోతన్నగారి పాండిత్యానికి నిదర్శనంగానే భావించాలి. స్వతంత్ర బుద్ధులయిన మహామనీషులు పూర్వులను అనుకరించటం అదొక లీలా విన్యాసం. పోతన్నగారి కవితా వైచిత్రిలో ఈ పూర్వకవుల అనుకరించినట్లుగా చేసిన సంవాద రచనా శిల్పం కూడా భాగమే.

పోతన్నగారిలో మరొక విశేషం కూడా వుంది. ఇతర పూర్వకవుల రచనలకు సంవాద రచనలు చేయటమేకాక ఆయన తన రచనలకు కూడా తానే సంవాద రచనలు చేసుకొంటాడు.

నల్లనివాడు పద్మ నయనంబులవాడు– ఇత్యాదిగా మీ పొదలమాటున లేడు గదమ్మ చెప్పరే– అని తుదిగాగల గోపకాంతల కృష్ణాన్వేషణలోని పద్యం జగత్ప్రసిద్ధమైనది గదా! ఇక్కడి శ్రీకృష్ణుని వర్ణన విషయంగా ఉన్న ఈ పద్యం[2] శ్రీరామ చరిత్రమునందున్న 'నల్లనివాడు పద్మ నయనంబులవాడు మహాశుగంబులున్, విల్లును దాల్చువాడు కడు విప్పగు వక్షమువాడు మేలుపై, జల్లెడువాడు నిక్కిన భుజంబుల వాడు యశంబు దిక్కులం. జల్లెడువాడునైన రఘుసత్తము డిచ్చు తమాక భీష్టముల్' అన్న శ్రీ రామ ప్రార్థన పద్యానికి[3] సంవాదరచన. ఈ పద్యాల్లో కనిపించే సంవాద లక్షణాన్ని బట్టి రామాంకితమైన భాగవతంలో షష్ఠ్యంతాలు కృష్ణార్పణంగా వుండటాన్ని అర్థం చేసుకోవచ్చు. రామకృష్ణావతార సంవాదమును కూడా పోతన్నగారొక వైచిత్రిగా భావించి యుండవచ్చును.

రామకృష్ణావతార సంవాదమని మన మిక్కడ అంటున్నది ఒకవిధంగా రాజశేఖరుని ఆలోచన ప్రకారం కవి సమయం కిందికి వచ్చేదిగా వుంది. ఆ లెక్కలో జాతి ద్రవ్య గుణ క్రియా రూప సమయాలన్నీ భౌమములనీ, స్వర్గ్యములనీ, పాతా

1. పోతన, పుటలు: 134 – 153 – 162.
2. దశమస్కంధం. పూర్వభాగం. 1010.
3. నవమస్కంధం 361.

శీయములనీ మూడు రకాలు. నిజానికి భౌతిక వస్తుప్రపంచానికి సంబంధించిన భౌమమే ప్రధానంగా విస్తృతమైంది. అయినా స్వర్గ్యపాతాళీయములు కూడా ప్రాచీన ఆధ్యాత్మిక భావవాదతాత్విక విజ్ఞానాత్మకమైన సాహిత్యంలో అంతకుమించి చోటు చేసుకొన్నాయి. ముఖ్యంగా పురాణ వాఙ్మయం నిండా స్వర్గ్యపాతాళీయ కవి సమయ భావాలు ఉత్తాలరూపాలు ధరించి వుంటాయి. ఆ కోవకుచెందిన కవిసమయ భావరచనలుగానే రామకృష్ణాది సర్వ దేవతావతార సంవాదమును అనగా ఏకాత్మకత్వమును అర్థం చేసుకోవాలి. ఈ విషయంగా రాజశేఖరుడు నారాయణ– మాధవులకు, అంటే వామన, మోహినీ, వరాహాది అవతారములను ధరించిన శ్రీమన్నారాయణుడును, మాధవుడును అనగా శ్రీకృష్ణుడును ఒక్కడే అని చెప్పి వర్ణించే రచనలను పేర్కొన్నాడు.[1] భాగవతంలో ప్రసిద్ధంగా వున్న ఒక సూర్యుండు[2] అన్నపద్యం విషయం కూడా ద్వాదశాదిత్యులకు ఐక్యాన్నిచెప్పే స్వర్గ్య కవిసమయము ననుసరించిందేనన్న విషయాన్ని కావ్యమీమాంస చెబుతుంది.[3] మామూలు పద్యరచనల్లోనూ భావానుకరణల్లోనూ కనిపించే సంవాద విధానాన్ని మించి భగవదవతార సంవాద ముంటుందని చెప్పటానికే రాజశేఖరుని ప్రస్తావన తెచ్చింది.

సంవాద రచనలు మహాత్ముల బుద్ధులు పరస్పరం తెలియకుండానే ఒకేవిధంగా ఆలోచించ గలవన్న అభిప్రాయం అపార్థాలకు కూడా దారితీస్తుందని కావ్యమీమాంస చూస్తే తెలుస్తుంది. అది చౌర్యం కిందికి వస్తుందన్న వ్యాఖ్యను రాజశేఖరుడు అంగీకరించడు. ఆ లెక్కకు వస్తే వర్తకంలోనూ కవిత్వంలోనూ దొంగతనం లక్షణం లేకుండా వుండదంటాడు. అందువల్ల మహాకవులయిన వాళ్లు ఎక్కడనుండి దేన్ని– శబ్దాన్నిగానీ అర్థాన్నిగానీ– గ్రహించినా దాన్ని సంస్కరించి వినూతనంగానూ విలక్షణంగానూ చేసి చేస్తారనీ ఆలా చేయగలవాళ్ళే మహాకవులనీ అంటాడు.[4] పోతన్నగారినిగానీ మరొకర్నిగానీ సవ్యంగా అర్థం చేసుకోటానికి కావ్యమీమాంసా మార్గం సముచితంగా వుంటుంది. పోతన్నగారిని హాలికుడంటున్నాం గనుక ఈ సంవాద రచనలను బట్టి ఆయనను కర్షకవి[5] అనవచ్చు.

---

1. కావ్యమీమాంస. 14, 15, 16 అధ్యాయాలు. కవిసమయమంటే అశాస్త్రీయమూ, అలౌకికమూ అనేదేదైనా అది సంప్రదాయ పరంపరా ప్రాప్తం కదా అన్న గౌరవంతో యధాతథంగా కావ్యాల్లో నిబద్ధములయ్యే అర్థవిశేషాలు.
2. ప్రథమస్కంధం, 189.
3. 16 వ అధ్యాయం, 11. ద్వాదశానామప్యాదిత్యానామైక్యమ్.
4. 11 వ అధ్యాయం, 36.
5. 12 వ అధ్యాయం, 12.

# VI. 1. పురాణ కవితా మార్గం

నన్నయ తిక్కనాది కవులు 'పురాణావళులు' తెనుగుచేయటంలో భాగవతాన్ని కూడా తెనిగించక పోవటం అది తనసుకృతి విశేషానికి ఫలితమనుకొన్నాడు పోతన. నన్నయ తిక్కనాదులంటే భారత రామాయణాలు మార్కండేయ, పద్మ, నారదీయ, నృసింహ వరాహ పురాణాలూ ఇవన్నీ అప్పటిదాకా తెలుగులో వ్రాసిన కవులని అర్థం. వీటన్నిటినీ పురాణాలనే పోతన చెబుతున్నాడు. నన్నయ్యగారు కూడా బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు. పురాణేతిహాసాలు కలగా పులగంగానే వుండేవి. అందుకాయా గ్రంథాల్లోనే సాక్ష్యాలుంటాయి. ఒకడు చదివి అనేకమందికి వినిపిస్తూ అర్థవ్యాఖ్యానం చేయటానికి ఉద్దేశించి రచింపబడిన గ్రంథం పురాణం. అందువల్ల పురాణ రచయిత కథా విషయాలు చెప్పటంలో పౌరాణికుడు వ్యాఖ్యానం చెయ్యటానికీ, పూర్వాపరాలను సంగత పరచటానికీ కొంత అవకాశ ముండేటట్లు చేస్తాడు.[1] నాటక రచయిత గనుక పాత్రధారులయిన నటులు అభినయంతో సహా ఉచ్చరిస్తేనేగానీ వాచకం ప్రేక్షకులకు అందకుండా రచించినట్లన్నమాట భాగవతంలో "పౌరాణికోత్తమ బ్రతుకుము పెక్కేండ్లు[2]" అని శ్రోతలయిన ఋషులు సూతుణ్ణి ఉద్దేశించి అంటారు. ఇన్ని విషయాలను వ్యాఖ్యాన పురస్సరంగా నిస్సందేహంగా అడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెబుతూ పూర్వాపర సందర్భాలకు వచ్చే విరోధాలను పరిష్కరిస్తూ పురాణ ప్రవచనం చేసే పౌరాణికుడైన సూతుణ్ణి ప్రవచనానికి ముగ్ధులయిన ఋషులు ఆవిధంగా ఆశీర్వదిస్తున్నారు. నన్నయగారి భారతానికిగానీ. పోతన్న గారి భాగవతానికిగానీ పౌరాణికుడనే వాడు ఆ సూతుడంతటి ఘటికుడై వుండాలి.

పోతన్నగారు అవలంబించిన రచనా విధానం నన్నయ తిక్కనాదుల పురాణ రచనా విధానమే. అయితే భారత భాగవత రచనావిధానాల్లో కనిపించే భిన్న ధోరణులకు కారణం ఆయా గ్రంథాల్లో ప్రతిపాదింప బడుతున్న వస్తువు. భారతం ప్రధానంగా రాజ్యాధికార వివాద పరిష్కారానికి సంబంధించింది. దానికి భౌతిక వాస్తవికత ఎక్కువ. ఈ పునాదిమీదనే భారత కథా పురుషుల పరస్పర సంబంధాలు అంటే

1. వెల్చేరు నారాయణరావు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం పురాణ విప్లవం. పుట. 34.

2. ప్రథమస్కంధం– 407.

రాగద్వేషాలు ఆయా పరిస్థితుల ప్రభావాలవల్ల రూపు గట్టుకొంటాయి. ఆ మేరకు ఆయా పాత్రలు క్రియాశీలములై ప్రవర్తిస్తాయి. కష్టనష్టాలను అనుభవిస్తాయి. ఆయా అనుభవాలవల్లా ఆలోచనలవల్లా ప్రేరితములై మళ్ళీ ప్రవర్తిస్తాయి భాగవతం పద్ధతి వేరు. అక్కడ భౌతిక వాస్తవికత పునాదికాదు. ప్రత్యక్ష గోచరంగా వున్న ఈ ప్రపంచం దేనినుండి పుట్టి ఏది ఆధారంగా నిలబడి నశించి దేనిలో లీనమవుతుందో అది పరబ్రహ్మము అని అంగీకరించిన తరువాత బ్రహ్మజ్ఞానము మోక్షకారణం అని దాన్ని సంపాదించుకొనే మార్గాలు వెతకటం మొదలు కావటంతో భారతీయ భావవాద తత్త్వ విచారం ప్రారంభమైంది. ఈ ప్రపంచ మొక్కటే భౌతిక సత్యం. దాని పుట్టుకను గురించిన, దాని ఉనికిని గురించిన దాని విలయాన్ని గురించిన ఆలోచనల పేనుడువల్ల ఏర్పడిన ఒకభావం బ్రహ్మము. భావరూపమైన ఆ బ్రహ్మమును సత్యము గనూ భౌతిక సత్యమైన ప్రపంచమును మిథ్యగానూ చేసుకొనటం చేత మన తత్వ శాస్త్రం ఎంతో పెంగించి. ప్రపంచాన్ని చేస్తున్న మనమంతా జీవులం. జీవబ్రహ్మల కిభేదాన్ని చెప్పే విచారణా, జీవ జగత్తులకు బ్రహ్మంతో అంశాంశి సంబంధాన్ని చెప్పే విచారణా ముఖ్యంగా ఈ రెండు ఆలోచనలూ ఒకటి అద్వైతంగానూ, మరొకటి విశిష్టాద్వైతంగానూ ప్రసిద్ధాలయినవి. భాగవత పురాణం విశిష్టాద్వైత ఆలోచనా ధోరణి ననుసరించి జీవులు మోక్షాన్ని పొందటానికి కర్మజ్ఞానాలను పక్కకు పెట్టి భగవంతునిపట్ల భక్తిచేస్తే చాలు అని నిదర్శనాలుగా భగవంతుని లీలలు, భక్తులు చేసిన శరణాగతులు, సేవా కైంకర్యాలూ, సంస్మరణలూ సంకీర్తనలూ మొదలయిన అద్భుత భగవద్భాగవత వైభవగాథా ప్రపంచాన్ని భావనాపదిగా ప్రదర్శించింది. భగవంతుడు-జ్ఞానము-మోక్షము ఇవన్నీ చిత్తవృత్తిరూప అనుభూతులు- ఈ అనుభూతులకు మూలము బ్రహ్మభావన. ఈ భావవాద తాత్త్విక దృక్పథం పునాదిగా లేచిన భాగవత పురాణసౌధ వైభవాన్ని మరింత పరమ సుందరంగా ఆంధ్రీకరించాడు పోతన్నగారు. అందువల్ల భౌతిక వాస్తవికత పునాదిగాగల భారత కథా కథనానికీ, మరొక పునాదిమీద లేచిన భాగవత కథాకథనానికీ తేడా వుంటుంది, వుండటమే ధర్మం. ఆయా కవులు ఆయా భేదాలను పాటించి రచించారు గనుకనే ప్రాచీనాంధ్ర సాహిత్యంలో అటు నన్నయగారి భారతం, ఇటు పోతన్నగారి భాగవతం దేదీప్యమానంగా వెలిగిపోతూ నిలబడ గలిగాయి. పోతన్నగారి భాగవత కవితా వైచిత్రి అంతా ఆయన అనన్య భక్త్యనుభవ రచనావైశిష్ట్యం మీద ఆధారపడివుంది. అనన్య భక్తితత్వం అర్థం కాకుండా భాగవత కవిత్వాన్ని అనుభవించలేం. భారతం విషయంలో అటు దాని రచయితలయిన కవిత్రయం వారికీ, పాఠకులమైన మనకూ కూడా ఎవరియందూ అనన్య భక్తికాదు వట్టి భక్తికూడా వుండవలసిన అవసరం

లేదు. అసలు భక్తివుంటే వాడికి భారతం అర్థంకాదు భక్తిలేకపోతే భాగవతం అర్థం కాదు భక్తిలోకూడా అనన్య మధుర భక్తిభావన వుంటేనే భాగవత సారస్యం చిక్కేది. లేకపోతే లేదు. భక్తితన్మయత్వం లేక లోకసామాన్యరీతి పాఠకులమైతే మన తెలివికి భాగవత మధురభావన అనుచిత శృంగారమై వెకిలితనంగా వుంటుంది. వుంటుందనటం భగవద్భక్తిలేని దుష్టాత్మతకూ నీచవర్తనకూ నిదర్శన మంటుంది భాగవతం.

తన మృదుతల్పమందు వనితామణియైన రమాలలామ పొందును నెడగా దలంపక యదుప్రవరుం డెదురేగి[1]— శ్రీకృష్ణుడు కుచేలుని స్వీకరించిన తీరును చూచిన అంతఃపురకాంతలు మనస్సుల్లో పొందిన అద్భుతానుభూతికి శబ్దార్థరచన ఆ పద్యం. కుచేలుడు పగటిపూటనే కదా శ్రీకృష్ణుని దర్శనానికి పోయివుంటాడు బాల్య మిత్రుడుకదా అని శ్రీకృష్ణుడు ఎదురువచ్చి స్వాగతం చెబుతూ కుచేలుణ్ణి ఆలింగనం చేసుకొన్నాడు. ఈ దృశ్యం చూడగానే అంతఃపురకాంతలకు శ్రీకృష్ణుడు పక్కలోని రమాదేవి పొందుకంటె కుచేలుని పొందును ఎక్కువగా భావించినట్లున్నాడే! ఆ రమాదేవి భాగ్యంకంటె ఈ బ్రాహ్మణుని భాగ్యమే భాగ్యం అని అనిపించిందని ఆ పద్యం తాత్పర్యం. శ్రీకృష్ణునికీ రమాదేవికీ ఉండే సంబంధ లక్షణమేమిటి? శ్రీకృష్ణునికీ కుచేలునికీ ఉన్న సంబంధమేమిటి? రెండు పోల్చదగినంత తుల్యములా? అయితే మాత్రం పట్టపగలుగదా — రమాకృష్ణు లెప్పుడూ ఆలా ఆలింగనంలోనే వుంటారా? శ్రీకృష్ణుడు రమాదేవిని కౌగిలించుకొంటే ఆమె అనుభూతి వేరు. శ్రీకృష్ణుడు కుచేలుణ్ణి కౌగలించుకొంటే అతని అనుభూతి వేరుకాదు రెండూ ఒకటేనని. ఆ క్షణంలో అది రమాదేవికి లేకుండా కుచేలుడు పొందుతున్నాడనీ అంతఃపుర కాంతల కనిపిస్తున్నది అని పోతన్నగారు వ్రాశారు. ఇందులో తాత్త్విక భావన, కల్పన రెండూ వున్నాయి. కల్పన కనిపిస్తూ అనుచితమనిపిస్తున్నది. భక్తి వేదాంత జ్ఞానంవల్ల అనుచితత్వం ఆ భావమాత్రమై కల్పన భగవదనుభూతికి దోహదం చేస్తుంది.

శ్రీకృష్ణుడు అంటే నారాయణాఖ్య వాసుదేవ పరబ్రహ్మము కదా! ఆయనకు సృష్టి స్థితిలయకార్యములకనువైన మహాశక్తి ఉన్నది. శ్రీవైష్ణవులా మహాశక్తిని లక్ష్మి అమ్మవారుగానూ ఎప్పుడును స్వామిని ఎడబాయక ఆయనకు అనన్యంగానూ

1. దశమస్కంధ. — ఉ. భా. 987.

శరణాగతికి నిదర్శనంగానూ వుంటుందని చెబుతారు. అమ్మవారిని పురుషకారభూత అనికూడా చెబుతారు. అంటే భక్తులపట్ల స్వామి అనుగ్రహాన్ని సంపాదించి పెడు తుంది. భక్తులపట్ల ఆమెకపార మైన దయ. భక్తులను సంసార దుఃఖంనుండి భగవంతుడుద్ధరించాలి. ఆ ఉద్ధరణ కార్యక్రమానికి స్వామిని సుముఖుణ్ణి చేసుకొని ప్రేరేపించాలి. అందుకు తాను పారతంత్ర్యాన్ని వరించి స్వామిని అనుసరిస్తూ, నా సర్వతంత్ర స్వతంత్రతయొక్క అతిశయానికేగదా ఈమె ఏమి చెప్పినా, ఏమిచేసినా అని స్వామికి అనిపించేటట్లు అనన్యార్హత్వమును సంపాదించుకొని నిత్యాన పాయినిగా స్వామితో వుంటుంది— ఇది తాత్వికభావన. పోతనగారు దీనిమీద లౌకికమైన ఊహాపోహలతో కవిత్వాన్ని కల్పించాడు.

కుచేలుడు వచ్చేటప్పటికి శ్రీకృష్ణుడు మంచంమీద పడుకొని విశ్రాంతి తీసు కొంటున్నాడు. అమ్మవారు ఎప్పుడూ ఆయన్ను వదలిపెట్టివుండే ప్రశ్నలేదు గనుక తాత్వికంగా ఆయనతో కలిసి ఆమెకూడా ఆ మంచంమీదనే పండుకొనివుంది. పక్కన పండుకొని ఆమె కుచేలుడనేవాడున్నాడు- నీకు బాల్య స్నేహితుడు- వస్తున్నాడు. వానిని తప్పక అనుగ్రహించాలి— చాలా అవస్థలు పడుతున్నాడు— వాని దారిద్ర్య దుఃఖం చూడలేకుండా వున్నాను— అదుగో రానేవచ్చాడు— పరమ దరిద్రుడైన ఈ చేతనుణ్ణి మీరు అంగీకరించి సంసార దుఃఖ విముక్తుణ్ణి చెయ్యాలి— లేవండి— అని స్వామిని అమ్మవారు ప్రేరేపించింది— స్వామి లేచాడు. ఈ తాత్విక భావనను ఆధారం చేసుకొని తనమృదు తల్పమందు వనితామణియైన రమాలలామ పొందును అని పోతనగారు కవిత్వం చెప్పారు. పోతన భక్తుడు, అంతః పురకాంతలు భక్తు రాండ్రు రమాదేవి ముఖ్య భక్తురాలు. కుచేలుడు భక్తుడు. పాఠకులం మనం భక్తులం కాకపోతే దాని స్వారస్యం అనుభవించలేం.

కుచేలుడు భక్తుడుగదా. శ్రీ కృష్ణుని వీడ్కొని తిరిగి స్వగ్రామం పోతూ శ్రీకృష్ణుడు తనను ఆదరించిన తీరును స్మరించుకొంటున్నాడు. నడిచి నడిచి వచ్చాడు గదా అని అధికాధికమైన ఆదరంతో శ్రీకృష్ణుడు కుచేలుని కాళ్ళు పిసికాడు. ఆ విష యాన్ని స్మరించుకొంటున్నాడు కుచేలుడు. "శ్రీకుచాలిప్త చందనాంచిత కరాబ్జతల ములను నడ్డులొత్తె వత్సలతమెఱసి[1]—" ఇదేమిటి? నిత్యానపాయినియైన లక్ష్మీదేవిని ప్రపన్నురాలిని అనన్యార్హత్వము సంపాదించుకొన్న భక్తురాలిని ఆదరించిన ఆ దివ్య

1. దశమస్కంధం, ఉ-భా, 10 18.

సుందర సుకుమార కరతలములతో స్వామి నాయీకాళ్ళు పట్టి పిసికినాదే- అహో స్వామి అనుగ్రహము! స్వామి ఇంత అనుగ్రహమును కురియుటకు పిరాట్టి కృపతో స్వామికి ఎంత చెప్పివుంటుందో కదా!- ఇది కుచేలుని భక్తిపాన. పాఠకులందు కోవాలి. భావవాద తాత్విక దృక్పథం బలంగా వుండాలి. దేనికైనా సలక్షణమైన విచారణ శీలం ఉండటం అవసరం.

పోతన భాగవతం పురాణం చెప్పే పౌరాణికుడు. విశిష్టాద్వైత వైష్ణవ సంప్రదాయ విజ్ఞానాన్నీ తదితర అద్వైతము మొదలయిన తాత్విక దృక్పథాలను జీర్ణం చేసుకొన్నవాడైతే తప్ప న్యాయం చేయలేడు. సంప్రదాయ విద్వాంసులు ఆలోచించి సమన్వయ పూర్వకంగా విశేషాంశాలను వివరించి చెప్పవలసిన ఘట్టాలు పోతన్నగారి భాగవతంలో అడుగడుగునా ఎదురవుతాయి. ప్రతి పద్యాన్నీ గద్యాన్నీ వరుసగా చదువుకొంటూ అర్థం చేసుకొంటూ అర్థం చెబుతూ పోయిన వాళ్లం కాదు గనుక, అసలు మొత్తం భాగవతాన్ని అఖండంగా కాక, ప్రహ్లాదచరిత్ర, గజేంద్ర మోక్షణం వామనచరిత్ర, అంబరీషో పాఖ్యానం, రుక్మిణీకల్యాణం, కుచేలోపాఖ్యానం, ఈ మొదలయిన కథా ఘట్టాలను ఖండఖండాలుగా అప్పుడు కొంత అప్పుడు కొంతగా తాత్కాలికావసరాన్ని బట్టి చదివిన వాళ్ళం కావటంచేత, భాగవత అఖండార్థ ప్రతీతిని గురించిన ఆలోచనలేదు గనుక భాగవత వస్తువును దాని కథాగతిని గురించి ససందర్భంగా మాట్లాడలేక పోతున్నాం.

దేవకి అష్టమగర్భం వలన కంసుడు తనకు ఆయుస్సు చెల్లుతుందని అశరీర వాణి చెప్పగావిని దేవకీదేవిని చంపటానికి ఉద్యుక్తుడైనప్పుడు వసుదేవుడు అడ్డుపడి బతిమిలాడుతాడు. ఆ బతిమిలాడటంలో భాగంగానే వసుదేవుడు కొంత వేదాంతం మాటలు నాలుగైదు పద్యాల్లో మాట్లాడినాడు- భాగవతం తత్వప్రబోధక గ్రంథం. అందులో పాత్ర లందరూ భక్తులే. జ్ఞానులే. భగవత్కృప వుంటే చాలు భక్తులు అన్నింటిలోనూ పైచేయిగానే వుంటారు. ఈ దశమస్కంధంలోని వసుదేవుని వాచకంగా వున్న అయిదు (29-33) పద్యాలు ఆవక్తకూ ఆ శ్రోతకూ తగేవున్నాయి. ఎందువల్లనంటే భగవంతుడు రాక్షస భక్తులు సాత్వికులు కావటానికి ఎన్నో అవకాశాలిస్తాడు. ఎంతమంది చేతనో చెప్పిస్తాడు. ఆ విధంగా భాగవతతత్వాన్ని గుర్తించి ఆలోచిస్తే ఆ పద్యాలు సముచితాలుగానే వుంటాయి. అయితే ప్రహ్లాదుడు - ధ్రువుడు వాళ్లెంత? వాళ్ల వయస్సెంత? వాళ్ల ముఖతః వెలువడ్డ తత్వజ్ఞాన విషయమెంత? అసహజమంటే అంతా అసహజమే. ఆ కథలన్నీ అర్థవాదాల లాంటివిగానీ వాస్తవికాలు కావు. అర్థవాదాలు చెప్పబడితే అందులో నుండి మనం గ్రహించవలసిం దేమిటో పౌరాణికుడు చెప్పగలగాలి. మనం గ్రహించగలగాలి. విశిష్టాద్వైత భావవాద దృక్పథం నుండే భాగవత తత్వస్థాయిని గూర్చి అధ్యయనం చెయ్యాలి.

## IV. 2. భాగవత కృష్ణుడు

కృష్ణశబ్దము సంజ్ఞావాచకంగా దేవకీ వసుదేవులకు పుట్టి యశోదానందుల యింట పెరిగిన ఒక పురుషునకు సంకేతమన్నది లౌకికమైన దాని రూఢలక్షణం. కానీ భాగవతం శ్రీకృష్ణుని అవతార పురుషునిగా, పరబ్రహ్మముగా నిరూపిస్తున్నది గనుక అక్కడ కృష్ణశబ్దము రూఢ్యర్థంలో గాక దేవతా వాచకంగా యోగరూఢ్యర్థంలోనూ, యౌగికంగా పరబ్రహ్మ వాచకంగానూ వాడబడుతున్నది. గ్రంథ తాత్పర్యాన్ని బట్టి శబ్దార్థయోజన చెయ్యాలనటం భారతీయ సంప్రదాయం. వేదాలుగానీ, వేదార్థములను ప్రతిపాదించే పురాణేతిహాసాలుగానీ, ఆ యర్థాలనే మరింత కాంతాసమ్మితంగా చెప్పే కావ్యాలుగానీ లౌకికార్థాలను చెప్పటానికి కాదు గనుక, శబ్దాలు లౌకికాలు కాకతప్పదు గనుక, ఆ శబ్దాలకే లోకోత్తరమైన అర్థాలను చెప్పే యోగరూఢ్యాది శక్తులను ప్రాచీనులు సంభావించారు. అందువల్లనే కావ్యానికి లోకోత్తర ఆహ్లాద జనకత్వం లక్షణమైంది. కావ్య విమర్శ కావ్య పరమార్థ దర్శనస్థాయి కెక్కింది. లౌకికములయిన పదములకు అలౌకికార్థములను బోధించే శక్తిసామర్థ్యాలను ప్రాచీనులు సంతరించారు. అలౌకికార్థము అంటే శాశ్వతము- అద్వితీయము- అని చెప్పబడే పరబ్రహ్మము. వేదశబ్దజాలం పరబ్రహ్మ బోధకమని నిశ్చయమైనది గనుక ఆ ప్రాతిపదిక మీదనే పురాణేతిహాసాలలోనూ, కావ్య నాటకాలలోనూ కూడా పరబ్రహ్మ బోధకత్వ శక్తిని ఆయా భాషాపద ప్రయోగమునందు దర్శించి ప్రదర్శించటమే కావ్యపరమార్థ దర్శనంగా సాహిత్య విమర్శన విధానం ఒక రూపాన్ని పొందింది[1] పోతన్నగారి భాగవత మహాపురాణ విమర్శనమంటే పరమార్థ దర్శనంగానే వుండాలి. పరమార్థభూతమైన వాసుదేవ పరబ్రహ్మ ప్రతిపాదకమైన గ్రంథాన్ని అలాగే దర్శించాలి. అప్పుడు తెలుస్తుంది కృష్ణశబ్దాన్ని ఏలా అర్థం చేసుకోవాలో,

దుష్టజన నిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబు సేయుట కొరకై
యష్టమ గర్భమున గుణో
త్కృష్టుడు దేవకికి విష్ణుదేవుడు పుట్టెన్. (9–723)

---

1. తెలుగులో ఈ కావ్య పరమార్థదర్శన విమర్శన విధానానికి విశ్వనాథ సత్యనారాయణగారు మార్గదర్శకులు. అభిజ్ఞాన శాకుంతలంమీద వ్రాసిన విమర్శన చూడవచ్చు.

ముందుగానే ఇంతనిశ్చయం చేయబడి ప్రవర్తించిన భాగవత శ్రీకృష్ణుని కథావిశేషాలను పరమార్థదర్శనాపేక్షయా విమర్శించుకోవలసిందేకానీ లౌకికదృష్ట్యా మాట్లాడరాదు కదా. కానీ మనమేం జేస్తున్నామంటే శ్రీకృష్ణుని చేష్టలకు పరమార్థం బోధపడనప్పుడు, ఆహా మానవుడుగా ఎంత చక్కగా ప్రవర్తిస్తున్నాడని ప్రశంసించడమూ, అంతలో మన అభిరుచులను బట్టి ఉచితానుచితాలను నిర్ణయించటమూ చేస్తున్నాం. ఉచితానుచితాల విషయంలో మనలో మనకు భేదాభిప్రాయాలువస్తే పరమార్థందాకా పోకుండానే ఆయన అమానుష దైవిక విశేషాలను ప్రముఖంగా చెప్పి కీర్తించుటమూ చేస్తున్నాం. భాగవత గ్రంథ తాత్పర్య అవబోధకు మన పద్ధతి పద్ధతికాదు. పరమార్థ దర్శన పద్ధతినే అవలంబించాలి.

పారమార్థిక దృక్పథం మన భారతీయ ప్రాచీన అధ్యయన విధానం. చారిత్రక దృక్పథం ప్రపంచ వ్యాప్తంగా ఆధునిక అధ్యయన విధానం. మనం మన ప్రాచీన పురాణేతిహాసాల విషయంలోగానీ, కావ్యనాటకాల విషయంలోగానీ అనుసరిస్తూవస్తున్న అధ్యయనవిధానం అటు పారమార్థికమూకాక, ఇటు చారిత్రికమూకాక రెంటికింజెడిన రేవడగా తయారైంది. ప్రాచీన సాహిత్యాన్ని వైయక్తిక ప్రయోజనాపేక్షయా చదవటానికైతే పారమార్థిక దృక్పథం మంచిది. సామాజిక జీవిత అవగాహనాపేక్షయాగానీ, ఆధునిక సామాజిక జీవిత ప్రయోజనాపేక్షయాగానీ చదవాలనుకొంటే చారిత్రిక దృక్పథం మంచిది. ప్రాచీన సాహిత్యాన్ని చారిత్రిక దృక్పథం నుండి అధ్యయనం చెయ్యవచ్చుగానీ, ఆధునిక సాహిత్యాన్ని పారమార్థిక దృక్పథం నుండి అధ్యయనం చెయ్యలేం. చేసి ప్రయోజనం లేదు. భాగవతం విషయంలో పారమార్థిక దృక్పథం సముచితం. భాగవత కృష్ణుడు అంటే శ్రీకృష్ణపరమాత్మ అని అర్థం.

మంచివారికెల్ల మంగళప్రదలయ్యు ఖల్లరులకు మేలుగాని యట్టి
తనువులెన్నియైన దాల్చి లోకములకు సేమమెల్ల బ్రొద్దుసేయుదీవు.
(10– పూ.భాగ. 93)

ఈ పరమాత్మతత్వ పరమార్థ ప్రతిపాదకమే శ్రీ మహాభాగవత పురాణం. అలాంటి శ్రీకృష్ణపరమాత్మ "కలియుగమునకు పూర్వము 126 వ సంవత్సరమున అనగా క్రీ. పూ. 3228వ సంవత్సరమున శ్రీముఖ నామ సంవత్సర శ్రావణ బహుళ అష్టమి రాత్రి పండ్రెండు గంటలకు రోహిణీ నక్షత్రమున జనించినట్లు విదితము... 125 సం॥ల, 7 మాసముల, 8½ దినములు జీవించి కలి 1వ సంవత్సరము ప్రమాది

నామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి శుక్రవారము తన అద్భుత అవతారమును ప్రదర్శించెను[1]–" అని పారమార్థికవాదులు చెప్పటం పరమార్థభూతమైన భావ వాదానికి పునాదిబలంగా చారిత్రకతను సంతరించటమే. ఈ రకమైన చారిత్రికతను గురించిన ఆలోచనకు ఆధునిక భారతీయ తత్వవేత్తలలో స్వామి వివేకానందులు ప్రారంభకులు కావచ్చు[2].

## IV. 3. భక్తి కవితలు – భౌతిక పునాదులు

భాగవతాన్ని చారిత్రక భౌతికవాద తాత్వికదృక్పథంనుండి కూడా అధ్యయనం చెయ్యవచ్చు. అయితే భాగవతం అనువాద గ్రంథం కావటంచేత భాగవతంలో వున్న మానవజీవిత సంబంధ విషయాలు ఏ నిర్దిష్ట దేశకాలాలకు సంబంధించినవో చెప్పటం కష్టం. 15వ శతాబ్దం తెలుగుదేశ పరిస్థితుల్లో కానీ, భారతదేశ పరిస్థితుల్లో కానీ భాగవతం పుట్టలేదు. ఎప్పుడో సంస్కృతంలో పుట్టిన భాగవత గ్రంథ విషయాలు 15వ శతాబ్దంలో తెలుగువాళ్లకు చెప్పవలసిన అవసరం ఏర్పడింది. ఏర్పడకపోతే భాగవత రచన ఎందుకు జరుగుతుంది? ఇలా అనటంచేత యాంత్రికంగా ఆ శతాబ్దంలోని తెలుగు వాళ్లందరికీ భాగవత పురాణ విషయాలతోనే పని బడింది అని అంటున్నట్లర్థం చేసుకోకూడదు. దహారంమీద భారతదేశం చరిత్రలో అవైదికాలయిన జైన బౌద్ధమతాలను హిందూ శైవ వైష్ణవ భక్తిమతాలు త్రోసి రాజనగలిగిన పన్నెండవ శతాబ్దాంతానికి మహమ్మదీయులు బలవంతులై దక్షిణభారతం మీదకూడా రాజకీయాధికారం కోసం బయలుదేరారు. జైన బౌద్ధాలు ఎంత అవైదికాలయినా అవి భారతీయ మతాలు. ఇస్లాం మతం అవైదికమేకాదు అభారతీయం కూడా. ప్రాచీనదేశాల చరిత్రలు ఆదేశపు ప్రాచీన మతచరిత్రలతో ముడివడివుంటాయి. రాజ్య నిర్వహణ వ్యవహార యంత్రాంగానికి చోదకశక్తిగా వుంటూ మతం దాని లక్ష్యాలకు అద్భుతంగా రూపకల్పన చేయగలిగింది. మహమ్మదీయులు రాకపూర్వం రాజకీయచరిత్ర నిర్మాతలూ మతతాత్విక చరిత్ర నిర్మాతలూ కూడా భారతీయులే. పన్నెండో శతాబ్దం

1. అనుభవానందస్వామి–సర్వ సిద్ధాంత సౌరభము. సంపుటం 8, పు. 100.

2. In ancient times, there was very little tendency in our country to find out truth by historical research–Complete works. Vol. 4, P. 99.

తరువాత పరిస్థితులు మారిపోయినాయి. రాజ్యనిర్వహణ వ్యవహారం జరుపవలసింది దేశీయులయిన ప్రజలతోగదా! ప్రభువులవ్యవహార చోదకశక్తియైనమతం దేశీయులకు కానిపరిస్థితి ఏర్పడింది. అందువల్ల దేశీయుల సాంఘిక అస్తిత్వం అస్తవ్యస్త మైంది. రాజ్య వ్యవహారం సాంఘికం. మత వ్యవహారం ఆధ్యాత్మికం. రాజుదీ ప్రజలదీ ఒకటే మతమైతే రాజ్యాంగమూ మతమూ సాంఘిక ఆధ్యాత్మిక విషయ సమన్వయంలో సర్దుబాట్లు చేసుకొంటూ పోగలవు. ప్రభువుల మతం వేరై ప్రజల మతం వేరైనప్పుడు సాంఘిక ఆధ్యాత్మికరంగాల్లో సంక్షోభంఏర్పడుతుంది. ప్రభుత్వం చేతిలో అధికారబలం వుంటుంది గనుక సాంఘిక సంక్షోభాలను అది ఎప్పటికప్పుడు ఎక్కడికక్కడ అణచివేయగలదు. ఆధ్యాత్మిక సాంస్కృతిక రంగాన్ని ప్రభుత్వం రూపుమాపలేదు. గనుక అది తనకనుకూల వాతావరణాన్ని సృష్టించి పెట్టేటట్లు చూచుకొంటుంది. దేశీయుల సాంఘిక అస్తిత్వం రాజకీయంగా దెబ్బతిన్న పరిస్థితు లలో వాళ్లకు కేవలం ఆధ్యాత్మిక అస్తిత్వమే ఆలంబనమవుతుంది. ఆ ఆలంబనం కూడా లేకపోతే మత ప్రభావాలు పరిపాలించే కాలంలో మనుషులు బతకలేరు ముందు బ్రతికి ఉండేకదా. అందువల్ల తెలుగు ప్రజల్లో అలవాటయిన శైవ వైష్ణవ భక్తి మతాల్లోకూడా వైరదృష్టితగ్గి సఖ్యదృష్టి పెరగటం, వైదిక బ్రాహ్మణ వర్ణాశ్రమాచార ధర్మాల విషయంలో పట్టుదలను వ్యతిరేకతను విడనాడటం మొదలయిన గుణాలతో హిందూమతంలో ఒక సరళసామరస్య ధోరణి పదమూడు పద్నాలుగు శతాబ్దాల్లో అభి వృద్ధి అయింది. ఈ సమన్వయ దృక్పథానికి తెలుగు సాహిత్యంలో తిక్కన్నగారే నాయకుడు. నన్నయ్యగారి వైదికమార్గనిష్ఠకు తిక్కన్నగారు శివకేశవ భేదములేని భక్తితత్వాన్ని జోడించి— ఈ రకమైన అనుష్ఠానం మనస్సును నిర్మలంగా వుంచ గలుగుతుందని ప్రబోధించాడు. తిక్కన్నగారి ఈ ప్రబోధకాలానికి దక్షిణభారతంలో కాకతీయ ప్రభువుల పాలన కొనసాగుతూనే వుంది. పోతన్నగారి కాలానికీ ఈ ప్రభుత్వం కూడా పోయింది. హిందూ ప్రభుత్వంగా విజయనగరం బలపడుతున్నది. అయినా బహమనీ సుల్తానుల దండయాత్రలు ఇటు తెలంగాణానికీ అటు రాయల సీమకు కూడా తగులుతూనే వున్నాయి[1]. బలహీనులయి దేశీయ ప్రభువులు నామ మాత్రపు రాజులుగా విదేశీయ ప్రభువులకు ఓడిపోతూనూ, లోబడుతూనూ వున్న కాలమది. అందువల్లనే కావచ్చు వేదాంత దేశికులంతటి వైష్ణవ మతాచార్యుడు కూడా దేశీయులయినా రాజుల రాచరికాలు బుద్బుద ప్రాయాలుగా వుండటం గమనించి, దేశ ప్రజల్లోనే తిరుగుతూ ఆధ్యాత్మికంగా వాళ్ళకు ఒక అస్తిత్వాన్ని ప్రసాదించటాని

1 S. K. Sinha- Mediaeval History of the Deccan. P. 98, 99.

కుద్యమించటం. పోతన్నగారి దేశకాలాలు- నన్నయ తిక్కనాదుల వైదికమార్గ నిష్ఠ భేదములేని భక్తి, వేదాంత దేశికుల వైదిక వైష్ణవం, సీతారామార్చనాత్మకమైన శ్రీరామానందుల సీతారామ పరబ్రహ్మ భక్తి సంప్రదాయం- ఈ మత భావాలన్నీ శంకరరామానుజుల అద్వైత విశిష్టాద్వైత తాత్విక దృక్పథాల నుండి సమన్వయం చేయబడిన ఒక ఆధ్యాత్మిక అస్తిత్వాన్ని- అవలంబింపక తప్పని పరిస్థితిని-ప్రజలకు కల్పించాయి. సాంఘిక అస్తిత్వం విషయంలో పడని వాతావరణం బాధలనుండి ప్రజలను రక్షించటానికి వాతావరణాన్ని మార్చగలిగిన అవకాశం లేనప్పుడు. ప్రజలనైనా ఆ వాతావరణ వ్యూహనుండి తప్పింపగలగటమైనా అది గొప్ప సహాయమేకదా।

ఆధ్యాత్మిక అస్తిత్వభావనకు కూడా మూలభూతమైన పునాది భౌతిక అస్తిత్వం లోనే వుంటుంది. జాతిగుణ క్రియా విశేషరూపంగా మనం పొందే వస్తువిజ్ఞానానికి ఇంద్రియాలకు వస్తువులు విషయాలు కావటమే కారణం. ఇంద్రియ విషయాలు మెదళ్లలో ప్రతిఫలించటం వల్లనే భావాలు ఉత్పత్తి అవుతున్నాయి. ఇవన్నీ భౌతిక భావాలు_ సాధారణ ప్రాథమిక భావాలు. ఇంద్రియాలకూ వస్తువిషయాలకూ నేరుగా సంబంధం కనిపించని ట్లల్లోచోకూడా భావాలు ఉత్పత్తి అవుతాయి. అవి ఆధ్యాత్మిక భావాలు. ముఖ్యంగా ఆధ్యాత్మికభావాలు ఉత్పత్తికావటానికి మానవ సామాజికసంబంధాలలో మానసికశ్రమది పైచేయి అయి శారీరక శ్రమను నిష్ఫలం చేయటంవల్ల ఏర్పడ్డ అసహాయత మూలకారణం లేన అసహాయతనుకూడా తాను తెలుసుకొనలేని అజ్ఞాన స్థితి దాని పెరుగుదలకు దోహదం చేస్తుంది. ఏభావమైనా అదొక అనుభవం నుండి యేర్పడేదే కదా। అనుభవమంటే అది భౌతిక ప్రపంచంలో అనివార్యంగా ఏర్పడే పరస్పర అనుకూల ప్రతికూల సంబంధాల నుండి పుడుతుంది. మనుషులకు మనుషులతోనూ ప్రకృతితోనూ పరిసర వాతావరణంతోనూ సంబంధాలుంటాయి. అన్నిభావాలకూ ఆ సంబంధాలే మూలం. అందువల్ల ఆధ్యాత్మిక భావజాలానికీ కూడా భౌతిక జీవితమే మూలం. అయితే వీటికి ఇంద్రియగ్రహణ యోగ్యమైన భౌతిక వస్తుసత్య ప్రపంచముండదు. ఉండకపోయినా భౌతికజీవిత అవసరాలు తీరటానికి కొంత ఆధ్యాత్మిక భావజాల మవసరమే అవుతుంది. ఆధ్యాత్మిక భావజాలం జీవితావసర వస్తువే అయినా సమాజంలోని స్థాయిభేదాలవల్ల అందరి జీవితావసరాలూ ఒకరకం కావు వాళ్ళ వాళ్ళ అవసరాలు తీర్చటానికి ఆధ్యాత్మిక భావజాలం కూడా నానా ప్రకారంగా వుంది గణితంలో, సైన్సులో, టెక్నాలజీలో గూడా ఆధ్యాత్మిక భావ జాలమున్నది. భాగవత మహాపురాణ విషయంగా ఆధ్యాత్మికతను గురించి విచారిస్తున్నాం గనుక ఇక్కడ మతతాత్విక దృక్పథాల నుండి ఆధ్యాత్మికత అంటే

దేవుడు- ద్వైతం- ఆత్మ- పరమాత్మ- జీవాత్మ- స్వర్గం- నరకం- భక్తి-జ్ఞానం-మోక్షం- ఈ మొదలయిన పదాలకు అర్థంగా ప్రతీతికివచ్చే సమస్త భావజాలాన్నీ గ్రహించాలి. పోతన్నగారు భాగవతాన్ని ప్రారంభిస్తూనే పలికిన శ్రీకైవల్య పద మున్నదికదా. అదే సమస్తమైన ఆధ్యాత్మిక భావజాలానికీ ఏకైక సంకేతపదం (The Absolute). అంతకంటె అధికతరమైన దేమీలేదు. అది దేనిమీదా ఆధార పడదు. అన్నీ దానిమీదే ఆధారపడతాయి. అది దేనినుండీపుట్టదు. అన్నీ దానినుండే పుడుతాయి. అది ఎప్పుడూ నశించదు. నశించినవన్నీ అందులోనే లీనమవుతాయి. ఆధ్యాత్మిక వస్తుభావన అంటే ఈలాగా వుంటుంది. భౌతికజీవిత వాస్తవిక దుఃఖ భూయిష్ఠత నుండి అన్వయ వ్యతిరేక ముఖంగా ప్రతిఫలించిన అనుభవ విశేషమే ఆధ్యాత్మిక భావం. అంటే అదొక కొత్తగాపుట్టుకొని వచ్చిన సామాజిక అవసరం నుండి ఏర్పడుతున్న దన్నమాట.

వర్ణవ్యవస్థాత్మకమైన వర్గ స్వభావాలుగల సమాజంలో ఆధ్యాత్మిక భావాన్ని మతతాత్వికతలు పరిపాలించే కాలంలో, జ్ఞానేంద్రియాలకు ప్రత్యక్ష గోచరం గాని శ్రీకైవల్యంగా సంభావితమైనదాన్ని శ్రీకృష్ణ కథాగానం ద్వారా పొందగలగటాన్ని ప్రబోధించటంవల్ల పోతన్నగారు వర్ణభేదాలనుండి, వర్గభేదాలనుండి మనుషులను తప్పించి సర్వసమస్థాయిగల ఒక భక్తబంధు సమాజంగా బ్రతకటానికి మానసికంగా వాళ్ళను సంసిద్ధం చేసినట్లు. అందువల్ల హరినామస్తుతిని విషయంగా చేసుకొనివున్న భాగవత రచన ఆర్తులకు తాత్కాలికోపశమన ప్రయోజనకారి అయిన రచనయే. అందుకనే భక్తి కవిత్వానికు కూడా భౌతిక పునాదులున్నాయని చెప్పటం. తాత్కాలి కోపశమన ప్రయోజనకారి అయిన రచన సార్వకాలిక ప్రయోజనకారిగా వున్నదంటే దాని అవసరాలను సృష్టించిన పరిస్థితులు మారటం లేదని అర్థం.

ఆధ్యాత్మిక అస్తిత్వ భావనను ఔషధంగా ప్రజలు సేవిస్తే, సాంఘిక అస్తిత్వంలోని బాధలను తట్టుకొని వాళ్ళు బ్రతకగలుగుతారు. బ్రతికియుండిన శుభ ములు బడయవచ్చు. పదిహేనవ శతాబ్దపు తెలుగుదేశం ప్రజలకు వాళ్ల చైతన్యాన్ని- పరిస్థితులు మారేవరకు - ఆధ్యాత్మిక భావనా ప్రపంచంలో అస్తిత్వాన్ని చూసుకో పొమ్మని నిశ్చయించి చెప్పింది. ఆ సాంఘిక అస్తిత్వ నిర్ణయాన్ని అమలు జరప టానికి అవసరమైన సాధన సామగ్రి ఏదో ఎక్కడవున్నదో వినీ, కనీ, తెలిసికొనీ, యథాశక్తిగా సంపాదించి తెలుగులకందించిన దేశభాషా సాహిత్యభక్తుడు పోతన్న. నిబద్ధత నిమగ్నత కలిగినవాడు భక్తుడు. భక్తకవియైన పోతన్నగారు తన భాగవత

కవితా వైచిత్రిచేత తెలుగు ప్రజలకు ఆధ్యాత్మిక నిబద్ధత నిమగ్నతలను సమైక్యంగా సులభసాధ్యం చేశాడు. ఆ విధంగా తెలుగులో పురాణమార్గం నిజంగా పెకులాల వారందరికీ ఆమోదయోగ్యమై, పురాణ గ్రంథం ఇటింటా పారాయణ గ్రంథమైంది పోతన్నగారి వల్లనే.[1]

ప్రబ్బిన భక్తిని హరిపై
నిబ్బరములు సెప్పి కవులు కైవల్యశ్రీ
గిబ్బుదురట హరిపోషణ
మబ్బిన తలిదండ్రు లెచటికబ్బుదురో తుదిన్[2]

ఈ పద్యానికి వక్తపరీక్షిత్తు. శ్రీకృష్ణుని యశోదానందులు తల్లిదండ్రులుగా పోషిస్తున్నారని చెప్పగా విని వాళ్ళ పుణ్యవిశేషమును రాజు ప్రశంసిస్తున్నాడు. ఈ పద్యానికంటె ముందొక ఆటవెలది పద్యమున్నది. దానికీ వక్తపరీక్షిన్మహారాజే. యశోదానందుల ప్రశంసకైతే ఆ పద్యం చాలు. మళ్ళీ ఈ పద్యమెందుకు? ఇది రాజయోగిముఖంగా తన శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించుటను సఫలమైందిగా అంటే తప్పక ఫలించునదిగా రూపం చేయించటం లక్ష్యంగా పోతన ఈపద్యం వ్రాసి వుంటాడు. మొదటి రెండున్నర పాదములు భాగవతంలోని మొదటి పద్యభావార్థాన్ని రూపపరచటానికి ఉద్దేశించినవే. తానావిధంగా భక్తికవితారచన విషయంలో నిబద్ధుడు నిమగ్నుడూ కనుక తనకులాగానే హరిపోషణ విషయంలో నిబద్ధులూ నిమగ్నులూ అయిన యశోదానందులు కూడా ఆధ్యాత్మిక భావనా ప్రపంచంలో అస్తిత్వాన్ని-కైవల్యశ్రీని పొందుతారు. అనుభవిస్తారు. పోతన్నగారు చేస్తున్న అంటే శ్రోతయైన పరీక్షిత్తుచేత చేయిస్తున్న ఈ ధృవీకరణాన్ని పౌరాణికుడు తెలుగు భాగవత పురాణ శ్రోతల విషయంలోనూ సంపాదించాలి. ప్రజల భాగవత ప్రవృత్తియే హరిపోషణం. హరినామస్మరణ సంకీర్తనలవల్లనే ఆయన ఉనికి పోషింపబడుతుంది. ఆవిధంగా హరి ఉనికిని ప్రకటించే భక్తులు కైవల్యానికంటె ఇంకా ఉన్నతమైన పదవికి చేరుతారన్నది మరింత ఉత్సాహపరిచే మాట. కవులూ, యశోదానందులూ, భక్తులయిన భాగవతులూ వీళ్ళందరూ ఒకరు భగవంతుని లీలావిశేషాలను తన్మయులై వర్ణిస్తే మరొకరు అవతారమూర్తిని సేవిస్తే, ఇంకొకరు సంకీర్తనం చేస్తే భగవంతుడైన శ్రీహరి యొక్క ఉనికి కాపాడబడుతూ, సంసార యాతనలనుండి వీళ్ళ మనస్సులను

1. వెల్చేరు నారాయణరావు. 46.
2. దశమస్కంధం. పూ భా. 351.

విరమింప జేస్తున్నది. భక్తులకు ఈ విరమణసుఖాన్ని వారు చేసే హరిపోషణ విధానం సంపాదిస్తున్నది. ఇందులో ఏదిమంచి ఏదిచెడు అనికాదు. చరిత్ర విషయంలో మన మాలోచించవలసింది చరిత్రనుండి గుణపాఠాలు నేర్చుకోగలమేగాని దాన్ని మార్చ లేము. వర్తమానాన్ని మార్చుకోగలం. చరిత్రను విశేషించిన అధ్యయనం చేయటం ద్వారా వర్తమాన ప్రపంచాన్ని మార్చుకొనే అవకాశమున్నది. గనుకనే చారిత్రక దృక్పథం అదొక తాత్వికచ్ఛాయను సంతరించుకొన్నది. ఈచారిత్రక భౌతిక దృక్పథం సాంస్కృతిక రంగంలోని సాహిత్య కళారూపాలను అధ్యయనం చేయటం గురించి చాల జాగ్రత్త తీసుకొంటుంది.

"సంసార ప్రవిష్టుండైన వానికి తపోయోగాదులయిన మోక్షమార్గంబులు పెక్కు లుగలవందు భక్తిమార్గంబుకంటె సులభంబులేదు—"[1] ఇది భాగవత ప్రతిజ్ఞా వాక్యం. ఇంత నిశ్చయబుద్ధితో పోతన్నగారు భాగవతాన్ని తెనుగులో వ్రాయటానికి ఆయన కాలానికి పరిణమించిన దేశ కాలపరిస్థితులు అనుకూలంగాకానీ ప్రతికూలంగా గానీ ప్రేరకాలు కావాలి. ఆయన కాలానికి రెండు వందల సంవత్సరాలుగా పరిణ మిస్తూ వచ్చింది మత రాజకీయ పరిస్థితులే భిన్నాభిన్నంగా తెలుగు దేశాన్ని కొండ వీటిలో ఒకరు, రాచకొండలో ఒకరు, మరొకచోట మరొకరుగా ఎవరికివాళ్ళు తామే రాజుల మనుకొంటున్న కాలమది. వీళ్ళందరి కంటె బలవత్తరమై భారత ప్రభుత్వ స్థాయి నందుకొన్నది ఢిల్లీసుల్తానులు. బహ్మనీసుల్తానులు తెలుగు కర్ణాట ప్రాంతాల మీదికి చేతులుచాస్తూ కూర్చొనివున్నారు. ఈ పరిస్థితుల్లో వ్యవసాయమూ వ్యాపారమూ నమ్ముకొని హిందువులు స్వస్థలాలను అంటిపెట్టుకొని బ్రతుకుతూ తమ సాంఘిక సుస్థిరతకు, ఆర్థిక సంపదలకూ రాజకీయంగా అనుకూలమైన రక్షణ వ్యవస్థలేని కారణంగా ఆధ్యాత్మికంగా భగవద్భావన నాశ్రయించి శరణుకోరి తృప్తిపడవలసి వచ్చింది. ఆ అవసరాన్ని తీర్చటానికే నామరూపాలు ఎన్నివున్నట్లు చెప్పినా నిజానికి భగవంతుడొక్కడేనని ఆయనను నమ్ముకొని ఆశ్రయిస్తే ఆయనే రక్షణభారం వహిస్తాడనీ భాగవత కవులు అంటే భక్తకవులంతా గానం చేశారు.

"రక్షకులు లేనివారల రక్షించెదననుచు చక్రిరాజై యుండన్,
రక్షింపుమనుచు నొకనరు నక్షము ప్రార్థింపనేల ఆత్మజ్ఞులకున్[2]—"

---

1. ద్వితీయస్కంధం. 34.
2. ద్వితీయస్కంధం– 23.

అందువల్ల ఈ భక్తకవుల ఆధ్యాత్మిక గానం భౌతిక పునాదిలేనిది కాదు. సాంఘిక రాజకీయ జీవిత వ్యవస్థలపట్ల అసహాయులయిన పేదవాళ్ళ కోపం ఆ ఆధ్యాత్మిక భక్తివిజ్ఞాన గర్భంలోవుంది.

సంపన్నుం డొరుగానలేడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపంజూచు- దరిద్రుడెత్తువడి శుష్కీభూతుడై చిక్కి హిం,
సింపం డన్యుల నాత్మకున్ సములుగా చింతించు- నట్లౌట త
ద్సంపన్నాంధు నకంజనంబు విసుమీ దారిద్ర్య మూహింపగన్[1] –

నారదుడు పాడిన ఈ ప్రతీత గీతాన్ని నిదానంగా పరిశీలిస్తే హింసయొక్క స్వరూప స్వభావాలు అవగతమవుతాయి; సంపన్నులను హింసించి అయినా సంపాదించుకొని తిని బతకాలన్న జీవిత దృక్పథం లేనికాలంలో దరిద్రులకు ఆత్మస్థైర్యాన్ని కలుగ చేయటానికి భాగవతలక్షణ సంకీర్తనం బాగా పనిచేసింది.

"దారిద్ర్యంబు, బాధింప నొరులకార్పణ్య వృత్తి
నడుగ బోవక తనకు తానబ్బినట్టి
కాసు పదివేల నిష్కముల్ గాదలంచి
ఆత్మ మోదించి పుత్రదారాభి రక్ష
యొక విధంబున నడుపుచు[2] —"

బ్రతుకు గలిగినంతకాలం బ్రతుకుతూ ఉండటమే. కావాలని చావకూడదు. అది పిరికితనం. దాన్ని ఎటువంటి పరిస్థితులలోనూ సాహిత్యం సమర్థించదు. పురాణ సాహిత్యం అసలే సమర్థించదు. ఈవిషయాన్ని నిరూపించటానికే కుచేలోపాఖ్యానం. కుచేలుని దారిద్ర్యాన్ని పోతన్నగారు వర్ణించకపోలేదు.

''దుస్సహ దరిద్ర, పీడచే కడునొచ్చి పెదవులు దడుపుచు
శిశువులాకటి చిచ్చుచేకృశించి, మలమలమాడుచు మానసంబెరియంగ,
పట్టెడో రెము మాకుపెట్టుమనుచు. పత్రభాజన ధృతపాణులై తనుజేరి
వేడిన వీనులు సూడినట్లు,య్యెన–[3]" ఇంత అయినా భగవంతుని అనుగ్రహం వల్ల మంచిరోజులు వస్తాయని చెప్పి చావకుండా బ్రతకటాన్ని ప్రోత్సహించటమే కుచేలోపాఖ్యాన లక్ష్యం.

---

1. దశమస్కంధం, పూ–భా. 394.
2. దశమస్కంధం, ఉ. భా. 965
3. ,, ,, 966

అనుగ్రహ మెప్పుడు కలుగుతుందో తెలియదు గనుక తప్పకుండా కలుగుతుందన్న విశ్వాసాన్ని రక్తంలోకి ఎక్కిస్తే ఆ ఆశతో చావకుండా బతుకుతాడు మనిషి కనీసం ఆయుర్దాయం వున్నంత వరకైనా. ఆ మధ్యకాలంలో మరొక మందును కూడా ఎక్కిస్తున్నాడు. తనకు శ్రీకృష్ణుడు డబ్బేమీ యియ్యకుండానే సాగనంపగా కుచేలుడు ఆ విషయమై అలోచించుకొంటూ "దరిద్రుడు సంపదంధుడై కానక తన్నుచేరడు" అని శ్రీకృష్ణుడు భావించి తనకేమీ ఇయ్యలేదనీ అందువల్ల త్వరగా తాను భగవత్సన్నిధికి చేరి పరమపదమైన మోక్షాన్ని పొందుతాననీ. భగవంతుడు శాశ్వతమైన ఆనందాన్ని తన కలా ఇయ్యదలచుకొని, తాత్కాలిక సుఖానికయ్యే డబ్బును తన కియ్యలేదని సమాధానపడ్డాడని వ్రాస్తాడు. ఇంటికి పొయ్యేటప్పటికి అన్నీ సంపదలూ అమరినాయని చెప్పటం సంకల్పించుకొనటం వల్ల వచ్చే సంభావనా సంతృప్తిని కల్పించటం తప్ప మరేమీకాదు. 'అరాచకంబగు మహాభయంబును తొలగింపగోరి'[1] అందుకప్పటి కనుకూలమైన మాటలను చెప్పి జనాన్ని నిలబెట్టటమే భాగవత ప్రయోజనం.

సనాతన భారతీయ తాత్విక దృక్పథంలో ప్రాపంచిక సుఖసౌఖ్యాల అభిలాష కంతగా ప్రోత్సాహంలేదనీ, పారలౌకికమైన మోక్షసుఖ–స్వర్గసుఖ సంపాదనాభిలాష అధికమనీ ఒక అభిప్రాయముంది. అదివట్టి పైకి కనిపించే అర్థమేకానీ, లోతుగా విచారించి గ్రహించవలసిన అర్థాంతరం కాదు. నిజంగా మన పురాణేతిహాసాలలోని కథలనూ గాథలనూ లోనారసి చూడగలిగితే మన ప్రాచీనుల దృక్పథం పూర్తిగా ఐహికమునకు అభిముఖమైనదేకానీ మరొకటికాదు. ముఖ్యంగా సంపదలనూ, అధికారాలనూ మన ప్రాచీనులు నిజంగా అభిలషించారు. అవి లభించనందువల్ల వచ్చిన అభావవిరక్తిని మన పురాణేతిహాసాలలోని భక్తిభావ శబలితములయిన కథలు ప్రదర్శిస్తాయి. అభావాన్ని కల్పించిన భౌతిక వాస్తవికతలను సరిదిద్దుకోగలిగిన స్తోమత లేని మహాజనం విరక్తినాశ్రయించి తలయెత్తుకొని తిరగటానికి చేసిన ప్రయత్న ఫలితమే సాహిత్యరంగంలోని భక్తి వేదాంతభావాభివ్యక్తి లక్షణం. ముఖ్యంగా భక్తి అందులోనూ భాగవతభక్తి ఐహికంగా కష్టనష్టాల భయవిహ్వలతల నుండి విముక్తివి అంటే సర్వసంపదల సుఖసంతోషాల సంప్రాప్తిని కోరి ప్రవర్తిస్తుంది. కుచేలుని కథ ఈ అభిప్రాయాన్ని భగవదనుగ్రహంవల్ల వాస్తవిక సత్యంగా అయినట్లు చెప్పటమేగదా చేసింది? ఈ విషయానికి మరొక నిదర్శనం మాత్రమేకదా

1. దశమస్కంధం, ఉ. భా. 965.

సుదాముని కథ. సాధారణంగా భక్తుల కథలన్నీ పూర్వార్థం వాళ్ళ దురదృష్టాన్ని. సహనాన్నీ, కష్టనష్టాలనూ, అసహాయతనూ, రకరకాలుగా చూపించి ఉత్తరార్థం చివరలో వాళ్ళను అదృష్టం వరించినట్లూ సర్వసౌఖ్యాలూ సంప్రాప్తించినట్లూ సుఖాంతాలుగా ముగుస్తాయి. అలా సుఖాంతాలు కావటానికి వాళ్ళ భగవద్భక్తి కారణంగా ఆ కథలు చెబుతాయి. దీన్నిబట్టి అర్థంచేసుకోవలసిం దేమిటంటే భక్తి వేదాంతం ఉభయ లోకసంపద్వైభవాలను అభిలషిస్తుందని. ముఖ్యంగా ఇహలోక సుఖ సంపదలకు భగవదనుగ్రహం కారణమనీ. దారిద్ర్య దుఃఖాలకు భగవదనుగ్రహం లేకపోవటమే కారణమనీ మన పురాణాలు చెబుతాయి. సంపదలనూ, దరిద్రాలనూ అవలంబించి మాత్రమే సర్వసాహిత్యమూ ప్రవర్తిస్తున్నది. రామాయణంలో శ్రీ రాముని కథ నలాపుంచితే సుగ్రీవుడూ, విభీషణుడూ— వాళ్ళ ప్రవృత్తికి మూలమైన భౌతిక వాస్తవిక రాజ్యలాభ ప్రాప్తిమీది అభిలాషకాదా? భారతంలో కౌరవ పాండవుల ప్రవృత్తికి మూలం ఢిల్లీ సింహాసనం కాదా? భగవదవతారాలయిన రామకృష్ణులు ఎవరికి సహాయం చేశారో వాళ్లదృష్టవంతులు, వాళ్లు ధర్మాత్ములు, వాళ్ళు సాధువులు. వాళ్ళు భగవద్భక్తులు. రామాయణ మహాభారతాలను మించి భాగవతపురాణం భక్తుల సంపద్వైభవాలను భగవంతుని దయాదాక్షిణ్యాల ఫలితముగా ప్రదర్శిస్తుంది.

## IV. 4. భాగవత రసజ్ఞత

రసికభావ విదులకు భాగవతపురాణ ఫలరసాస్వాదన పదవి సంప్రాప్తిస్తుందన్న ప్రతిజ్ఞతో భాగవతరచన ఉపక్రమించబడింది. భాగవతం నిండా వున్నది మనిషిగా పుట్టిన శ్రీకృష్ణుని అతిమానుష కృత్యముల అభివర్ణనమే. శ్రీకృష్ణుని కథ అంత అతిమానుషంగా వుండటాన్ని భక్తులయిన భాగవతులు సంభావించుకొన గలగటం చేతనే రసజ్ఞులవుతున్నారు. భాగవత రసజ్ఞత అంటే భగవంతుని అతిమానుష కృత్యములను సంభావ్యములుగా ఊహించుకొన గలగటమే. అలాంటి వూహాపోహల వల్లనే కృష్ణునికథ మాటమాటకు మరింతమధురంగా అనుభూయమాన మవుతుంటుంది. ఈ అనుభూతి సాహిత్యంలో వున్నంత సామాజికం కాకుండానూ, సంగీతంలో వున్నంత అవ్యక్త మధురంగానూ వైయక్తికంగానూ వుంటుంది. అందుకే భాగవత పాఠకులను రసికభావ విదులనీ, రసజ్ఞులనీ, భక్తులనీ చెప్పటం. మాధవుని— శ్రీకృష్ణుని మానవచర్యలను అతిమానుషాలుగా చేసి చెప్పి అదంతా అతని కపట మానవతా లక్షణమని సమర్థిస్తుంది భాగవతం. మనిషి తనకంటె మహాశక్తిసంపన్న

దైన మరొకవ్యక్తిని ఎందుకు అసలు ఊహించవలసి వచ్చింది? ప్రకృతి శక్తులమీద తనకు ఆధిపత్యం లభించని కాలంలో మొట్టమొదటి మనిషికా ఊహావచ్చి వుంటుంది మనిషికి వచ్చిన ఆ వూహనుండే భగవంతుడు పుట్టాడు.

ఆ పిమ్మట మనుషులలో కొందరికి ప్రకృతి శక్తులమీద ఆధిపత్యం లభించటం, వారు మిగిలినవారి మీద అధికారం చెలాయించటం మొదలై అభివృద్ధి కావటంలో అధికార దౌర్జన్యాలకు గురి అవుతున్న మహాజనం, అధికారులను ఎదుర్కొనలేని దుర్బలస్థితిలో తమ ఆవేదనను వ్యక్తంచేస్తే ఆలించటానికి ఒకడున్నాడన్న సంతృప్తి కొరకు భగవంతుణ్ణి ఆశ్రయించి అతణ్ణి అనేక రకాలుగా పెంచి పెద్దచేసింది. భగవంతుని అతిమానుష శక్తిసామర్థ్యాలను నిదర్శన పూర్వకంగా కథలుగాచేసి చెప్పటం ద్వారా తమమీద అధికారం చేసే మానవ ప్రభువులను కించపరచిన ఒక తృప్తినికూడా మహాజనం లోపలలోపల పొందటానికి భక్తి రచనలు వసతి కల్పించాయి. "ధనము పీధిబడిన దైవవశంబున, నుండు పోవుమూలనున్నదైన, అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమున చచ్చు." [7-49] ఈయబి ప్రాయం నడుస్తున్న సాంఘిక భద్రతమీద విశ్వాసమున్నవాడు చెప్పేదికాదు. చస్తే చస్తాం బ్రతికితే బ్రతుకుతామన్న మొండి పైఖరిని భక్తులు అవలంబించి భగవద్భావానికి రూపురేఖలు దిద్దుకొంటూ ప్రజలకు మోక్షాన్ని నిర్భయత్వాన్ని అదర్శంగా ప్రబోధించారు. ఈప్రబోధాన్ని అందుకోవటమే భాగవత రసజ్ఞత. మనిషికి మానుషం భయం కల్పించటం చేత భయాంపితుడు అతిమానుషాన్ని అవలంబించి అభయాన్ని పొందటానికి వీలుగా భాగవత మవతరించింది. ఆవిధంగా అతిమానుషాన్ని అవలంబింపజేసే ప్రబోధమే భక్తి ఉద్యమం.

అసలు భక్తి ఉద్యమంలోని అభ్యుదయ లక్షణమేమిటంటే— అది శివభక్తి అయినా విష్ణుభక్తి అయినా— అనేక అంతస్తులుగా స్థాయిభేదాలతో ఉన్న సాంఘిక జీవితవ్యవస్థలో మానవులందరినీ సమానస్థితికి తీసుకొని రావటానికి కనీసం భావన దశలో ఒక సైద్ధాంతిక ప్రాతిపదికను సిద్ధంచేయటమే. దానవదైత్య భుజంగమ మానవ గంధర్వ సురసమాజంలో నెవ్వరైనా[1] సరే అంటే ఏస్థాయిలోవున్నవారైనాసరే ఒక్క హరిభక్తిచేత ధన్యత— మోక్షము— అన్న ఏకైక సమస్థితిని పొందుతారని భాగవతం ప్రచారం చేస్తుంది. శివభక్తియే ఆపని చేస్తుందని శివ

1. సప్తమస్కంధం. 2.2

పురాణం చెప్పవచ్చు. శివవిష్ణు భేదభావాన్ని కాస్త పక్కకుపెట్టి ఆలోచిస్తే భక్తి ఉద్యమం భావవాద తాత్వికదృక్పథం నుండే అయినా ఒక సాంఘిక జీవిత ఆచరణ నుండి ఒకరకమైన సమభావనను సామాజికులలో సంపాదించటానికి ప్రయత్నం చేసినట్లు స్పష్టంగా కన్పిస్తున్నది కదా! అంతవరకూ అది అభ్యుదయ లక్షణమే. అయితే అది శాస్త్రీయమా కాదా అన్న మీమాంస ఎటూ వుంటుంది. అయినా చారిత్రికంగా వర్ణాశ్రమాచార స్థాయిభేదాల వాస్తవికత నుండి భిన్నంగా ఒక సమభావాన్ని పెంపొందించటానికి భక్తి ఉద్యమం ఎంతో చేసింది. ఆ చేయటంలో భాగమే వర్ణాశ్రమాచారాలను పాటిపాటింపును నిరర్థకంగా భాగవత గ్రంథం అక్కడక్కడా చెప్పటం[1]. పాలకవర్గాల వారిదికాదు భక్తి ఉద్యమం. పాలితులది, బడుగులది. తమలాగా మనుషులయి యుండి తమను హింసిస్తున్న పాలకులను మనుషులుగా గుర్తింపటం, వారివల్ల తమకు కష్టనష్టాలు సంభవిస్తున్నాయని అనుకోటం నుండి మహాజనాన్ని తప్పించటం కొరకు భక్తి ఉద్యమాలు అన్నింటికీ దైవాన్నేకారణంగా చెప్పి 'అమరులయిన దనుజులయిన నరులైన నెంత నిపుణులయిన నెవ్వరయిన దైవికార్థచయము తప్పించగాలేరు[2]' అని విష్ణుదైవతము యొక్క ఆధిక్యాన్ని. విష్ణుభక్తి వైభవాన్ని ప్రశంసిస్తుంది భాగవతం.

భాగవత రాసిక్యమంటే విభావానుభావసంచారీ సంయోగ నిష్పన్నమైన రస భావానుభవం కాదు. తిక్కన్నగారు కావ్యరసవాదులు. పోతన్నగారు భగవద్భాగవత రసపోషణ విషయంలో అందెవేసినచేయి. భగవంతుడే ఆలంబనవిభావం. అందువల్ల భక్తుడికి ఆయనేకాపేపు నాయకుడు. మరికాసేపు నాయిక: ఆయనే ఉద్దీపన విభావం. ఆయనయందే అనుభవమూ వుండదు. ఆయనయందు లేనివానినన్నింటిని భక్తుడున్నట్లు భావించుకొనటంద్వారా తన్మయాన్ని చెందుతాడు. ఆతన్మయతను పోతన్నగారు మాట మాటకు మరింత అధిక మధురంగాచేసి వర్ణించుటచేత భాగవతంతో ప్రజానీకం తాదాత్మ్యాన్ని భజించ గలుగుతున్నది. దీనికి కారణమేమిటంటే ప్రజల ఆశలకు, అశక్తతలకు, ఆర్తికి, జిజ్ఞాసకూ భక్తుల జీవితాలు సన్నిహితంగా వుంటాయి. అందువల్ల భక్తులతో ప్రజలకు జీవితం సన్నిహితంగా వుంటుంది. భక్తుల జీవితాలలోని లోటుపాట్లన్నిటికీ భగవంతుని కరుణ ఒక్కటే శరణ్యంగాచూపించే భాగవత కథాశ్రవణం చేత ప్రజలకు భక్తులజీవితాలతో వున్నతాదాత్మ్యంచేత భగవంతుని కరుణకుతాముకూడా

1. సప్తమస్కంధం, 244.
2. " " 402.

భాజనులు కావటాన్ని వాళ్ళు భావించుకొంటారు. అందువల్ల ఒక సంతృప్తినీ ఆనందాన్నీ పొందుతారు. ఆ కారణంగానే భాగవతం ఈనాటికీ ప్రజలకు దగ్గరగా వుంది. అంటే ప్రజలజీవితాలు అయిదువందల సంవత్సరాల క్రితం ఏ అవసరాలతో సతమతమవుతున్నవో ఈనాడుకూడా అలాంటి అవసరాలతోనే ఇంకా సతమతమవుతున్నాయన్నమాట. మనిషిని మనిషినమ్మి బతకటానికి అవకాశం లేనిపరిస్థితులున్నప్పుడు, చచ్చినట్లు బ్రతకటం ఇష్టం లేనప్పుడు, పరిస్థితులను చక్కజేసిపెట్టే ప్రభువులు కనిపించనప్పుడు విదేహముక్తిని భావించుకొంటూ అయినా చావకుండా బతకటం తమకు లాభం కాకపోయినా ముందుతరాల వాళ్ళకైనా ఒక హెచ్చరికగా వుంటుందని భాగవత మతం ప్రజల బానిసజీవిత వాస్తవికతను ఆధ్యాత్మమయం చేసి భాగవత దాస్యజీవితాన్ని ఆదర్శంగా సమున్నతీకరించి కీర్తిస్తుంది. ఇక్కడ సాహిత్యం జన జీవితం పునాదులతో వ్యతిరేక సంబంధం కలిగివుంటుంది. అన్వయ వ్యతిరేక ముఖంగా పనిచేసే ఈ సాహిత్యంలోని తిరస్కృతవాచ్య వస్తుధ్వని రచనావిధానాన్ని చారిత్రిక దృక్పథం నుండి అధ్యయనం చేయటంవల్ల భౌతిక వాస్తవికత యొక్క విశ్వరూపం అవగాహనకు వచ్చే అవకాశముంది. హాస్య రచనలు ఎంతటి ఆర్తిని గర్భంలో ఇముడ్చుకొని వుంటాయో ఆధ్యాత్మిక రచనలు అంతకంటె ఎక్కువ ఆర్తిని ఇముడ్చుకొని వుంటాయి. దాని ప్రతీతికొరకే మన చారిత్రిక దృక్పథం నుండి అధ్యయనం.

## IV. 5. మధుర భక్తి

మధురభక్తి అనేది ఒక విచిత్రమైన క్రీడా శృంగారం. ఆలంకారికులు రస భావాలన్నింటిలోనూ శృంగారమొక్కటే మధురమైనదనీ అందువల్లనే అది ప్రహ్లాదన రసమనీ చెబుతారు. గోపికలు శ్రీకృష్ణుని భజించిన విధం— శ్రీకృష్ణుడు వారితో వ్యవహరించిన తీరు శృంగార క్రీడకాదు. అయితే అది శృంగార రసమనబడుతుంది. అది క్రీడాశృంగారం, అందువల్ల అందులో రసంకాక భావం మాత్రమే వుంది. ఇక్కడ ఒక ప్రశ్న అడుగవచ్చు. ఆలంబన విభావములయిన గోపికలకూ శ్రీకృష్ణునకూ ఉభయులకూ అది క్రీడాశృంగారమేనా? అని. శ్రీకృష్ణుని విషయంలో మాత్రమది క్రీడయే. ఎందువల్లనంటే ఆయన లీలామానుష విగ్రహుడు. మానవ ప్రకృతిని అభినయించటమే చేస్తాడాయన. గోపికలు ఆలాకాదు. వాళ్లు మనుషులు,

అభినయించే వానికి తన పూర్వస్థితి జ్ఞానముంటుంది. అనుభవించే వాళ్ళకుండదు. అభినయించేవాడు భావనిష్ఠుడు. అనుభవించేవారు రసప్రవిష్టులు. గోపికలు మనుషులు గనుక తమ పూర్వస్థితిగతుల యెఱుకలేకుండా అనుభవించటం మాత్రమే చేయగలరు. "గతజన్మంబుల నేమి నోచితిమొ - యేచింతా రతింబ్రొద్దు బుచ్చితిమో - యేసిద్ధ ప్రదేశంబు ద్రొక్కితిమో[1]-" అని శ్రీకృష్ణదర్శన స్పర్శనాదులకు కారణాలను వెతుక్కోవలసిన స్థితిలోనే వుంటారు గోపికలు. గోపికలకు శ్రీకృష్ణుని ఆలంబనం విషయంలో కామమోహానురాగా లున్నాయి. వారి విషయంలో శ్రీకృష్ణునకు అవి లేవు.[2] ఉన్నట్లు నటిస్తాడు. కేళీచాతురీధుర్యుడు కదా![3] ఆలంకారికుల మతం ప్రకారం చెప్పాలంటే శ్రీకృష్ణునకు కూడా గోపికలను చూస్తే మారవికారం కలగాలి. కలుగదు. అతను వేణునాదం పూరిస్తే చాలు వాళ్ళకు కలుగుతుంది. వాళ్ళు పంచబాణ భల్లభగ్న హృదయులవుతారు. శ్రీకృష్ణుడు మగడుకావలెనని వాళ్ళు కాత్యాయనీ నోముకూడా నోచారు. శ్రీకృష్ణునకు గోపికలు కామ మోహములచేత పరతంత్రులు. "మనో జాగ్నిచే బొగులం జాలము కౌగిలింపుము మముం బుణ్యంబు పుణ్యాత్మకా[4]" ఈ రకమైన దీనాలాపములతో గోపికలు మనుష్యులు గనుక చిత్రమూర్తి అయిన శ్రీకృష్ణుని రాసక్రీడలకు ముందు వెనుకలందు కష్టసుఖాలు అనుభవించారు. శ్రీకృష్ణుడు యోగీశ్వరేశ్వరుడు- ఆత్మారాముడు అయి వారలను "హాసంబుల కరతలవిన్యాసంబుల దర్శనముల నాలాపములన్ రాసశ్రాంతుల చేసెన్ మన్ననలు కరుణసేసి"- "ఇంద్రియ స్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె[5]-" ననటంచేత శ్రీకృష్ణుని అభినయమేగదా గోచరిస్తున్నది. అందువల్ల మనుష్యులయిన గోపికలకు భగవంతుడైన శ్రీకృష్ణుని యందలి కామోత్కంఠత శృంగారముగాక భక్తి అయింది. మధురభక్తి అంటే అది దేవతా విషయికమైన రతి భావమేకాని రసంకాదు. అందువల్ల మధురభక్తి లోని భక్తిభావమేగానీ రసంకాదు కాబట్టి భాగవతం ఆయితే భావకావ్యం అవుతుంది కాని రసకావ్యం కాదు. కథానుస్యూతివుండదు గనుక పురాణాల్లో ఎటూ రసప్రసక్తి వుండదు. భాగవత పురాణంలో ఆలంబన విభావాలలో నాయికలు మాత్రమే మానవ ప్రకృతులు. నాయకుడు భావరూపుడు భావరూపుడైన లోకనాయకునితో విరహమైనా

---

1. దశమస్కంధం పూ. భా. 278
2. " " 533
3. " " 542
4. " " 993.
5. దశమస్కంధం, పూ. భా. 1001, 1095, 1101.

రతియైనా భావాత్మకమే కదా! అందువల్లనే భాగవత మంతటిలో కాకపోయినా శ్రీకృష్ణుని లీలావిలాస కథా విషయంలోనైనా భావకావ్య లక్షణమే వుందనటం[1]. భాగవత దశమస్కంధానికి ఇంత ప్రాచుర్యం రావటానికికూడా భక్తినామక శృంగార భావం ప్రధానమై అసంలక్ష్య క్రమవ్యంగ్యంగా భావధ్వని స్ఫురణ ఉండటమే కారణం. సంచారి భావాలయొక్క ఉద్రిక్తలక్షణమే ప్రధానంగా వుండటం చేతనూ, శ్రీకృష్ణపరమాత్మ విషయికమైన కామోత్కంఠత ఉద్బుద్ధమాత్రంగానే వుండిపోవటం చేతనూ మధురభక్తిభావరూపమేగానీ రసరూపం కాజాలకపోతున్నది. శ్రీకృష్ణదేవతా విషయికమైన గోపికాదిమనుష్య ప్రకృతుల రతిభావం భక్తి లక్షణలక్షితం కావటంచేత అనౌచిత్య ప్రవృత్తికి పాల్పడక అభాసస్పర్శనుకూడా పొందకుండా కేవలం భావాత్మకత్వరూపమైన కావ్యత్వాన్ని మాత్రమే కలిగివుంది. భక్తి అంటేనే అది గురువుల యందో దేవతలయందో మాత్రమే ప్రవర్తించేది గనుక అది భావమే. భగవంతుడు ప్రియుడుగానూ భక్తులు ప్రేయసులుగానూ ఉన్నదశలో ప్రవర్తించే ప్రేమభావం మధురభక్తిగా చెప్పబడుతున్నది. శృంగారరస గుణయోగిత్వ లక్షణలక్షితంగా వుండటం చేత మధురభక్తికి రసత్వాన్ని చెబితే ఔపచారికంగా చెప్పవచ్చునుగానీ వట్టి భక్తికి ఏ రసగుణ యోగిత్వమూ వుండదు కనుక ఔపచారికంగా కూడా రసత్వం పట్టదు.

## IV. 6. ఆత్మాశ్రయ కవితారీతి

పోతన్నగారిది ఆత్మాశ్రయ కవితారీతి కవిత్వం. భాగవతాన్నంతా ఆయన అలా వ్రాశాడు. భాగవతంలో వక్తలయిన భాగవతులందరితోనూ ఆయన భాగవత నైష్ఠికుడు కావటంచేత తాదాత్మ్యాన్ని భజించగలిగాడు. భాగవతంలో కథకులుగా ప్రవక్తికివచ్చే నారదుడు, మైత్రేయుడు, విదురుడు, ఉద్ధవుడు, కపిలుడు మొదలయిన విజ్ఞాన ఘనులంతా కూడా భక్తి భావ ప్రబోధకులే గనుక వీరితోనూ పోతన్నగారికి తాదాత్మ్యాన్ని భజించటానికి వీలయింది అది కారణంగా భాగవత పురాణంలోని హరి

---

1. ఆధునిక యుగంలో వచ్చిన భావకవిత్వమనేది కూడా ఇటువంటిదే. ఇక్కడ ఆలంబన విభావాల్లో నాయిక నాయకునకు భావరూపమేగాని భౌతికరూపం కాదు, నాయకముఖంగా వ్యక్తమయ్యే సంచారి భావోద్రిక్తతవల్ల భావకవిత్వం రస కవిత్వం కాజాలకపోతున్నది.

నామస్తుతి భాగమంతా పోతన్నగారు ఆత్మాశ్రయ రీతిలో తన పంచ ప్రాణముల చేతనూ సౌభాగ్యవంతం చేసిపెట్టాడు. ప్రారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభ దూరుండనై (1-70) ఆనందాశ్రులు కన్నులన్ వెడల రోమాంచంబుతో తత్పద ధ్యానారూఢుడనైన నాతలపులో నద్దేవుండు తోచె (1 86) అట్టి భగవంతుడవ్య యుండచ్యుతుండు మానసోదిత నవపుష్పమాలికలను, మంజునవరస మకరంద మహిమపుట్టి శిష్టహృద్భావలీలల జేయుగాత (2-68) అన్యకథా కలాపము లహర్ని శమున్ పఠియించి చాల మాలిన్యము నాత్మశోభన విలీనత నందు మదీయ జిహ్వా సౌజన్యమునందె నేడు (3-223) ఈ విధంగా భాగవతం పద్యాలను ఎన్నింటినైనా ఉదాహరింపవచ్చు. శుకుడు నారదుడు మైత్రేయుడు మొదలయినవాళ్లు పలికిన పలుకులన్నీ పోతన్నగారి వవుతాయా అంటే కావా అనటంవల్లనే దానికి సమాధానం వస్తుంది.

పరమార్థభూతమైన మోక్షమును అంటే ఆత్మపదార్థమును పొందగోరిన భక్తుడు అన్యచింతనం మాని ఆత్మపదార్థాన్నే ఆశ్రయిస్తాడు. రచనా వ్యాపారం ప్రవృత్తి కదా! ఇందులో అత్మాశ్రయత ఎట్లాగంటే పోతన్నగారి పద్యాన్నే చూద్దాం. ''హరి నామస్తుతిసేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ, సురుచిభ్రాజితమైన మానససర స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీహరినామ స్తుతిలేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీకరమైయుండదు-'' ''అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపాప పరిత్యాగము సేయు, కావున హరిన్ భావించుచున్ పాడుచున్ జపముల్ సేయుచు వీనులన్ వినుచు అశ్రాంతంబు కీర్తించుచున్ తపసుల్ సాధులు ధన్యులౌదురు-'' హరి నామస్తుతి అంటే దానివిస్తృతి ఎంతో రెండవపద్యంలోచెప్పాడు. హరిపరమార్థము. భావించటం, పాడటం, జపం చెయ్యటం, హరికథలు చెబుతుంటే వినటం, ఎప్పుడూ హరినామకీర్తనం చేయటం. హరినితప్ప అన్యమును గూర్చి చింతించకుండా వుండ టానికి ఏం చెయ్యాలో అది చెయ్యటమంతా హరినామస్తుతి చెయ్యటమే, చెయ్యటం వల్ల ప్రయోజన మేమిటయ్యా అంటే చేసిన పాపాలన్నీపోతాయి. చేసినవాళ్ళు ధన్యు లవుతారు. ధన్యులు కావటమంటే పునర్జన్మ పొందకుండా పోవటం. హరినామ కీర్తనం చేసుకోటం ధన్యుడు కావటం అన్న రెండు క్రియలూ వ్యక్తిగతాలు. ప్రతి మనిషి ఎవడికివాడుగా మొదటిపని చేసుకొనటం ద్వారా రెండవదైన ప్రయోజనాన్ని సంపాదించుకోవాలి. ఇంత వైయక్తిక ప్రయోజనాన్ని ఉద్దేశించి భాగవత గ్రంథ రచన కుపక్రమించిన పోతన్నగారు ఆత్మాశ్రయ రచనారీతినిగాక మరొక పద్ధతిని అవలంబించలేదు. అవలంబిస్తే ఈగ్రంథ రచనా ప్రయోజనం ఈడేరదు. భాగవత

గ్రంథానికి తగిన రచనారీతిని అవలంబించగల రచయితగా పోతన్నగారు లభించాడు గనుకనే తెలుగులో భాగవతం అనన్య సామాన్యంగా జయించుకొని వస్తున్నది. తెలుగుభాష వస్తుతత్వ ప్రదర్శనకు ఎంత అనుకూలమో కవిత్రియం వారు నిరూపించిపోతే, ఆ భాష ఆత్మాశ్రయ కవితారీతికి కూడా ఎంత అనుకూలమో ప్రయోగించి చూపించాడు పోతన్న. ఆత్మాశ్రయ రచనారీతి ఆత్మకథలాగా వస్తున్నపద్ధతిగాదు. ఆత్మకథలో రచనకు రచయిత తానేవస్తువు. ఆత్మాశ్రయ రీతిలో రచయిత తనకొక వస్తువును ఆలంబనంగా చేసుకొని దాన్నిగురించి చేసే నిరంతర చింతనంవల్ల అది తన మెదడులో ప్రతిఫలించే స్థితిలో అనుభవగోచరమైన దాని స్వరూప స్వభావాలను శబ్దార్థరచనారూపానికి దించుతాడు. ఇందులో రచయిత కాశ్రయమైనవస్తువు అతనికి అనుభవ గోచరమైన రూపంతోనేవుంటుంది. ఒకవిధంగా ఆత్మాశ్రయకవితారీతి అన్నది రచయిత సొంతవిషయం లాంటిది. అతను కవీ రచయితా కావటంవల్ల ఆతనిసొంత విషయమైనా మనం కల్పించుకొని ప్రవేశించటానికి ఈమాత్రమైనా వీలయిందికానీ లేకపోతే అసలేలేదుగదా। ఈ ఆత్మాశ్రయరీతిరచన వ్యక్తిని ప్రతిబింబించినట్లుగానీ ప్రతిఫలించినట్లుగాగానీ ప్రపంచాన్ని ప్రతిబింబించదు ప్రపంచంతో సంబంధంలేనట్లే వుంటుంది ప్రపంచంతో సంబంధంపెట్టుకొని విచారించటం భౌతికజిజ్ఞాస. ప్రపంచంతో సంబంధం పెట్టుకోదల్చుకోకుండానూ, ఉన్నసంబంధాన్ని తెంచుకొని పోవాలనుకొంటూనూ చేసేవిచారణ బ్రహ్మజిజ్ఞాస. దూరంగానైనా ఆత్మాశ్రయ రచనారీతికి బ్రహ్మజిజ్ఞాసతోవున్న సంబంధం భౌతికప్రపంచ జిజ్ఞాసతోలేదు ఈలోకంలో మళ్లీపుట్టవద్దనుకొన్నవాడు చేసేఆలోచనలో ఈలోకంగురించి ఏమీవుండదు. వుంటే దీనిదుఃఖభూయిష్ట లక్షణం వుంటుంది. పోతన్నగారి భాగవత ఆత్మాశ్రయ రచనారీతిలోవున్న గొప్ప లక్షణమేమిటంటే ఈ ప్రపంచంలోని కష్టనష్టాలను భగవంతుడవతరించి రూపుమాపుతాడనీ, అందువల్ల సుఖంగా హరినామ సంకీర్తనం చేసుకొంటూ మోక్షాన్ని పొందవచ్చుననీ చెప్పటం అర్థాంతరాలయిన భావాలలో ఎంత అపూర్వతవున్నా వాటివెంట బడిపోటంగాక. వాటివిబట్టి వాస్తవికతను గ్రహించటానికి వాస్తవాలను సరిజేసుకోటానికీ చేసే ప్రయత్నంవల్ల ఆత్మాశ్రయ రచనారీతి భాగవతతత్వం మానవతా దృక్పథాన్ని ప్రోదిచేయగలిగేటట్లు చూచుకోవాలి. ఆత్మాశ్రయత అన్నామని భాగవతంలోని సాధుపాత్రల లక్షణాలన్నీ పోతన్నగారివే అని బయలుదేరగూడదు. ఆత్మాశ్రయత అన్నదొక రచనారీతి. సాధువులుగాని పాత్రల విషయంలోనూ రచయితలు ఆత్మాశ్రయ రచనారీతి నవలంబించవచ్చు. అప్పుడా దుష్టలక్షణాలన్నీ కూడా రచయితవే అని చెప్పవలసి వస్తుంది. అది పద్ధతికాదు. విశ్వనాథ సత్యనారాయణగారు భావకవితాయుగపు ప్రస్థాన గ్రంథరచయిత కావటంచేత ఆయన తరువాత రామాయ

కాన్ని వ్రాసినా ఆయుగపు ఆత్మాశ్రయ రచనారీతినే అవలంబించాడు. అందువల్లనే కల్పవృక్షం తెలుగులోవున్న అన్ని రామాయణాలనూ త్రోసిరాజన గలిగింది. కల్ప వృక్షంలోని రావణాసురుని పాత్రలో సత్యనారాయణగారు కనిపిస్తున్నారనిచెప్పేవాళ్లూ చూచేవాళ్ళూ వున్నారు. అది కవిగా విశ్వనాథ అవలంబించిన ఆత్మాశ్రియ రచనారీతి విషయంలో ఆయన సాధించిన పరిపక్వతకు నిదర్శనమేకానీ— రావణాసురుని లక్షణా లన్నీ విశ్వనాథవని చెప్పటానికికాదు సరిగ్గా పోతనగారివిషయంలోనూ అదే జరిగింది. అందువల్ల ప్రహ్లాదుడూ ధ్రువుడూ పోతన్నగారేననీ అజామీళుడు మాత్రం పోతన్న గారు కాదనీ చెప్పేమాటలు సాహిత్య విషయంతెలిసి చెప్పేమాటలుకావు. ఆత్మాశ్రయ రచనారీతి కవులను అర్థం చేసుకోటంలో పాఠకులు అర్థాలకూ అర్థాంతరాలకూ తేడా చూడటంలో ఎక్కువ శ్రద్ధాళువులై ప్రవర్తించవలసి వుంటుంది.

## IV. 7. హరినామ స్తుతిసేయు కావ్యము

పోతన్నగారు భాగవతాన్ని నిజానికి వినోద కాలక్షేపాన్ని కల్పించాలని వ్రాయ లేదు. అందువల్ల తానేదో కీర్తి ప్రతిష్ఠలు డబ్బు సంపాదించుకోవాలని వ్రాయలేదు. తనకు తన సంప్రదాయ విజ్ఞానం అందించిన మహోన్నతమైన ఆదర్శ పురుషార్థం మోక్షం, దాన్ని తాను అందుకోవాలని అందుకు భాగవత రచన సాధనమని అను కొన్నాడు. తను సాధనంగా గ్రహించినదాన్ని తన తెలుగు మహాజనం కూడా సాధనంగా గ్రహించి జన్మరాహిత్యాన్ని సాధించాలనుకొంటే వాళ్లకందుబాటులో వుండే టట్లుచేశాడు భాగవతాన్ని. ఉన్నత పదం శ్రీ కైలాసం. అటువైపుగా తాను నడిచి తన తెలుగు ప్రజలను నడపాలనుకొన్నందువల్లనే పోతన్న తెలుగులో భాగవతం వ్రాశాడు. ఆవిధంగా శ్రీకైవల్యపదం చేరటానికి భావనామయమైన ఒక నైతిక సాధనరూపమైన ఆయుధాన్ని భాగవతాన్ని తెలుగులో సృష్టించాడు.

ధర్మార్థకామములు సన్యసించిన పరీక్షిత్తునకు మోక్షపురుషార్థ సాధన మార్గోప దేశంగా ప్రవర్తించిన గ్రంథం గనుక భాగవతానికి మోక్షపురుషార్థమే పరమ తాత్పర్యం. అందువల్ల ఆ మహాపురాణంలో ధర్మార్థకామాలు ప్రవర్తిస్తున్నట్లు కనిపించినా అవి మోక్షం లక్ష్యంగా వుండవలసినవే తప్ప అవి స్వతంత్రాలుగా వుండ వలసినవి కావు. ఎక్కడైనా మోక్షదృష్టి లేకుండా గనుక అవి ప్రవర్తిస్తున్నట్లు

కనిపిస్తే భాగవత రచయిత పోతన్నగారు పొరపాటుబడి అపనిచేస్తున్నారని చెప్పటమే ధర్మంగానీ, భాగవతం ధర్మార్థకామాలను కూడా స్వతంత్ర పురుషార్థాలుగా ప్రతిపాదిస్తుంది అనిమాత్రం చెప్పట ధర్మంకాదు. కాదు అంటే అది భాగవత మహాపురాణ చారిత్రిక అధ్యయన విధానం కాదు అని. మోక్షమెలా సాధ్యమయ్యా అంటే హరి మయముకాని ద్రవ్యములేదన్న భావముతో హరిభక్తి కలిగి ప్రవర్తించటం వల్లనే సాధ్యం. హరిభక్తియొక్క రూపాలు ఏలావుంటాయో అవన్నీ కథలుగా గాథలుగా భాగవతం నిండా వర్ణింపబడి వున్నాయి. భయం నుండి విముక్తియేమోక్షం. భయ రహితత్వమే మోక్షం. భయకారణాలను భౌతికంగా తొలగించుకొనలేని బడుగులకు ఆధ్యాత్మిక ధైర్యాన్ని ప్రసాదించే సాధనంగా మోక్షభావం పెంపొందించబడింది. భావరూపమైన మోక్షపదవి ప్రాప్తికి హరినామస్తుతి ఏకైకమార్గంగా భాగవతం ప్రతిపాదిస్తుంది.

> హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజ హంసావళీ
> సురుచి భ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుగొందు- శ్రీ
> హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
> కరమైయుండ దయోగ్య దుర్మలినవత్కాకోల గర్తాకృతిన్.
>
> (ప్రథమస్కంధం. 59.)

'అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రా లాపముల్ సర్వపాప పరిత్యాగము సేయు'- సనిగూడా హరికథకులను భాగవతం వెన్నుతట్టి ముందుకు పొమ్మంటుంది.

హరినామస్తుతి వస్తువుగాగల కావ్యమే కావ్యమనీ, ఇతరముకాదనీ, నొక్కి వక్కాణిస్తూ భాగవత పురాణాన్ని రచించిన పోతన పాక్షికధోరణి కలవాడుకదా అంటే కాదనటానికి వీలులేదు[1]. పాక్షికధోరణి ప్రజల విషయంలోలాగానే రచయితల విషయంలోనూ వుంటుంది. దాన్ని ఒక దోషంగా పరిగణించవలసిన అవసరంలేదు. అయితే ప్రజలతో రచయిత ఎక్కడ విభేదిస్తాడంటే వైయక్తికమైన స్వార్థప్రయోజనం నుండి రచయిత పైదొలగ గలుగుతాడు. ప్రజలు అలా పైదొలగలేరు. అక్కడే రచయిత భేదిస్తాడు. రచయితకు కులమతతాత్విక దృక్పథాల విషయంలో మమకారం వుండవచ్చు. దేవతల విషయంలో వుండవచ్చు. రాజకీయవర్గ దృక్పథాల విషయంలో వుండవచ్చు. మమకారం స్వార్థంకంటె పైమెట్టు. అందువల్లనే రచయితలు

1. పక్షపాతము శార్ఙ్గిభక్తులంద. దశమ- పూ. భా. 1610.

ప్రజలను ముందుకు నడిపించే బాధ్యతగల వాళ్ళుగా సంభావింపబడటం. అయితే రచయితలు ప్రవర్తించటానికి ప్రేరకమైన పాక్షికత దానంతట అది దోషంకాదని అంగీకరిస్తూ అది సాధించే విస్తృత ప్రయోజనపు విలువను అంచనాకట్టటం మాత్రం అవసరం. పోతనగారు హరినామ స్తుతిపరమైన కావ్యం వ్రాయటం పాక్షికధోరణి అయినా దోషంకాదు. ఎందుకంటే హరినామస్తుతి ప్రయోజనాన్ని ఆయన కొందరి వరకే పరిమితం చేయలేదు. ఆయన మోక్షంవైపు మొగ్గాడు. అలా తాను మొగ్గి తెలుగు ప్రజలను అటువైపు మొగ్గేటట్లుచేసే ప్రయత్నం ఆ పదిహేనవ శతాబ్దంలో చేయటం ఎంతవరకు సమంజసమని మనమాలోచించవచ్చు. అలాంటి ప్రయత్న మాయన చేయటానికి దోహదంచేసిన పరిస్థితులను పరిశీలించవచ్చు. ఆయన భాగవత గ్రంథ రచనద్వారా తెలుగులను ఐహికమునుండి ఆముష్మికమునకు మళ్ళించటంలో సమకాలంలో ఏమైనా ప్రయోజనం సాధింపబడితే ఆయన చేసిన పని సమంజసమైన దనే చెప్పాలి. మనిషి అసలు మోక్షపురుషార్థం గురించి ఎందుకంతగా తహతహ లాడవలసి వచ్చింది అన్నదికూడా విచారణీయమే. మళ్ళీ జన్మవద్దు బాబోయి అంటున్నాడంటే ఈజన్మ ఎంతకష్టభూయిష్ఠంగావుందో అర్థం కావటంలేదా? 15వ శతాబ్దంలో తెలుగు ప్రజాజీవితం ఇకమళ్ళీ మేమీదేశంలో పుట్టకూడదు అని అనుకొనేటంత దుర్భరంగా వుండి వుంటుందా?

అసలు సంస్కృత భాగవతం 15వ శతాబ్దానికి ఎంతో ముందటిది గనుక ఇహలోక జీవితానికి సంబంధించిన విరక్తిభావం, పరలోకానికి సంబంధించిన ఆసక్తి భావం భారతదేశంలో ఎప్పటినుండో వున్నవి. ఆ భావాల ప్రచార అవసరం 15వ శతాబ్దంలో తెలుగు జీవితానికి కలిగింది. పోతనగారు భాగవతాన్ని తెలుగులో వ్రాసి ఆ అవసరాన్ని తీర్చాడు.

# పోతన భాగవతం – భూమిక

మాదిరాజు రంగారావు

సర్వ భారత దేశంలో ఆయా ప్రాంతీయ భాషల్లో భిన్నకాలాల్లో భిన్న రీతుల్లో భాగవతం ఆవిష్కృతమైంది. సంస్కృత భాషలోని పరమార్థాన్ని దేశభాషల్లోకి ఆయా సాంస్కృతిక వాతావరణాలతో పరివర్తనం చేసి ప్రజలకు అందివ్వడం ప్రధానమైన ఉద్దేశం ఈ మహాప్రయత్నంలో రచయిత వస్తుగతమైన తాదాత్మ్యాన్ని పొందడాన్ని బట్టీ ఆవిష్కృతిలో వైవిధ్యాన్ని పొందాయి. ఇది సహజంకూడా. అనువాద భాగాలను పరామర్శించేప్పుడీ అంశాన్ని మరవకూడదు. ఇది చారిత్రక సాంస్కృతిక కారణాలవల్ల ఆ ప్రాంతంలోని భాషా సాహిత్య పరిణామంలో భాగమైంది. దీనికి ఒక దేశభాష రూపొందిన సాహితీమార్గం, స్థానికమైన ఆలోచనాధోరణులూ విశ్వాసాలూ రచయిత వ్యక్తిత్వమూ అన్నీకలసి పనిచేస్తాయి. తెలుగు దేశంలో వెలసిన పోతన భాగవతం ఈ దృష్టితో సాహిత్య పరంపరలో భాగంగా దేశసంస్కృతీ బింబంలో కళారూపంగా నిలచింది.

కవిత్రయం సాహిత్యమార్గం పోతనకాదర్శం. నన్నయ నుండి విశ్వనాథ వరకూ సంప్రదాయ మార్గంలోని మహాకవులందరి లక్ష్యంలో పరమమైన వస్తు సాంతత్యం ఉంది. ఇది తెలుగుజాతి ఆలోచనా శిఖరాన్నీ, అనుభూతి గాంభీర్యాన్నీ స్పృశిస్తూ లౌకికమైన జీవనతలంపై ప్రయాణాన్ని సాగించేది. అదృష్టవశాత్తు తెలుగులో. సాహిత్యం ఆరంభమూ దీన్ని అందుకున్న తిక్కన రచన ఆపైన పరిణామమూ పరతత్త్వాన్ని ఉన్మీలనం చేసే అంతర్భావంతో కావ్యానందాన్ని అనుసంధితం చేసేవిధంగా సాగింది. నన్నయ భారతం ఆరంభ శ్లోకంలో 'శ్రేయో'భావం ఉపనిషద్గర్భితమైంది [1] తిక్కన జన్మాంతర దుఃఖములు తొలగునట్లు అనుగ్రహం కోసం ఆర్తి, పోతన శ్రీకైవల్యపదం చేరేలక్ష్యం, 'పునర్జన్మలేకుండా' ఈ జన్మను

---

[1] "శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతత్
స్తౌ సమ్పరీత్య వివినక్తి ధీరః
శ్రేయోపి ధీరోఽభి ప్రేయసో వృణీతే
ప్రేయో మన్దో యోగక్షేమా ద్వృణీతే"

కఠోపనిషత్ – 1, 2

సాఫల్యంచేసే, దీక్ష, విశ్వనాథ 'జనూరుజాతతి' విచ్చిపోయేట్లు అనుగ్రహం కోసం తపన, అన్నీ మౌలికంగా ఒకే తత్త్వప్రవాహ రూపాలు. ప్రబంధాలలో ఇది అక్కడక్కడా సూత్రప్రాయంగా నిహితమై, ఎక్కువగా కావ్యశిల్పం స్ఫుటాకృతిని పొందింది. కవిత్రియం తరువాత, ప్రబంధ యుగానికి పూర్వమూ అయిన పోతన భాగవతంలో అటు అంత స్తత్వతేజం. ఇటు కావ్యశిల్ప సౌందర్యం, రెండూ సమ్మిశితమై దివ్యమైన రమణీయకృతిని రూపొందింది. ఇది తెలుగు సాహిత్యపరిణామంలో భాగమై చారిత్రకంగా కాల ప్రభావం నుండి విడదీయలేని అంశం. సంస్కృత భాగవతంలో వస్తువు భగవంతుడు పరతత్త్వం—లక్ష్యం మోక్షం. అందుకే ఈ పురాణానికి మోక్షశాస్త్రమనీ పేరు. తెలుగులో దీనిపై మరికొంత విశిష్టత సాధింపబడింది. మూల గ్రంథంతో పాటు శ్రీధరుని వాఖ్యానమూ అనుసరింపబడింది దీనితో ఆ తరువాత వచ్చిన అద్వైతభావన, గ్రంథంలో సాధనమైన భక్తియోగమూ యోజితమై తాత్త్వికమైన ఉన్నతికి దారితీసింది. స్వతంత్రమైన కథానిర్వహణం, రచనాశిల్పం, రచనకు మరింత ప్రత్యేకతను కలిగించాయి. దీనితో తత్త్వప్రకాశనం, కల్పనాలోకం, కవిత్వ సౌందర్యంతో వస్తువు తాదాత్మ్య భావనావధిగా రూపొందింది. అందువల్ల ఈ గ్రంథాన్ని 1 మూలభాగం 2. శ్రీధరుని వ్యాఖ్యానుసరణం 3. స్వతంత్ర రచన అని స్థూలంగా విభాగింపవచ్చు. కాని సావయవశోభా సంపన్నమైన గ్రంథం, తెలుగు పాఠకులకు ఏకాకృతి భావనమే తన్మయత్వం కలిగిస్తుంది. రచన, వ్యాఖ్యానమూ వేరువేరుకాదు. ఒక సిద్ధాంతంతో విశిష్టమైన ఆలోచనతో చేసిన వ్యాఖ్యానం. ఆ గ్రంథం నుండి వేరుకాదు. ఎందుకంటే ఒక దృక్పథంతో గ్రంథంలోని అనేక సూక్ష్మాంశాలను పరిశీలించి, వివరిస్తుంది కాబట్టి, పూర్వం లేఖనం, పఠనం ప్రమేయం తక్కువగా ఉండేది. దీనికి కావలసిన సాధనలూ అంతంత మాత్రమే. కాబట్టి విషయాన్ని చాల సంక్షిప్తంగా జ్ఞాపకం పెట్టుకోవడానికి వీలుగా చెప్పేవారు. ఇవి ధారణలో ఉంచుకొని ఎక్కడో అవసరమైనచోట్ల నోటిమాటలలోనే వివరణం జరిగిపోయేది. తప్పనిసరి అనుకున్నవి సంగ్రహ రూపంలో నిబంధించి కంఠస్థం చేసేవారు. మళ్ళీవీటికి విస్తరణరూపాలు రావడమూ జరిగేది రానురాను విద్యావ్యాప్తితో ఒక్కొక్క శ్లోకానికీ సూత్రానికీ— ఒక్కొక్క దృక్పథంతో చేసిన ఆలోచనా వ్యాసంగం ఒక్కొక్క మార్గంలో, ఆ గ్రంథం నుండి విడదీయరానిదిగా తదభిమానులకు. తత్పథావలంబకులకు సంప్రదాయ పరంపరను ఏర్పరచింది. అది ఆ గ్రంథంలోని భాగంగానే నిలిచింది ఒక గ్రంథానికి భిన్నవ్యాఖ్యానాలుంటే ఎవరికిష్టమైంది వారు ఎన్నుకొనేవారు. ఒక్కొక్కపుడు అభిలాష, జిజ్ఞాస ఉన్నవారు మిగతావీ చూచేవారు. ఇలా భిన్నమతాలు వాదాలు సమీకృతమైన గ్రంథాలు లేకపోలేదు పోతన భక్తినిష్ఠతో, అద్వైత భావనామతి కాకపోతే తత్త్వవిషయ వివర

ణంలో శ్రీధరుని వ్యాఖ్యానంతో భాగవతాన్ని పరిపూర్ణం చేసేవాడు కాదు [1] ఆయన భాగవతతత్త్వ ప్రకాశనంలో అద్వైతదృష్టిని సిద్ధింపజేయడానికే దీన్ని స్వీకరించాడు. ప్రతిభామూర్తి కావడంతో కథా నిర్వహణంలో, భక్తిభావనచేత అనుభూతి గాఢత్వాన్ని చేకూరుస్తూ స్వతంత్రమైన రచనాస్వరూపాన్ని ప్రదర్శించాడు వ్యాసుడు- శ్రీధరుడు- పోతన- పూర్వ సంస్కృతాంధ్రకవులు ఈ నాలుగు ప్రభావస్థానాల పర్యవసానంగా తెలుగు భాగవతం ఆకృతి వహించింది. అందువల్ల మూలాన్ని ఏలా అనుసరించాడన్న ప్రసక్తి లేదు. కాలంయొక్క అంతరం పరిస్థితుల భిన్నత్వం, విషయ పరిణామం వైవిధ్యం; మొదలుగా వాస్తవశక్తుల ప్రభావం మొదట గుర్తించవలసి ఉంటుంది. లేకపోతే సరియైన అవగాహన ఏర్పడదు. పూర్వసంపద ఏలా కొత్త పరిణామరూపాలకు కారణమౌతుందో, అదేవిధంగా పైన పేర్కొనబడిన అంశాలు ఒకదానికొకటి ఉపస్కారకాలుగానై. భారతీయ సంస్కృతీ తేజంలో భాగంగా నిలచేవి. ఆరంభంలోనూ ఆ తరువాత, సంస్కృత భాషను మూలధనంగా గ్రహించి దేశభాషలనేకం ఆయా కాలపరిస్థితుల కనుగుణంగా సంపన్నమై ఎంతో అభివృద్ధిని పొందాయి. ఈ ప్రయత్నం, ఇవి ప్రజల చిత్తవృత్తివి ఒక క్రమంలో తీర్చటానికీ జీవనాన్ని ప్రకాశవంతం చేయడానికీ తోడ్పడినాయి ఒక్కొక్క భారతీయ భాష ఒక్కొక తేజో రూపాన్నిపొందింది అందులో భక్తి ఒకటి. భగవంతునిపట్ల భక్తిభావనా తత్పరంగా, పరతత్త్వం ప్రసారితమైంది, భాగవతంలో భక్తియోగం ప్రధానంగా ఉన్నప్పటికీ తక్కినవి జ్ఞానకర్మయోగాలకూ స్థానముంది. భక్తిభావన మనస్సును భగవత్సాక్షాత్కారానికి సిద్ధం చేస్తుంది. భక్తుడు వేదనతో ఆర్తితో వంటచెరకు అగ్నిరూపాన్ని పొందినట్లు సాధర్మ్యాన్ని పొందుతాడు. ఆత్మనివేదనం గావిస్తాడు. ఎవరైతే భగవంతుని భక్తితో భజిస్తారో వారు అతనిలో ఉంటారు. అతడు వారిలో ఉంటాడు[2] పోతన ఈ భావస్థానాన్ని కేంద్రంగా విష్ణువు- శ్రీకృష్ణుడు ఆలంబనంగా శాంతదాస్య సఖ్యవాత్సల్య మాధుర్యాది భావోపేతంగా అనేక కథలు రసధునులు ధునులుగా ప్రవహింపజేసాడు.

---

[1] a.) శ్రీధరాచార్యులు— భాగవత భావార్థదీపిక (అద్వైత వ్యాఖ్యానం)
b.) వేంకటకృష్ణాచార్యులు— భాగవత చంద్రిక (విశిష్టాద్వైతవ్యాఖ్యానం)
c.) విజయధ్వజాచార్యులు— విజయధ్వజీయము (ద్వైతవ్యాఖ్యానం)

[2] "యే భజన్తి తు మాం భక్త్యా
మయి తే తేషు చాప్యహమ్" భగవద్గీత IX - 29

ఎవరైతే నన్ను భక్తితో భజిస్తారో, నాయందు వారు ఉంటారు. వారియందు నేను ఉంటాను.

# II

ఆధునిక యుగంలో, ప్రజాస్వామ్యవ్యవస్థ ఏర్పడింది. హేతువాదం ప్రబలింది. వివిధాభిప్రాయాలు చర్చలు ప్రకటితం కావడం మొదలైంది. శాస్త్రీయ దృక్పథం అలవడింది. సంఘంలో ప్రతిదీ చర్చకూ పరీక్షకూ గురి ఐంది. సాంకేతిక ప్రగతి జీవితాన్ని సుగమం చేసింది. మానవశక్తులపై విశ్వాసం దృఢతరమైంది. మానవ జీవితం భౌతికమైన సుఖాల్లో గుణాత్మకమైన పరివర్తనం పొందింది. కాని సులభంగా సుఖాన్ని సంపాదించే అభిలాషలో నైతికమైన విలువలు పడిపోయాయి. మనస్సు యాంత్రిక జీవనగతిలో విసుగు, అలజడి ఘర్షణకు లోనయింది. పూర్వం నుండి వచ్చేవన్నీ కొత్త ఆలోచనల ఒరపిడి గురియైనాయి. భౌతికమైన సుస్థితికి పనికి వచ్చేది. ఏదో ఒకవిధంగా అవలంబించ దగిన ధోరణి వ్యాపించింది. సమాజంలో మతంపట్ల విశ్లథభావమూ ఏర్పడింది. వ్యక్తి, కుటుంబం, సమాజం, ప్రపంచం— వలయాలుగా ఒకదానినొకటి క్రమిస్తూ, యాంత్రిక నాగరకతలో పరస్పరమూ తీవ్రమైన ప్రభావాన్ని పొందాయి. రాజకీయ చైతన్యం, సంస్కరణభావం, వైజ్ఞానిక స్పృహ. వ్యక్తి అస్తిత్వాన్నీ సమాజగతినీ ప్రభావితం చేయడంతో కొత్త జీవితం రూపొంది కొత్తమానవుడు అవతరించడం మొదలైంది. పూర్వకాలానికీ నేటికాలానికీ మధ్య అంతరాన్ని భావింపజేసే స్థితి ఉత్పన్నమైంది. ఇదొక పార్శ్వం.

మరొక పార్శ్వం, ఎన్నోయుగాల పరిణామంతో శిఖరాల నందుకున్న జాతి, భద్రపరచుకొన్న విశిష్టమైన సంస్కారం, విజ్ఞానం సాహిత్యం మొదలుగా అనేక ముఖాలుగా విస్తరించి ఈనాటికీ ప్రపంచ సంస్కృతీ దర్శనంలో భాగమై జీవితాన్ని అనివార్యంగా ఆవహించి ఉండేది. దీనిలో అంతర్భాగమే భాగవతం "పురాకృత శుభాధిక్యం" తెలుగులో ప్రఫుల్లమైంది. ఈనాడు ఎల్లని ఆలోచనలతో మత విశ్వాసాలతో కూడిన పురాణకథలతో, మడికట్టుకొని కూర్చున్న ఎవరో కొందరికి మాత్రమే పనికివచ్చేదన్న అభిప్రాయమూ సరియైందిగాదు. ఈ సాధారణమైన లక్షణాన్ని అధిగమించిన విశిష్టత ఉంది దీనిలో.

పోతన భాగవతాన్ని అర్థం చేసుకోడానికి సరియైన అవగాహనతో కూడిన అధ్యయనం మొదట అవసరం. తరువాత వివిధాంశాల పరిశీలనం ఏ దృక్పథంతోనైనా జరపవచ్చు. ఈ సందర్భంలో వ్యతిరేక ధోరణికన్నా, సమన్వయ పద్ధతివల్ల సాహిత్యానికి ఎక్కువ ఉపకృతి జరుగుతుంది. ఈనాటి వ్యవస్థలో ప్రస్తుత సామాజిక

పరిస్థితుల్లో పోతన భాగవతం ఎంతవరకు ఉపయోగకరం? అంటే ప్రపంచంలోని అన్ని మహాగ్రంథాలకూ ఇది వర్తిస్తుంది. ఆధునిక వాతావరణ ప్రభావానికి గురిఐన గురికాని సమాజం లేదావ్యక్తుల అభిప్రాయాలు ఆలోచనలు వేరువేరుగా ఉంటాయి. అయినప్పటికీ, ఒక మహాగ్రంథాన్ని చదివేప్పుడు అనుభూతిస్థితి నిస్సందేహంగా స్థలాన్నీ కాలాన్నీ అతిక్రమించిన నిఖిల మానవభూమికలో ఉంటుంది. కిందిదశలో ఆకర్షించే విషయసమూహం వేరు. ఎన్నిమార్పులు వచ్చినప్పటికీ ఒక మహాకృతిని సమాజం నుండి తొలగించలేం. కాకపోతే ఇందులో కొన్నిటిని అంగీకరింపకపోవచ్చు కొన్నిటికి అంగీకరింపవచ్చు. మరికొన్నిటిని కొత్తదృష్టితో చూడవచ్చు. కొన్నిటితో విభేదించవచ్చు. మరి కొన్నిటికి మనస్సు అప్పటికి ఆయత్తం కాకపోవచ్చు. కొంత కాలానికి పరిణతివల్ల దర్శితం కావచ్చు. ఈ విధమైన చర్చలకూ, అభిప్రాయాలకు అవకాశమివ్వడంలోనే ప్రజాస్వామ్య వ్యవస్థయొక్క తీరు ఉపయోగకరంగా పరిణమిస్తుంది. స్వేచ్ఛనూ, వికాసాన్నీ విలసింపజేస్తుంది. దేన్నీనశింపజేసే స్థితిరాదు

ఈవిధంగా ఎప్పటికపుడు ఆలోచనాస్పృష్టమై అనుభవయోగ్యమైందే మహాకృతి. ఈ అభిప్రాయం పోతన భాగవతానికి బహుధా వర్తిస్తుంది. ఎన్నో మనం పరిహరించరాని శాశ్వతసత్యాలు, లోకవృత్త బాహుళ్యం, మనస్తత్వ వైవిధ్యంతోపాటు, ఇందులో ప్రకృతికీ - మనిషికీ మనిషికీ మనిషికీ - మనిషికీ ప్రపంచానికీ - గల అనుబంధాన్ని స్థాపిస్తూ, సర్వసృష్టి భావన చేయబడింది. దశమస్కంధం నుండి ముఖ్యంగా ఎన్నో ఉదాహరణ తీయవచ్చు.

అన్నిటిని మించి, మానవుని అన్వేషణం- ప్రస్థానం- గమ్యం- ఆలోచనకూ ఆనందానికీ శాంతికీ మూలమైన స్థితులూ భిన్నకథల్లో ఘటనల్లో పౌరాణిక భూమికలో ఊహకు రాకమానవు. భగవంతుడు ఆలంబనంగా మూలంలోని బీజశక్తి, తెలుగు శాఖా సమాకీర్ణమై, పుష్పితమైంది. ఇవన్నీ ఉత్తమ సంస్కారంగల వ్యక్తి తెలుసుకోదగినవే.

ఏ సమాజంలోనైనా పూర్వపు రూపాలు మనస్సునుండి పూర్తిగా తొలగించలేం అంతకన్నా నశింపజేయలేం. కాకపోతే మార్పులతో మరోమరో రూపంలో అవతరించవచ్చు. యుగయుగాల ప్రాచీన స్మృతిరూపాలు మనస్సులో పొరల్లో దిగిపోయి ఎక్కడో దాగి, అణగి సామూహిక అవ్యక్త చేతనాంశంగా రూపొందడం జరుగుతుంది. ఈ పురారూపాలు (Archetypes) మానవ జాతియొక్క బహుపురాతన

వారసత్వరూపాలు. పురాణాల్లో ఆత్మయొక్క తత్త్వాన్ని ఆవిష్కరించే మానసికమైన విచిత్రరీతులు కన్పిస్తాయి. ఇవి సామూహికమైన అవ్యక్తచేతన (Collective-unconsciousness) కు సంబంధించిన పురారూపాలకు నిలయాలు. భాగవత పురాణం లోనూ ఈ విషయాలను పరిశీలించవచ్చు దీని ప్రభావంవల్ల, మతతత్త్వం పట్ల వ్యతిరేకత ఉన్నా, కొంతకాలానికి మన స్తత్వగతమైన శూన్యతను, తొలగించడానికి, సౌముఖ్యం ఏర్పడుతుంది. కొత్త దృక్పథంతో పరిశీలించాలనిపిస్తుంది. సుదీర్ఘమైన మానవుని చరిత్రను మతప్రస్థానాన్ని పరిశీలిస్తే ఈ అంశం బాగా స్ఫుటమౌతుంది. వేదయుగంలో ఉన్నట్లు ఉపనిషత్కాలంలో తత్త్వస్వరూపం లేదు. ఆ తరువాత ఎన్నిమలుపులు తిరిగిందీ, చింతన ఏలా సాగిందీ సుపరిచితమే. ఈ బలమైన పురారూప మనస్తత్వం, పోతన భాగవతాన్ని తెలుగు ప్రజలకు సన్నిహితంగా ఉంచేదే.

ప్రతి జాతికీ వారసత్వంగా లభించిన ఒక తత్త్వదృష్టి ఉంటుంది. ఆలోచనా ధోరణి ఉంటుంది, ఒకవిధమైన స్పందనశక్తి ఉంటుంది. జీవనరీతి అలవడుతుంది. ఇందులో మార్పులు రావనికాదు. వస్తాయి, తప్పదు... ఇది వ్యక్తిలో అంతర్ బహిర్ సమస్యలను ఎదుర్కొనేందుకు, పరిష్కారాన్ని కనుగొనేందుకు, ఎంతో కాలంగా నిర్మితమౌతూ వచ్చే రక్షణ యంత్రరూపంగా ఎప్పటికపుడు పనిచేస్తూ ఉంటుంది. ఆధునిక వాతావరణంలో దీనిమీద జరిగే పెంపు వేరు. జరుగుతూనే ఉంటుంది. అనాదినుండి వచ్చే మార్పులకు లోనవుతూనే జీవశక్తితో, స్థూలదృష్టికీ అవగతమౌతుంది. ఇది అన్ని జాతులకూ వర్తిస్తుంది. దీనినుండి శాశ్వతంగా విముక్తం కావడం జరగని పని.

ప్రతిభాషకూ సాహిత్య సంపద ఉంటుంది. కొన్నిభాషల్లో ఇది ఉత్తమస్థితిని పొందుతుంది. ఇది ఆ తరువాత సాహిత్యప్రమాణాన్ని కాపాడగలిగింది; అభిరుచిలో ఉన్నతమైన సంస్కారాన్ని నిలిపేశక్తి కలిగిందిగా నిలుస్తుంది. తెలుగు సాహిత్యంలో పోతన భాగవతం ఈ కోవకు చెందింది.

మానవత దానవత- రెండింటి సంఘర్షణలో ఒక్కొక్కపుడు దానవత పెచ్చు పెరగడం, మానవత గెలవాలనే ఆకాంక్ష- సహజం. ఆశ, నిరాశ- అహింస, హింస- యుద్ధం, శాంతి, మొదలైన ద్వంద్వాల ఘర్షణలో చివరకు ఆనందాన్ని సౌభాగ్యాన్ని శాంతిని ప్రసాదించే ఉదాత్తమైన గుణంవైపు మనస్సు క్రమంగా ఉన్ముఖమై, మానవత్వం నుండి దివ్యత్వంలో తృప్తిని పొందుతుంది. కాబట్టి దానవతపై మానవత, ఆపై దివ్యత్వం దశలుదశలుగా విజయంపొందేస్థితి మనస్తత్వ

పరంగా ఎంతో ఉత్సుకతను కలిగించే భాగం. ఇది భాగవతంలో దానవ మానవ దేవతలకు సంబంధించిన అనేక కథలతీర్పులో స్పష్టంగా గుర్తించవచ్చు.

అణువునుండి మహీయందాకా అనేకమైన చైతన్యదశలు, పెక్కు అవతార గాథలు, పద్యరచననుండి, కథా నిర్వహణం వరకూ పర్యాప్తమైన శిల్ప రామణీయకత అనుభూతి దష్పుంగా సహృదయలోకాన్ని తాదాత్మ్యస్థితిలో ఉంచగలుగుతూంది. సృష్టి రహస్య విజ్ఞానం, చారిత్రక సమాచారం, తత్త్వ ప్రపంచనం, గతరేఖల్లో మూర్తీభవించిన మాట వాస్తవం. వివిధ కథారూపాలు నవవిధ భక్తిభావనతో విషయ సంయోగం చేత విష్ణుపారమ్యంలో వర్తమానానుభవంలో ద్రవీభూతమై రసాకృతి పరిపహించడమూ[1], పోతన భాగవత విషయంలో అంతే సత్యం.

చైతన్యమూ జడమూ మధ్యగల తారతమ్యాన్ని, ఏయేపాళ్లలో ఏ స్థితిలో వీటి కలయికవల్ల ఏ తత్త్వం రూపొందేదీ– ప్రకృతి జంతువులు, దానవుడు మానవుడు– సామాన్యునినుండి జ్ఞానివరకూగల వివిధ మనస్తత్వరూపాలు మనలోకంలో పాత్రల రూపంలో దర్శనమిస్తాయి[2].

## III

జీవుడు - జన్మ - కర్మ - భగవంతుడు - పరలోకం - పరతత్త్వం - మోక్షం - అన్న అంశాలు ఈ గ్రంథానికి, కీలకమైనవి. ఉపపత్తులు, ప్రవచనాలు, చర్చలు, వ్యాఖ్యానాలు దీన్ని స్థాపించడానికి ఉపయుక్తమైన సాధనసంపత్తి. వీటిపై విశ్వాసం కొంత సడలిన నేటి సమాజంలో ఈ రచన ఏ ప్రతిక్రియను కలిగించేదీ స్థూలంగా పరిశీలించడం జరిగింది.

ఈనాడు ఎన్ని విధాలుగానో సంక్షుభితమైన జీవితంలో, విషాదం నుండి, మనస్సును ఉత్క్రమింప జేసే శక్తినిలయంగానే భావింపవచ్చు.

ఎన్నో సమస్యలు ! సందేహాలు ! ఎప్పటికీ ! ఒక సమస్యను సందేహాన్ని తీర్చేశక్తి అందులోనే నిహితమై ఉంటుంది. బీజభేదనం నుండి చివురు వస్తుంది.

---

[1] "ద్రుతస్య భగవద్ధర్మా ద్ధారావాహికతాం గతా
సర్వేశే మనసో వృత్తిర్భక్తి రిత్యభిధీయతే"
మధుసూదన సరస్వతి, భక్తిరసాయనం

[2] గజేంద్ర మోక్షం, ప్రహ్లాద చరిత్ర, కుచేలోపాఖ్యానం, మొదలైనకథలు—

లయం నుండి సృష్టి ఉద్గమిస్తుంది. పరస్పర విరుద్ధంగా కన్పిస్తుంది. కాని తగిన వాతావరణం అనుకూలించడంతో సమస్య పరిష్కృతమౌతుంది. ఈ పరిష్కారం సమస్యలోనే ఉంది. ఆలాగే జీవితంలోనూ హేతువుకు అందీ అందనివి కొన్ని సూక్ష్మంగా ఆలోచిస్తే తెలిసేవి కొన్ని; హేతువుకు అతీతమైనవి కొన్ని తటస్థపడుతాయి. ఆలాగే ఈ సందర్భంలోనూ. మనకు కన్పించేదాన్నీ కన్పించనిదాన్నీ. అందేదాన్నీ అందనిదాన్నీ; తెలిసినదాన్నీ తెలియనిదాన్నీకలిపే వంతెన వంటిది మనస్సు. ప్రయాణంలో అఖాతం తటస్థపడినపుడు, ప్రయాణం దుస్తరమైన ఈ వంతెనపై ప్రయాణంచేయడం తెలియాలి. ప్రయాణం సాగించాలి అపుడే గమ్యం చేరుకోగలం.

భగవంతుడు - మానవుడు - ప్రపంచం ఈ మూడింటి సంబంధం ఇందులో స్థాపితమైంది. జీవితాన్ని సుపరిష్కృతం, సుసంపన్నం చేసి ప్రయోజన సహితం చేసే ఆదర్శం ప్రపంచితమైంది. భక్తుని ఆర్తి, సంఘర్షణ- భగవంతుని దయాప్రసాదంతో తృప్తి, ఆనందం, శాంతికి సానుకూలమైన వాతావరణ నిర్మాణం ఇందులోని తుది రేఖలు.

పోతన భాగవతంలో చాలాచోట్ల హేతువుకీ చర్చలకీ అందనిస్థితి ఉంటుంది. ఇది అనుభవానికి సంపన్నమయ్యే తాదాత్మ్యగుణంతో నిండి ఉంటుంది. చైతన్య రూపమైన మనస్సు, మననంచేత మథింప బడినపుడే కామధేనువు, కల్పతరువు, చింతామణి అమృతం ఫలసిద్ధి కలుగుతుంది.

పౌరాణిక కథా గతిలో, ప్రకృతి సహజమైన ప్రేమద్వేషం, ఆర్ద్రతకాఠిన్యం, శతృత్వం ఆత్మీయత మొదలైన మనస్తత్వరూపాలు ప్రవర్తమానమౌతూ మనల్ని ఆకర్షిస్తాయి. ఇవి మనల్ని భౌమస్థితిలో నిలిపేవి. ఈ ప్రమాణంలోనూ తెలుగు భాగవతం జనాదరాన్ని పొందుతుంది.

మూలంలోని కథాంశాలకు సంఘటనలు శిల్పించడంలో, సంఘటనలకు పాత్ర ధోరణి మలచడంలో. పాత్రకు మనస్తత్వాన్ని రూపొందించడంలో— మొత్తం మీద దీప్తినిచ్చే తత్త్వప్రకాశనం— ఆర్ద్రను కలిగించే కళారూపంతో పోతన భాగవతం సాక్షాత్కరిస్తుంది.

గ్రీష్మార్తిలో ఆర్ద్రమేఘంవలె ఇన్నివందల ఏండ్లు నిలచింది. పోతన వాక్సుధ చేత తెలుగుప్రజలు అమృతసేచనాన్ని పొందారు. నిరంతర చింతనమూ, రసానుభూతి రెండూకలపి దర్శనమూ స్పందనంతో మంత్రమహితమైంది. కావ్యానంద పరిధి దాటిన శక్తిప్రసారమూ ఈ కృతికిమాత్రమే సంక్రమించిన మరో ఉదార గుణం.

# పోతన వాఙ్మయ జీవిత సూచిక

విశ్వవిద్యాలయస్థాయి పరిశోధన కార్యక్రమంలో వాఙ్మయ సూచికల తయారీ ఒక ప్రధాన అవసరంగా అనుభవంలో అందరికీ తెలుస్తున్నా ఆచరణలో దాన్నొక ప్రాథమిక పరిశోధనాంశంగా చేయటానికి ఇంకా కొందరే సుముఖంగా వున్నారు. విశ్వవిద్యాలయ విజ్ఞానశాఖలు తమతమ విభాగాలకు సంబంధించిన ఆయా విషయాల మీద వాఙ్మయ సూచికలను సిద్ధంచేయిస్తే ముందుముందు వచ్చే పరిశోధకులు మరింత లోతుపాతుల్లోకి దిగి పనిచేయటానికి సమయమూ ఓపికా రెండూ వుంటాయి. వాఙ్మయ సూచికలు తయారుచేయటం అదేదో గుమాస్తాపని అని అటు గుమాస్తానూ ఇటు పనినీకూడా హీనంగాచూచే మనస్తత్వం క్రమంగా క్షీణిస్తూవుండటం ఎంతైనా హర్షింపదగ్గ విషయం. ఇందుకు నిదర్శనం కాకతీయ విశ్వవిద్యాలయాన్ని అలా వుంచినా మైసూరు విశ్వవిద్యాలయాన్నీ, మైసూరులోని భారతీయ భాషల కేంద్రీయ సంస్థనూ, మద్రాసు విశ్వవిద్యాలయాన్నీ పేర్కొనాలి. 1974 లో కన్నడ జానపద గ్రంథసూచిని మైసూరు విశ్వవిద్యాలయం ప్రచురించింది. ఆ సంవత్సరమే విశ్వనాథ వాఙ్మయ సూచికను కాకతీయ విశ్వవిద్యాలయం పి. జి. సెంటరుగా వుండే ప్రచురించింది. 1976 లో తమిళ జానపద విజ్ఞాన వాఙ్మయ సూచికను మద్రాసు విశ్వవిద్యాలయం తమిళ విభాగం పరిశోధన పత్రికలో ప్రచురించింది. కలకత్తాలోని ఇండియన్ పబ్లికేషన్సు సంస్థ ఢిల్లీలోని అంతర్విశ్వవిద్యాలయ సంస్థ— మొదలయినవి వాఙ్మయ సూచికలను కావాలని ప్రచురిస్తున్నాయి[1]. వీటినికూడా అలావుంచినా నెదర్లాండ్సులోని ప్రాచ్య విద్యావిజ్ఞాన అధ్యయన సంస్థ[2] హిందూమత విజ్ఞాన వాఙ్మయ సూచికను సంకలనం చేయటానికి పథకం వేసుకొని 1963 లోనే పని ప్రారంభించింది. — ఈ విధంగా దేశంలోనూ విదేశాల్లోనూ కూడా వాఙ్మయ సూచికల అవసరం గుర్తింపబడి ఆచరణ కార్యక్రమాలు చేపట్టబడుతున్నకాలంలో తెలుగు భాషా సాహిత్య విభాగ విషయాలకు అవసరమైన వాఙ్మయ సూచికల తయారీ విషయంలో కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ముందుకు వచ్చి చొరవ తీసుకొని పనిచేయటం కర్తవ్యంగా భావించి చేస్తున్నది. ఇంతవరకు పది పన్నెండుమంది రచయితలకు సంబంధించిన వాఙ్మయ సూచికలు సిద్ధమైనాయి ఆ వరుసలో మరొకటి ఈ పోతన వాఙ్మయ జీవిత సూచిక.

—సంపాదకుడు

---

1. "An invaluable reference tool for any intending scholar in any field to study"– Bibliography of Doctoral Dissertations-Humanities-1975. Inter University Board of India Publication)
2. J. GONDA C/o Institute of Oriental Studies, Nobels - traat 2 B, Utrecht - Netherlands. "A Bibliography on Hinduism."

# పోతన వాఙ్మయ జీవితం

## I

బహమనీ సుల్తానులు దక్షిణ భారతాన్ని కైవసం చేసుకొని పరిపాలిస్తున్న కాలం (క్రీ.శ. 1347–1525) లోనే బ్రతికి భాగవతం వ్రాశాడు పోతన. క్రీస్తుశకం పదివందల సంవత్సరాల నుండీ గజనీ మహమ్మదు దండయాత్రలు భారతదేశంమీద మొదలయినా పద్నాలుగో శతాబ్దం మొదట్లోగాని మహమ్మదీయులు దక్షిణ భారతం లోకి చొచ్చుకొని రాలేకపోయారు. యాదవులమీద, కాకతీయులమీదా, దాడులుచేస్తూ నెమ్మదిగా దేవగిరిని ముట్టడించి క్రమంగా ఓరుగల్లుమీదికి వచ్చారు. గుల్బర్గానుండి బహమనీల రాజధాని బీదరుకు మారే కాలానికి (1430 AD) పోతన, రావుసింగ భూపాలుడూ మంచి వయస్సులో వుండివుంటారు. ఆ కాలంలోనే అహమ్మద్‌షా వలీ బహమనీ అటు విజయనగరంతో ఒకసారి, ఇటు తెలంగాణాతో మూడుసార్లూ యుద్ధాలుచేశాడు తెలంగాణాలో వెలమరాజులు– అహమ్మద్‌షా అటు మాల్వాలోనూ గుజరాత్‌లోనూ ఓడిపోవటం చూచి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. అంత వరకూ ఇక్కడవున్న బహమనీ గవర్నరు అజంఖాన్‌ను వెళ్ళగొట్టారు దాంతో షాకు కోపంవచ్చి 1433 లో స్వయంగా సైన్యాన్ని నడిపించుకొని వచ్చి వెలమలను ఓడించి వరంగల్లులో ఒకటి, భువనగిరిలో ఒకటి – రెండు సైనిక కేంద్రాలను ఏర్పాటుచేసి తెలంగాణా తన అధికారం కింద వున్నదనిపించుకొన్నాడు. ఆ విధంగా తెలుగు ప్రజలకు మహమ్మదీయులతో మిత్ర సంబంధం కాకపోయినా శత్రుసంబంధ మైనా ఏర్పడింది పరిస్థితుల ప్రభావాలు అన్నిరకాల మానవ సంబంధాల్లోనూ మార్పులను తెస్తాయి. ఒకపక్క మహమ్మదీయ విజృంభణం జరుగుతుంటే మరొక పక్క భాగవత భక్తిభావోద్యమం పుంజుకోవటానికి ఆ పరిస్థితులూ ఆ సంబంధాలే కారణమయ్యాయి.[1] అసలు బహమనీ సుల్తానుల రాజ్యకాలం రెండువందల సంవత్సరాలూ కూడా హిందూ సమాజంలో సాంఘికమత రాజకీయ పరిస్థితులు అనేక

---

1. ఒకవిధంగా మహమ్మదీయ మతం భక్తిమతమే. ఇస్లామ్ అంటే శరణాగతి. ముస్లిమ్ అంటే శరణాగతుడు. భగవంతుడొక్కడే శరణ్యుడు. అల్లాయే భగవంతుడు. మహమ్మదు ప్రవక్త దైవాంశ సంభూతుడేకాని దైవంకాదు. ముస్లిములలో షియా–సున్ని అనే రెండు మతశాఖలు ప్రధానమైనవి– విజ్ఞానదీపిక (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ) పు: 534, 535.

మార్పులకూ సంస్కారణలకూ గురియైనకాలంగా చెప్పవచ్చు. అలాంటి పరిణామ క్రమంలో పోతన వాఙ్మయ జీవితం నడిచింది.

పోతన కృతులు ఉండటానికి నాలుగున్నా భాగవతానికి వున్న ప్రసిద్ధి మిగిలిన మూడింటికీ— భోగినీ దండకానికీ, వీరభద్ర విజయానికీ నారాయణ శతకానికీ— లేదు పోతన దేశ కాలనిర్ణయానికి భోగినీదండకం ఆధారం. భాగవత నైష్ఠికుడుగా పరిణమించిన పోతన్నగారి జీవితపునాదిని బలంగా చూపిస్తుంది భోగినీ దండకం.

## II

తెలుగు సాహిత్యంలో పోతన్నగారి ఉనికిని భద్రంచేసింది భాగవత పురాణమే. పోతన భారతాన్ని కూడా పురాణంగా పేర్కొన్నా అప్పుడు పురాణేతిహాసాలకు ఇప్పుడు మనకులాగా భేదాలను గుర్తించిన జాడ ఏమీలేదు. ఈ రెంటితో పాటు ఆఖ్యానం అన్నదాన్నికూడా కలుపుకొని కలగాపులగంగా వాడకం వుండేది. పోతన గారి కవిత్వాన్ని ప్రశంసించిన వాళ్ళు అది అచ్చముగా 'కలకండ లచ్చులు పోతలు పోసినట్లుంటుంద'[1]ని చెప్పారు. ముఖ్యంగా తెలుగు పద్యం పోతన చేతిలో ఎంత మెత్తని ఒదుగులు సంతరించుకొందో చదువుకొంటున్నప్పుడు అనుకోవలసిందేకాని చెప్పటానికిరాదు. నన్నయ తిక్కనాది మహాకవులంతా తమ తరువాత వచ్చే తెలుగు కవులు తమ కవిత్వంలోని ఫణితులను అనుకరించటానికి వీలుగా సొగసైన నమూనాలను సృష్టించారు, ఆ విషయంలో పోతన వాళ్ళకంటే ఎక్కువ చేశాడనిపిస్తుంది.

భాగవతం తరువాత వచ్చిన ప్రబంధ రచనలకు చాలా వాటికి నమూనాలు పోతనగారి రచనలో కనిపిస్తాయి. ప్రబంధనగర వర్ణనకు ద్వారకానగర వర్ణన[2] చక్కని నమూనా. ఉద్యానవిహార సలిలక్రీడా విలాసాలకు భాగవతంలోని జలక్రీడ— రాసక్రీడలు మూలం కావచ్చు.[3] సూర్యోదయ సూర్యాస్తమయాల వర్ణనలు, రాత్రి

---

1. విశ్వనాథ సత్యనారాయణ- శ్రీమద్రామాయణ కల్పవృక్షము. అవతారిక.
2. దశమ స్కంధం. పూ. భా. పద్యాలు 1593 నుండి 1609.
3. ,, ,, ,, 1081 నుండి 1099.

వర్ణనలుకూడా భాగవతంలో వున్నాయి.[1] అలాగే గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత ఋతువర్ణనలు కూడా భాగవతంలో వున్నాయి.[2] మధురాయాత్ర, మల్లయుద్ధం, అక్రూరదౌత్యం, రుక్మిణీ కల్యాణంలోని బ్రాహ్మణదౌత్యం- మొదలయిన భాగవత విషయాలు[3] ప్రబంధ వర్ణనాంశాలుగా తరువాత ప్రసిద్ధమైనాయి. ప్రబంధనాయిక లయిన వరూధిని, సత్యభామ, గిరికాదేవి మొదలయినవారి ప్రసిద్ధములయిన యేడ్పు లకుకూడా మూలభూతమైన రచన భాగవతంలో వుంది.

ఉవిదల్ సిగ్గులుమాని కన్నవల నీరొండొండ వర్షింపగా
వివశత్వంబులతో కపోలతట సంవిన్యస్త హస్తాబ్జలై
పవనోద్ధూత లతాభలై మము గృపం బాలింపు గోవింద మా
ధవ దామోదరయంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్.[4]

ప్రబంధాలలో నాయికా నాయకుల అన్యోన్యాన్ని ప్రశంసిస్తూ చెప్పటంలో ఆమె కతడు, అతనికామె తగివున్నారన్న అభిప్రాయం ప్రకటించటం వుంటుంది, ఆ విధమైన ప్రకటనకు మూలభూతంగా "తగునీచక్రి విదర్భరాజ సుతకుం, దథ్యంబు వైదర్భియుం దగునీచక్రికి–"[5] అనే పద్యం పోతనగారి భాగవతంలో వుంది.

గోగులపాటి కూర్మనాధకవి "వైరి హరరంహ సింహాద్రి నారసింహ" అన్న గీతపద్యపాద మకుటంగల సీసపద్యాల సింహాద్రి నారసింహ శతకానికి "చిత్తభయ దరంహ శ్రీనృసింహ"[6] అను ఆటవెలది పద్యపాదం మూలంగా కనిపిస్తున్నది, ఈ ఆటవెలది కూడా సీసపద్యం లోనిదే. అలాగే వడ్డాది సుబ్బారాయుడు గారి భక్త చింతామణి శతకమకుటం భాగవతంలోని "ఏ పుణ్యాతిశయ ప్రభావముననో...భక్త

---

1. దశమ, పూ, భా. పద్యాలు 1287 నుండి 1296; 1302 నుండి 1305.

2. దశమ, పూ. భా, పద్యాలు : 716, 753, 764, 798.

3. ,, ,, ,, : 1243 నుండి 1253. 1330 నుండి 1368, 1188 నుండి 1207, 1696 నుండి 1712.

4. దశమ, పూ.భా : 1220.

5. దశమ పూ. భా. 1738, మరియు 1712

6. సప్తమ 310.

వ్రాత చింతామణీ[1] పద్యం నుండి సమకూర్చుకొన్న దనిపిస్తుంది. భగవన్నామ సంకీర్తనమూ, స్తుతీ ప్రధానంగాగల భాగవత పద్యాలు శతకాలకు ప్రేరకం కావటం సమంజసమే.

తిరుపతి వెంకటకవుల ఆశుకవితవల్ల తెలుగు పద్యరచనలో వచ్చిన నాటకీయ సంవాదశైలికి కూడా "శుభమే నీకు ప్రమోదమే సఖులకుం చుట్టాలకున్ సేమమే"[2] వంటి భాగవత పద్యాల్లో నమూనాలు స్ఫురిస్తాయి.

భాగవతంలో ధ్యాన గానరూపాల్లో[3] చెప్పబడిన గోపికాకృష్ణ మానససంబంధమే[4] ఆధునికాంధ్ర సాహిత్యంలోని అమలిన శృంగారాత్మకమైన అభినవ భావ కవిత్వానికి చాలాదూరం నుండే అయినా మూలమన్నట్లు కనిపిస్తూ వుంటుంది. భాగవతం- అంటే ముఖ్యంగా దశమస్కంధం శ్రీకృష్ణుని సాహిత్య రసావతారంగా కనబడుతుంది. అయితే భాగవత కవిత్వానికున్నంత ఆధ్యాత్మిక భావ అవరోధం భావ కవిత్వానికి ఎటూవుండదు. అక్కడ గోపికల హృదయేశ్వరుదే[5] ఇక్కడ భావకవుల హృదయేశ్వరికి మూలం. అక్కడ హృదయేశ్వరుడు గోపికలకు వాస్తవానికి అప్రాప్త మనోహరుడైనట్లే ఇక్కడి హృదయేశ్వరి భావకవులకు అప్రాప్త మనోహరి అవుతున్నది. 'వనజాక్షి నేగన్కవై జయంతికనైన గదిసిప్రేలదు గదా కంఠమందు'[6] ఈ మొదలైన భాగవత పద్యాల్లో కూడా ఆధునిక భావకవిత్వ మూలాలు రేఖామాత్రంగానైనా కనిపిస్తుంటాయి.

## III

తెలుగు సాహిత్యం మీద ఇంత ప్రగాఢమైన ముద్రవేసిన మహాభాగవత రచయిత పోతనగారి పంచశతి మహోత్సవ సంవత్సరంగా 1981 వ సంవత్సరాన్ని ప్రకటించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పెద్ద ఎత్తున సాహిత్య సాంస్కృతిక కార్య

---

1. దశమ పూ. భా 1504.
2. దశమ, పూ.భా- 1205 — 3. "ధ్యానాకర్ణన దర్శనగానంబుల నాతలంపు గలిగిన జాలిన్ ... " — దశమ. పూ.భా. 983, — 4. "మానస బంధుడ .." దశమ. పూ.భా. 1076 — 5. దశమ, పూ.భా. 1055.
6, దశమ, ఉ.భా. 212.

క్రమాలను నిర్వహించింది. ఈ సందర్భంగా కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం తమ పరిశోధన పత్రిక 'విమర్శిని'ని 1981-82 సంచికను పోతన వాఙ్మయ జీవిత విశేషసంచికగా తీసుకొని రావాలని సంకల్పించింది. ఆ క్రమంలో ఈ పోతన వాఙ్మయ జీవిత సూచికను సిద్ధంచేసే పనినాకు అప్పగించబడింది. అవకాశమున్నంతలో ఈ సూచికను తయారుచేశాను. ఈ పనిమీద అన్ని గ్రంథాలయాలు తిరగటానికి వీలుకాకపోవటం చేత తయారైంది అసమగ్రమనే చెప్పాలి. ముందు ముందింకా లభించిన విషయాలను చేర్చుకొంటూ పోతేగాని ఇది సమగ్రం కాదు.

ఒక రచయిత యొక్క ఒక రచనకు సంబంధించిన ప్రసిద్ధి, ప్రచారం ప్రధానంగా వున్నప్పుడు వాఙ్మయ సూచికను తయారుచేయటంలో చారిత్రకక్రమాన్ని అనుసరించటం ఎక్కువ ఉపయోగకారిగా వుంటుంది. పోతన భాగవతం, దానికి సంబంధించిన విమర్శనలే ప్రధానంగా వున్నందువలన ఈ పోతన వాఙ్మయ సూచికను ఆ చారిత్రక క్రమాన్ని అనుసరించి చేశాను. ఇందువలన పోతన గురించి, ఆయన భాగవతం గురించి ఈ అయిదువందల సంవత్సరాల కాలంమీద మహాజనం ఎప్పుడు ఎంతెంతగా ప్రతిస్పందించిందీ, పరిశోధనలు చేసిందీ తెలుస్తుంది.

ఈ సూచికను సిద్ధం చేయటంలో ముందుగా నేలనూతల కృష్ణమూర్తిగారు సంకలనం చేయగా ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురించిన- వ్యాస రచనల సూచీని చూచాను. 1346 నుండి 1351 వరకు ఆరుపేజీల్లో సాహిత్యము- పోతన అనే శీర్షిక క్రిందవున్న 85 అకరాల్లో కవిత్వాలు, నాటకాలు మొదలయిన సృజన రచనలూ, సంస్కృత భాగవతంమీద విమర్శనలూ, జానపద గేయాల విషయాలూ- పోతన భాగవతంమీద వ్యాసాలూ కలగాపులగంగా వున్నాయి. వివరాలుకూడా సరిగ్గా లేకపోవటంచేత ఆయా పత్రికలను తిరిగి చూడకుండా వాటిని అవిధంగానే ఎత్తి వ్రాయటంవల్ల ప్రయోజనం ఉండదనిపించింది. అందువల్ల వాటినిందులో చేర్చలేదు. ఆ వ్యాసరచనల సూచిలోనే 1366 నుండి 1372 వరకు ఏడుపేజీల్లో సాహిత్యము- భాగవతము అనే శీర్షిక కిందవున్న 104 అకరాల్లోనూ పోతన గురించీ, ఆయన భాగవతం గురించీ ఏమీ కనిపించక పోవటంచేత ఆ విషయాలను కూడా ఇందులో చేర్చలేదు.

వ్యాస రచనల సూచినిబట్టి పోతన జీవిత వాఙ్మయ విచారణ 1874లో మొదలయిందని తెలుస్తున్నది. ఈ 1982 వరకూ గడచిన 108 సంవత్సరాల్లో పోతన వాఙ్మయ జీవితం గురించి తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ హిందీలోనూ జరిగిన కృషిని ఈ వాఙ్మయ సూచికలో స్థూలంగా చూపించటానికి ప్రయత్నించాను. ఈ సూచికకు సామగ్రిని సేకరించటంలో ఎక్కువగా వరంగల్లులోని గ్రంథాలయాలూ, యూనివర్సిటీ గ్రంథాలయమూ, ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజీ గ్రంథాలయమూ సహాయపడ్డాయి. పోతన పంచశతి ఉత్సవాల సందర్భంగా చదువబడి అముద్రితంగా వున్న ప్రసంగ వ్యాసాలు— తమవద్దవున్న వాటి వివరాలు చెప్పి తోడ్పడ్డవారు డా. కోవెల సుప్రసన్నాచార్యులుగారు, డా. కోవెల సంపత్కుమారాచార్యులుగారు.

—కాత్యాయనీ విద్మహే.



## 1. పోతన భాగవత ముద్రణలు

| | | | |
|---|---|---|---|
| 1 | 1840 | పరిష్కరణ : | వేదము వెంకటాచలశాస్త్రి |
| 2 | 1843 | " | పురాణం వెంకటకృష్ణశాస్త్రి |
| 3 | 1848 | " | పురాణం హయగ్రీవశాస్త్రి |
| 4 | 1865 | " | కరాలపాటి రంగయ్య |
| 5 | 1877 | " | పంచాంగం దేవరాజ పెరుమాళ్ళయ్య |
| 6 | 1889 | " | నేలటూరి వెంకటసుబ్బాశాస్త్రి |
| 7 | 1894 | " | వనప్పాకం అనందాచార్యులు |
| 8 | 1894 | " | కొమాండూరు అనంతాచార్యులు— ఆనంద ముద్రణాలయం — మద్రాసు. |
| 9 | 1905 | " | తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య |
| 10 | 1905 | ప్రచురణ : | వేమూరి వెంకటకృష్ణమ్మసెట్టి అండ్ సన్సు, మద్రాసు. |
| 11 | 1915 | పరిష్కరణ : | రాయదుర్గం నరసయ్యశాస్త్రి |
| 12 | 1922 | " | శేషాద్రిరమణ కవులు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు. |
| 13 | 1926 | ప్రచురణ : | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు. |
| 14 | 1934 | పరిష్కరణ : | రాయదుర్గం నరసయ్యశాస్త్రి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు. |
| 15 | 1940 | " | పమ్మి రామకృష్ణయ్య వెస్టువార్డు అండ్ కంపెనీ — మద్రాసు. |

1 – 6; 8, 9, 11 సంఖ్యలుగల ముద్రణలకు నిడుదవోలు వెంకటరావుగారి 'పోతన' (పు: 220) ఆధారం. భాగవత ముద్రణల్లో పురాణంవారి 1848 సంవత్సరపు ముద్రణే మొదటిదిగా ప్రసిద్ధి. 1840 వేదంవారి ప్రతిగురించి చాలామందికి తెలియదు. నిడుదవోలువారు తమ భాగవత (1948) పీఠికలో హయగ్రీవశాస్త్రిగారి భాగవతాన్నే (1848) మొదటి ముద్రణగా పేర్కొని వుండటం గమనింపవలసిన విషయం. 1843 ప్రతి 10.12 స్కంధాలు మాత్రమే. దీని సంగతికూడా చాలమందికి తెలియదు. చూడు: నిడుదవోలు వెంకటరావుగారి ఆంధ్ర వచన వాఙ్మయం (1977) పు: 55; 1877 ప్రతికి రాళ్ళపల్లివారి భాగవత పీఠిక (1954) ఆధారం.

16 1947 పరిష్కరణ : కల్లూరు వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు
వెంకట్రామా అండ్ కంపెని - ఏలూరు.
17 1948 ,, నిడుదవోలు వెంకట్రావు
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు.
18 1954 ,, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
రాయల్ అండ్ కో., కడప.
19 1962 ,, బులుసు వెంకటరమణయ్య
టాగూరు పబ్లిషింగ్ హవుస్ - హైదరాబాదు.
20 1964 ,, రాయప్రోలు సుబ్బారావుగారి అధ్యక్షతన ఏర్పాటయిన సంపాదకవర్గం.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.
21 1973 ,, నిడుదవోలు వెంకటరావు
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

## 2. టీకా తాత్పర్య వ్యాఖ్యాన సహితముగా వచ్చిన పోతన భాగవత భాగములు

1 1913 [1]కుచేలోపాఖ్యానము, 10 ఉ.భా. 957-1030
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు - మద్రాసు.
2 1918 అంబరీషోపాఖ్యానము 9080-152
ఆర్. వెంకటేశ్వర అండ్ కంపెని, మద్రాసు.
3 1919 రుక్మిణీ కల్యాణము, 10 పూ.భా. 1678-1784
ఆర్. వెంకటేశ్వర అండ్ కంపెని, మద్రాసు.
4 1921 గజేంద్రమోక్షము, 8 /81-137.
ఆర్. వెంకటేశ్వర అండ్ కంపెని, మద్రాసు
5 1928 ధృవోపాఖ్యానము, 4. 216-384
ఆర్య పుస్తకాలయం, రాజమహేంద్రవరం.
6 1930 వామన చరిత్రము, 8. 437-680
ఆర్య పుస్తకాలయం, రాజమహేంద్రవరం.

7 1932 శ్రీరామ చరిత్రము, 9. 257-362
హరిసర్వోత్తమరావు.

8 1940 సప్తమస్కంధము - ఆర్. వెంకటేశ్వర అండ్ కంపెని, మద్రాసు.

9 1962 మహాభాగవతం- స్వామికృష్ణదాస్‌జీ. పోతన భాగవతంలోని పద్యాలను ఉదాహరిస్తూ మొత్తం పన్నెండు స్కంధాలమీద 202 కథాఘట్టాలను తాత్పర్యార్థ వివరణంగా వచనంలో వ్రాశారు. ఇందులో పురాణ ప్రవచన ధోరణి కనబడుతుంది.

10 1973 మందార మకరందాలు. డా. సి. నారాయణరెడ్డి, యువభారతి, హైదరాబాదు. పోతన భాగవతం నుండి మొత్తం యాభై రెండు పద్యాలను ఎన్నికచేసి వాటిని వ్యాఖ్యానించారు.

11 1977 శ్రీమహాభాగవత రహస్య ప్రకాశము -
ఎక్కిరాల కృష్ణమాచార్య, విశాఖపట్టణం.

12 1981 శ్రీమద్భాగవత మణిహారము (రెండు సంపుటాలు)
-సంపాదకుడు : దర్భా సూర్యనారాయణ, రాజమండ్రి.

13 1982 మహాభాగవత కల్ప కుసుమమాల - డాక్టర్ పి. యశోదారెడ్డి,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ[2].

14 ? శ్రీమద్ భాగవతము - దశమస్కంధము. పూ.భా. చ. జయరామశాస్త్రిగారి టీక పోతన పద్యములతో
-ప్రచురణ: వేదం వెంకటరాయశాస్త్రి అండ్ సన్స్, మద్రాస్.

## 3. పాశ్చాత్య భాషల్లో భాగవతం

భారతీయ సాంప్రదాయిక సాహిత్యం విషయంలోనూ, పురాణవిజ్ఞాన విషయంలోనూ యూరోపియన్లకు ఆసక్తి పద్దెనిమిదో శతాబ్దం నాలుగోపాదం నుండి మొదలయిందనటానికి దాఖలాలు కనిపిస్తున్నాయి. కలకత్తా సుప్రీం కోర్టు జడ్జీగావున్న

---

1 చూడు : ఆంధ్ర గ్రంథములు (మొదటి జాబితా)- పుట: 15. ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘం, బెజవాడ 1915.

2. తెలుగు భాగవతంలోని అక్కడక్కడి పద్యాలు 485 ఈ పేరుతో కూర్చబడ్డాయి. ఇందులో 100 పద్యాలకు సరళంగా తాత్పర్యరూపంలో వ్యాఖ్యానం యశోదారెడ్డిగారే వ్రాస్తున్నారు. అది ఇంకా అచ్చై బయటకు వచ్చినట్లులేదు.

విలియం జోన్సు (William Jones) ఏషియాటిక్ సొసైటీని 1784 లో స్థాపించి సంస్కృత భాషలోవున్న భారతీయ వాఙ్మయాన్ని గురించి ఇంగ్లీషులో ప్రపంచానికి చెప్పటానికి పూనుకొన్నాడు. ఆయనే మన పురాణాల నన్నింటినీ ఇంగ్లీషులోకి అనువదించటం గురించి ఒక పథకం వేసుకొన్నాడు. యూరోపియను విద్వాంసుల దృష్టిలో మొదటపడ్డవి విష్ణుభాగవత పురాణాలు. విల్సను (Horace Haymann Wilson 1789-1860) - ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో మొదటి సంస్కృతభాషా సాహిత్య ఆచార్యుడు 1840 లో విష్ణుపురాణాన్ని ఆంగ్లీకరించాడు. ఆ సంవత్సరము లోనే పారిస్‌లోని కాలేజి - డి - ఫ్రాన్సు సంస్కృత భాషాసాహిత్య ఆచార్యుడు బర్నోఫ్ (EUGENE BURNOUF 1801 - 52) భాగవత ప్రథమస్కంధాన్ని ఇంగ్లీషులోకికాక ఫ్రెంచిభాషలోకి అనువదించాడు ఆ తరువాత మొత్తం భాగవతం ఇంగ్లీషులోకి 1898 నాటికి అనువాదమైపోయింది.[1] ముఖ్యంగా ఇంగ్లీషులోకి జరిగిన భాగవత పురాణానువాదాలు 1) 1896 లో కలకత్తాలో ప్రచురింపబడిన M.N. దత్తు గారిది, 2) 1929 లో తిరుపతి నుండి ప్రచురించబడిన S. సుబ్బారావు గారిది. 3) 1952 లో గోరక్‌పూర్ గీతా ప్రెస్సువారు ప్రచురించిన కల్యాణ కల్పతరు ప్రత్యేక సంచిక. 4) 1972 లో భక్తివేదాంత బుక్ ట్రస్టు తరపున టోక్యోనుండి ముద్రింపబడి కాలిఫోర్నియా నుండి ప్రచురించబడిన భక్తివేదాంతస్వామి ప్రభుపాదగారిది.[2]

ఇవన్నీ సంస్కృతంలోని భారతీయ విజ్ఞానాన్ని యూరోపియనుల అధ్యయనానికి సమకూర్చటానికి చేసిన పనులు. ఆలాగే తెలుగు భాగవత పురాణంలోని మహనీయ కవితా వైభవాన్ని ఇంగ్లీషు పాఠకులకు అందజేయాలన్న ఆలోచనతో కొంత ప్రయత్నం జరిగింది. పోతనగారి తెనుగు సృజన శక్తిని బయటి దేశాల వారికి తెలియజేయాలంటే ఇంగ్లీషు అనువాదాలు కావాలని కొందరు అందుకు పూనుకొన్నారు.

---

1. JEAN ROGER RIVIERE - Europian Translation of Puranic Texts- PURANA (July 1963) PP: 243 - 250. All India Kashiray Trust - Fort Ramnagar, Varanasi.

2. ఈ గ్రంథం కవరు పేజీమీద స్వామి ప్రభుపాదవారి శ్రీమద్భాగవత ప్రశంసా వాక్యంగావున్న 'Srimad Bhagavatam, which has never before been Presented to the English - speaking world, is now being Put forward'— అన్న మాటలు గమనింపదగినవి- విచారింపవలసినవీనూ.

## 4. పోతన భాగవతం–ఆంగ్లానువాదాలు

I. G. R. Subba Ramayya — Indian Antiquary (1903) Vol. 37 PP: 376 - 384.

భాగవతం దశమస్కంధంలోని రుక్మిణీ కల్యాణ కథాభాగం మొత్తాన్ని సుబ్బరామయ్యగారు ఇంగ్లీషులోకి అనువదించారు.

(నిడుదవోలువారి పోతన – పు: 230.)

II. Peri Suryanarayana — Gems of Andhra Literature in English Blank Verse. Part I Pages 103 - 118.

శ్రీ సూర్యనారాయణగారు తమ ఇంగ్లీషు ఖండికలకు మూలమైన పోతన భాగవతం లోని స్కంధానికి, పద్య సంఖ్యకు సంబంధించిన వివరాలు ఏమీ యియ్యకుండా ప్రథమ, ద్వితీయ, సప్తమ, అష్టమ, దశమ (పూర్వభాగం) స్కంధాల నుండి మొత్తం నలభై ఒక్క పద్యాలను పదకొండు శీర్షికల క్రింద ఇంగ్లీషు లోకి అనువదించి పెట్టారు.

భాగవతంలోని పద్యాలకేకాక పోతనగారి వీరభద్ర విజయం ద్వితీయాశ్వాసం లోని పార్వతి తపస్సును, బ్రహ్మచారిగావచ్చి శివుడు ఆమెతో మాట్లాడే ఇర వై రెండు పద్యాలను (243 నుండి 247 వరకు; 252 నుండి 260 వరకు; 270 నుండి 277 వరకు) కూడా శ్రీ సూర్యనారాయణగారు డెబ్భై పంక్తులుగా ఆంగ్లంలోకి అనువదించారు.

1. Invocations — 46 lines.

   భాగవత ప్రథమస్కంధంలోని విఘ్నేశ్వర, బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, సరస్వతి లక్ష్మి, పార్వతుల స్తుతులుగల 1. 'ఆదరమొప్ప మ్రొక్కెదుదు.' 2. అతత సేవజేసెద, 3. శ్రీకైవల్య పదంబు. 4. వాలినభక్తి మ్రొక్కెద 5 క్షోణి తలంబునన్ నుదురుసోకగ, 6. హరికిన్ పట్టపురాణి, 7. అమ్మలగన్నయమ్మ అని మొదలైన పద్యాలను ఈ వరుసలోనే అనువదించారు. సరస్వతీ స్తుతిలో గల 'పుట్టంబుట్ట శరంబునన్ మొలవ' అను రెండవ పద్యాన్ని అనువదించలేదు.

2. The greatness of Bhagavata — 23 lines.

   ప్రథమస్కంధంలోని 1. వరగోవింద కథానుధారన (12) 2. హరినామ కథన దావానలజ్వాలచే (13) – అని మొదలైన పద్యాలను అనువదించారు.

3. Bhishma Praises Lord Krishna From His Bed of Arrows — 31 lines.

ప్రథమస్కంధంలోని 1. త్రిజగన్మోహన (181) 2. హయరింఖాముఖ (182) 3. కుప్పించి ఎగసిన (185) 4. పలుకుల నగవుల నడపుల (187) 5 ఒక సూర్యుండు సమస్త జీవులకు (189) — అని మొదలైన పద్యాలను అనువదించారు.

4. Renunciation — 48 lines.

ద్వితీయస్కంధంలోని 1. కమనీయ భూమి భాగములు (21) 2. ఆలరుజొంపములతో (49) 3. విష్ణుకీర్తనముల (50) 4. నారాయణుని దివ్యనామాక్షరముల (81) – అని మొదలైన పద్యాలను అనువదించారు.

5. Didactic Verses — 21 lines.

సప్తమస్కంధంలోని 1. దమమును శౌచము తపమును (412) 2. శౌర్యము దానశీలము (413) 3. ధర్మార్థ కామవాంఛయు (414) 4. స్తేయములేని వృత్తియు (415) – అని మొదలైన పద్యాలను అనువదించారు.

6. A True Hindu Sati — 14 lines.

సప్తమస్కంధంలోని 1 నిలయము వాటించి (416) 2. ఉపవాసంబులు వ్రతములు (418)– అని మొదలైన పద్యాలను అనువదించారు.

7. Other Precepts — 22 lines.

సప్తమస్కంధంలోని 1. పొలతిదావవహ్ని (422). అష్టమస్కంధంలోని 1. అన్నమైన తక్రమైన (464) 2. వ్యాప్తిం బొందక వగవక (574)– అని మొదలైన పద్యాలను అనువదించారు.

8. Prahlad — 44 lines.

సప్తమస్కంధంలోని 1. తనయందు నఖిల భూతములందు (115) 2. ఆకార జన్మ విద్యార్థ వరిష్ఠుడై (117) 3. శ్రీవల్లభుడుఁ దన్నుఁ జేరినయట్లైన (122) 4. వైకుంఠ చింతావివర్జిత చేష్టుడై (124) – అని మొదలైన పద్యాలను అనువదించారు.

9. Prahlad's words — 69 lines.
సప్తమస్కంధంలోని 1. ఇనుమయస్కాంత సన్నిధి (149) 2. మందార మకరంద (150) 3 అంధేందూదయముల్ (168) 4. కమలాక్షునర్చించు కర ములు కరములు (169) 5. కంజాక్షునకుగాని కాయంబు కాయమే (170) 6. సంసారజీమూత సంఘంబువిచ్చునే (171) 7. అప్పపు చీకటింబడి (181) —అని మొదలైన పద్యాలను అనువదించారు.

10. Krishna's Break fast — 24 lines.
దశమస్కంధం, పూర్వభాగంలోని 1. మాటికి మాటికి వ్రేలుమడిచి (496) 2. కడుపున దిండుగా (498) —అని మొదలైన పద్యాలను అనువదించారు.

11 The Song of The Flute — 10 lines.
దశమస్కంధం, పూర్వభాగంలోని 1. కర్ణావతంసిత కర్ణికార ప్రభ గండభాగ ద్యుతి గడలుకొలుప (769)-అని మొదలైన పద్యాన్ని అనువదించారు.

III. A.V.S. Sarma — Excerpts From Potana's Bhagavatam (1957) T.T.D. Publications Tirupati.

భాగవతంలోని ధ్రువ, ప్రహ్లాద, గజేంద్రమోక్షణ, వామన చరిత్రలు; రాస క్రీడలు, జలక్రీడలు; రుక్మిణీ కల్యాణం, కుచేలోపాఖ్యానం మొదలైన ఘట్టాలను వచనంగానూ, వచన కవితలుగానూ శ్రీ శర్మగారు ఇంగ్లీషులోకి అనువదించారు. మొత్తంమీద భాగవతం పన్నెండు స్కంధాలనుండీ కూడా కథలను, కథాంశాలను గ్రహించారు.

IV. Sri Budaworthy Ramachar (Adoni).

దశమస్కంధం పూర్వభాగం రుక్మిణీ కల్యాణ ఘట్టంలోని విప్రసందేశాన్ని రామాచారిగారు పదిహేడు పద్యాలుగా ఆంగ్లీకరించి 'The Message of Princess Rukmini' అనుపేర తిరుమల తిరుపతి దేవస్థానం పత్రిక (సప్తగిరి?) 1965 నవంబరు సంచికలో ప్రచురించారు.

## 5. పోతన భాగవతం—హిందీ అనువాదాలు

I ఆంధ్ర భాగవత పరిమల్ — డా. వారణాసి రామమూర్తి రేణు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (1965) హైదరాబాదు - పు: 222.

పోతన భాగవతంలోని ప్రహ్లాద చరిత్ర, గజేంద్ర మోక్షణం, వామనచరిత్ర అంబరీషోపాఖ్యానం — ఈ నాలుగు ఉపాఖ్యానాలనూ శ్రీ రేణుగారు తెలుగు పద్యాలను హిందీ పద్యాలుగానూ, తెలుగు వచనాలను హిందీ వచనాలుగానూ అనువదించారు.

II ఆంధ్ర మహాభాగవతము — (నాగరి లిప్యంతరణ సహిత హిందీ అనువాదం) ప్రధాన సంపాదకులు: డా. భీమసేన్ నిర్మల్ — భువనవాణి ట్రస్టు, చౌపటియా రోడ్డు, లక్నో.

ప్రధాన సంపాదకులు శ్రీ భీమసేన్ నిర్మల్ మరి అయిదుగురు మిత్రులను కలుపుకొని మొత్తం ఆంధ్రభాగవతాన్ని మూలానుసారంగా హిందీలోకి వచనానువాదం చేశారు, ఇందులో మొదటి మూడుస్కంధాలను డా. సి హెచ్. రాములు చతుర్థ అష్టమస్కంధాలు, దశమస్కంధం పూర్వభాగం డా. M.B.V:I.R. శర్మ; పంచమ షష్ఠస్కంధాలను డా. భీమసేన్ నిర్మల్, డా. M. రంగయ్య; సప్తమ స్కంధాన్ని డా. నీరజ; నవమ దశమస్కంధం ఉత్తరభాగం, ఏకాదశ ద్వాదశ స్కంధాలు డా. S V. శివరామశర్మ అనువాదం చేశారు. ప్రధాన సంపాదకుల విపులమైన పీఠికతో ఈ ఆంధ్ర మహాభాగవత హిందీ అనువాదం లక్నోలో ముద్రింపబడుతున్నది.

## 6. పోతన వాఙ్మయ జీవిత విమర్శనలు

1 1893 పురాణకవులు — పోతన — గురజాడ శ్రీరామమూర్తి — కవిజీవితములు పు. 589-647

2 1915★ బమ్మెర పోతన నికేతనచర్చ — జయంతి రామయ్య పంతులు — ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (కాకినాడ) మాఘ ఫాల్గుణములు (చూడు: బమ్మెర పోతన నికేతన చర్చ 1920

★ పోతనామాత్య స్మరణము అనే శేషాద్రిరమణ కవుల రచన ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (22-2-1915)లో వున్నట్లు తెలుగుపై తాళికులు (సంపుటం 3) లో వుంది. అది వ్యాసమో, సృజన రచనో తెలియదు

3 1917 ఒంటిమిట్ట పోతనామాత్యుడు– వావిలికొలను సుబ్బారావు. ఏప్రిల్ 8వ తేదీన కడప సభలో ఈ వ్యాసాన్ని సుబ్బారావుగారు చదివారు. (చూడు: బమ్మెర పోతన నికేతన చర్చ 1920)

4 1917 పోతన – కందుకూరి వీరేశలింగం — ఆంధ్రకవుల చరిత్ర (ప్రథమ భాగం)

5 1917 బమ్మెర పోతరాజు నివాసస్థానము– జయంతి రామయ్య పంతులు – ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక– కార్తీకం

6 1918 ఒంటిమిట్ట పోతనామాత్యుడు – వావిలికొలను సుబ్బారావు (చూడు: బమ్మెర పోతన నికేతన చర్చ 1920)

7 1919 బమ్మెర పోతరాజు నివాసస్థానము – జయంతి రామయ్య పంతులు (చూడు: బమ్మెర పోతన నికేతన చర్చ 1920)

8 1919 వా్రంగల్ ఒంటిమిట్ట వివాదము – పెద్దిభొట్ల వీరయ్య పంతులు – ప్రచురణ వివరాలు తెలియవు (చూడు: బమ్మెర పోతరాజ విజయము)

9 1919 ఆంధ్ర భాగవత కర్తృత్వము – కొత్తపల్లి సూర్యారావు – ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటం 10, సంచిక 2

10 1919 నారాయణ శతకం– వంగూరి సుబ్బారావు– ఆంధ్రపత్రిక, సిద్ధార్థి ఉగాది సంచిక

11 1919 బమ్మెర పోతరాజ విజయము – ప్రచురణ : బమ్మెర పోతనామాత్య సమాజము, కడప– రాయల్ సైజు పుటలు 96, బ్రిటీషు మోడల్ ప్రెస్, చౌళాడ్యు, మద్రాసు

పోతన ఒంటిమిట్టవాడు కాడు వరంగల్లువాడని ప్రకటిస్తూ విజయవాడలోని వకీలు పెద్దిభొట్ల వీరయ్య పంతులుగారు 'వా్రంగల్ ఒంటిమిట్ట వాదము' అనే ఒక వ్యాసాన్ని వ్రాశారు. అది ఎక్కడ ప్రచురించబడిందో తెలియదు. ఆ వ్యాసానికి సమాధానంగా అందులోని 32 ఆక్షేపణలను త్రోసిపుచ్చుతూ వ్రాసి 1919 మే 5వ తేదీన కడపసభలో చదివిన వ్యాసం– 'బమ్మెర పోతరాజ విజయము'లో మొదటిదిగా ప్రచురించబడింది. ఈ వ్యాసకర్త పేరు తెలియటం లేదు. ఇది 45 పేజీల వ్యాసం. ఇందులో రెండవవ్యాసం నారాయణ శతక కర్తృత్వ

ఖండనం. ఈ వ్యాసకర్త కూడా ఎవరో తెలియటంలేదు. ఇందులో జనమంచి వెంకట సుబ్రహ్మణ్య శర్మగారు 1919 జూన్ 8 వ తేదీన నెల్లూరులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవ సమయమున పోతనామాత్య సమాజమువారి పక్షాన చదివిన వ్యాసభాగాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. మిగిలినది సమాజము పక్షాన ఎవరో వ్రాసింది. ఇది 20 పేజీల వ్యాసం. మూడవది తృతీయ ధాటి – వీరభద్ర విజయ కర్తృత్వ ఖండనము. ఇది 8 పేజీల వ్యాసం. ఈ వ్యాస రచయిత పేరుకూడా తెలియటం లేదు. చతుర్థ ధాటి భోగినీ దండక కర్తృత్వ ఖండనము. 12 పేజీల ఈవ్యాస రచయిత ఎవరో తెలియటం లేదు. పంచమధాటి వీరేశలింగ వాద ఖండనము. ఇది 4 పేజీల వ్యాసం. కర్తపేరులేదు. అయిదు వ్యాసాలతోవున్న ఈపుస్తకం ధాటీ పంచకోప సంహారముతోనూ, విజయభేరీ ఘోషముతోనూ, మధ్యవర్తుల అభి ప్రాయములతోనూ ముగుస్తున్నది. ముందు పైటిలు పేజీమీద 'ఒంటి మిట్ట దేవాలయంబున బమ్మెర పోతన భాగవతము వ్రాయుట' అన్న వివరణతో ఈయబడిన ఒక ఊహాచిత్రం వున్నది. ముందు వెనుకల గల పైటిలు పేజీల లోపలివైపులలో కడప బమ్మెర పోతనామాత్య సమాజమువారి సిద్ధార్థి సంవత్సర సభ్యుల జాబితావున్నది. ఈ సమా జానికి జనమంచి శేషాద్రి శర్మగారు అధ్యక్షులు. ఆయనతో కలిపి మొత్తం 51 మంది సభ్యులున్నారు ఈ సమాజంలో.

12 1920 బమ్మెర పోతన నికేతన చర్చ, ప్రచురణ: బమ్మెర పోతనామాత్య సమాజము కడప, రాయల్ సైజు పుటలు 184, బ్రిటిషు మోడల్ ప్రెస్ చౌకాయ్ మద్రాసు.

పోతన నివాసస్థలము వరంగల్లు జిల్లాలోని బమ్మెర అని ఋజువు పరచటానికి జయంతి రామయ్య పంతులుగారు బమ్మెర పోతన అనే పేరుతో వ్రాసిన మూడు వ్యాసాలు– పోతన నివాసస్థలము కడపజిల్లా లోని ఒంటిమిట్ట అని ఋజువుపరచటానికి వావిలికొలను సుబ్బారావు గారు "ఒంటిమిట్ట పోతనామాత్యుడు" అనే శీర్షికతో వ్రాసిన మూడు వ్యాసాలు – మొత్తం ఆరు వ్యాసాలు ఈ పుస్తకంలో వున్నాయి. ఇవన్నీ అంతకుమునుపు కాకినాడ పరిషత్పత్రికలో అచ్చయినవే. ఇవి

అన్నియు "నాకచో నుండిన భవిష్యద్విమర్శకులకు సాయపడున"ని తలచి వావిలికొలను సుబ్బారావుగారు ఈ పుస్తకాన్ని అచ్చువేశారు. సుబ్బారావుగారు ఈ పుస్తకానికి అనుబంధమన్నట్లుగా "ఏకశిలా నగర ద్వయ వివాద సంగ్రహము" అనే పేరుతో 20 పేజీలలో వివాదప్రధానాంశాలను క్రోడీకరించి వ్రాశారు. ఈ వివాదం విషయంలో కొందరి అభిప్రాయాలను సంపాదించి "మధ్యవర్తుల అభిప్రాయాలు" అనే శీర్షిక క్రింద మూడు పేజీలలో వాటిని ప్రకటించారు. చిట్టచివరి పుటలో విజ్ఞాపనము అనే శీర్షిక క్రింద సుబ్బారావుగారు ప్రాంతీయాభిమానములు పక్కకుపెట్టి సత్యశోధకునివలె విలువైన మాటలు వ్రాశారు. "పోతరాజు జన్మించిన 500 సంవత్సరములకీ వాదము జన్మించెను. ఇక 500 సంవత్సరముల కిది పరిష్కరింపబడినను వ్యసనములేదు ... నిదర్శనములు కానవచ్చుట చేత పోతరాజొంటిమిట్టయందుండెనని మేము చెప్పుచున్నాము కాని హఠశఠవాదముల నిమిత్తమైకాదు" ఈసందర్భంగా ఇంకా ఏకశిలానగర ద్వయవివాద సంగ్రహంలో- ఆయన చెప్పిన మాటలు స్మరించుకోవటం ఉచితంగా వుంటుంది. "బమ్మెర పోతనామాత్యుడేయూరి యందుండెనో చూచి తెలిసి చెప్పువారెవ్వరును లేరు. నేనే బమ్మెర పోతనయని నేనిట్టి యూరనుంటినని యాయనయే వచ్చి చెప్పినను నిప్పటి వారాయన వాక్యమేమాత్రము విశ్వసింతురో! ... ఆయన యేయూరివాడైనను ఆయన నామము ప్రతిపల్లియందును స్మరణీయము. ఆయన సమస్తాంధ్రలోకమునకు పూజ్యుడు. అని యొంటిమిట్టవాదుల యభిప్రాయము. కావున ప్రతిగ్రామము వారును పోతన మాయూరివాడని యెంచుట ఒంటిమిట్టవారికి సంతోషకరమైన కార్యము." (179)

ఈ నికేతన చర్చ ముందు టైటిల్ పేజీమీద 'ఒంటిమిట్ట కోదండ రామాలయమున నుండు పోతన విగ్రహము యొక్క ప్రతిరూపము' అను వివరణతో ఒకరేఖా చిత్రం వున్నది. నేను చూచిన కాపీకి చివరి టైటిల్ పేజీలేదు, చినిగిపోయింది.

13 1920 బమ్మెర పోతనామాత్య జీవితము.

14 1920 పోతన దర్శనములు — ఈ రెండు పుస్తకాలను తాము ప్రచురిస్తున్నట్లు- 'ముద్రణ మందున్నవి'- అని కడప పోతనామాత్య సమాజం వారు బమ్మెర పోతరాజ విజయము వెనుక అట్టమీద ప్రకటించారు.

15 1920 బమ్మెర పోతనామాత్యుడు — పెద్దిభొట్ల వీరయ్య- ప్రచురణ: వాణీ ముద్రాక్షరశాల, విజయవాడ- పు: 193

16 1920 పోతన — వంగూరి సుబ్బారావు- ఆంధ్ర వాఙ్మయ చరిత్ర.

17 1920(?) ఏకశిలానగర మోరుగల్లే- కొమర్రాజు వేంకటలక్ష్మణరావు. లక్ష్మణరాయ వ్యాసావళి (ప్రథమ సంపుటం 1965) పు: 70-121 ఈ వ్యాసాన్ని లక్ష్మణరావుగారు ఎప్పుడు వ్రాశారో తెలియదు. అముద్రితంగా వున్నదాన్నే ముద్రించినట్లు వ్యాసావళిలో సూచన వున్నది. బమ్మెర పోతరాజ విజయ గ్రంథాన్ని పేర్కొనటంవల్ల ఈ వ్యాసం 1920 ప్రాంతాల్లో వ్రాయబడి వుండవచ్చునని భావించటం జరిగింది.

18 1923 మహాకవి పోతన — కల్లూరి వెంకటనారాయణరావు, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక.

19 1923 బమ్మెర పోతన — వేటూరి ప్రభాకరశాస్త్రి- శృంగార శ్రీనాథము. పు: 37 - 44.

20 1924 పోతన వేమనల యుగము - దిగవెల్లి వేంకటశివరావు, విజయవాడ- పు: 64.*

21 1924 పోతన- వంగూరి సుబ్బారావు- శతకకవుల చరిత్ర, పు: 114-140.

22 1924 భాగవత ప్రాశస్త్యము — సె. లక్ష్మీనరసయ్య, ఆంధ్ర పత్రిక క్రోధన ఉగాది సంచిక.

23 1929(?) పోతన భాగవతము — నిడుదవోలు వేంకటరావు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక- సంపుటం 29, సంచిక 10

24 1931 పోతన భక్తి— భాగవత రచన- జనమంచి శేషాద్రిశర్మ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక- (మాఘ ఫాల్గుణములు) పు: 200-204

25 1933 పోతన- దేవరాజు వెంకటసత్యనారాయణమూర్తి - భారతి (మార్చి) పు: 357 - 364.

26 1939 బమ్మెర పోతరాజ కవి శిరోమణి చారిత్ర విశేషములు — కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (ఏప్రిల్- మే) పు: 134, 135

---

* చూడు: గ్రంథసూచిక, పు: 191- తెలుగు అకాడమీ హైదరాబాదు 1972

27 1940 తెలుగుతల్లి— పోతన సంచిక, సంపాదకురాలు— రాచమళ్ళ సత్యవతీ దేవి, తెలుగుతల్లి కార్యాలయం, హైదరాబాదు

28 „40-41 పోతన భాగవతము — నిడుదవోలు వెంకటరావు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (ఏప్రిల్) పు: 9-26

29 1942 పోతన భావకవి — పింగళి లక్ష్మీకాంతం, ఆంధ్ర సర్వస్వము- పు: 297, 298

30 1942 పోతన్న — బులుసు సూర్యప్రకాశశాస్త్రి, దివ్యవాణి (అక్టోబరు) పు: 59-63

31 1942 బమ్మెర పోతన— పంతము ఆంజనేయకవి, పు: 42

32 1944 బమ్మెర పోతన మహాకవి — సర్వజ్ఞ సింగభూపాలుడు — పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి భారతి (డిసెంబరు) పు: 519- 526

33 1049 పోతన — చాగంటి శేషయ్య, ఆంధ్రకవి తరంగిణి (6) పు: 155 — 205

34 1951 భాగవతము— వేటూరి ప్రభాకరశాస్త్రి, మీగడ తరకలు— పు: 79-82

35 1954 పోతన కవిత్వ పటుత్వం— తాపీ ధర్మారావు, పరిశోధన (అక్టోబరు నవంబరు) పు 2-5, 64

36 1954 ప్రాచీనములు - వికృతులు, భాగవత ప్రకారము— కట్టమంచి రామలింగారెడ్డి, పంచమ ప్రచురణ: ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు పు: 27-50

37 1954 పోతన్న - తులసీదాసు, ద, సూర్యప్రకాశరావు- స్రవంతి (భాద్రం) పు: 20-22

38 1955 ద్రౌపది మాతృహృదయము- యస్వీ జోగారావు, భారతి (నవంబరు)

39 1956 శృంగార కవి పోతన — దేవులపల్లి రామానుజరావు, సారస్వత నవనీతము (నాల్గవ కూర్పు) పు; 20 25

40 1956 బమ్మెర పోతన్న — గార్లపాటి రాఘవరెడ్డి, ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక నవంబరు, ప్ర: తెలంగాణా రచయితల సంఘం— పు: 12-22

41 1956 పోతన — స్థానిక సాహిత్య సమీక్ష— సుప్రసన్న, ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచిక, నవంబరు

42 1956 పోతన చరిత్ర — స్థలకాలములు - మల్లంపల్లి సోమశేఖర శర్మ, (నవంబరు 3)

43 1956 పోతన అనువాద విధానము- కురుగంటి సీతారామయ్య, (నవంబరు 4)

44 1956 పోతన కవిత్వము- పుట్టపర్తి నారాయణాచార్యులు, (నవంబరు 6)

45 1956 భాగవతోపాఖ్యానము- వాని అంతరార్థములు — తల్లావఝ్ఝుల శివ శంకరస్వామి (నవంబరు 7)

46 1956 భాగవత రాజవంశములు- పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, (నవంబరు8)

47 1956 వాసుదేవ తత్త్వము— అవతారములు- భాగవత వైష్ణవము- వేదాల తిరువెంగళాచార్యులు (నవంబరు 9) 42 నుండి 47 వరకుగల ఈ ఉపన్యాసాలన్నీ ఈక్రింది పుస్తకరూపంలో వచ్చాయి.

48 1957 ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు -- ప్రచురణ : ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు.

49 1957 బమ్మెర పోతన – అనుముల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, ప్రచురణ: భగవద్గీతా మండలి, జనగామ- పు 100

50 1958 పోతన— యేలూరుపాటు రామభద్ర చయనులు- ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (హేవలంబి మాఘ ఫాల్గుణములు, విలంబి చైత్ర వైశాఖములు) పు. 60_70

51 1959 బమ్మెర పోతరాజ చరిత్రము— మద్దూరి శ్రీరామమూర్తి. ప్రచురణ: కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి- పు. 82

52 1959 పోతన — గడియారం వెంకటశేషశాస్త్రి– విజ్ఞాన సర్వస్వము (మూడవ సంపుటం) పు: 932_936

53 1960 పోతనామాత్యుడు అతని కృతులు — వి. రాజేశ్వరి, ఆంధ్రా యూనివర్సిటీ Ph D. థీసిస్*

54 1962 పోతన – నిడుదవోలు వెంకటరావు, నేషనల్ బుక్ట్రస్టు, న్యూఢిల్లీ పు: 230

55 1963 పోతన వేమనలు సహాధ్యాయులా ? — సోమరాజుపల్లి చెంచయ్య, స్రవంతి (జులై) పు: 36 - 40

---

* తెలుగు అకాడమీవారి గ్రంథసూచిక (పు: 191)లో 1950 అనివుంది పొరపాటు.

56 1964 పోతన (నిడుదవోలు వెంకటరావు పుస్తకంపై విమర్శ) నోరి నరసింహశాస్త్రి. భారతి- (డిసెంబరు) పు: 81-89

57 1965 పోతన— ఆరుద్ర. సమగ్రాంధ్ర సాహిత్యం (5) పు: 191-254.

58 1966 ఆంధ్ర భాగవత విమర్శ — ప్రసాద రాయకులపతి, గుంటూరు- పు: 575. శ్రీవెంకటేశ్వరా యూనివర్సిటీ Ph. D. థీసిస్

59 1966 పోతన పద్యశాసనము — దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి, భారతి- మార్చి (చూడు: వ్యాసరచనల సూచి, పు; 468)

60 1968 శృంగారం-పోతన- బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, ఎమ్. ఎస్. ఎమ్. పబ్లికేషన్సు, విజయవాడ- పు: 331

61 1969 భాగవత పాఠ పరిశోధనము — దీపాల పిచ్చయ్యశాస్త్రి, ప్రచురణ; ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు- పు: 316

62 1969 పోతన్నగారి సహజ పాండిత్యము — తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు, ప్రచురణ: వావిళ్ళ- మద్రాసు, పు 92

63 1971 భక్తపోతన — మహాభాగవత రచన- ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రి (చూడు; దివాకర్ల వెంకటావధానిగారి పోతన, పు: 79)

64 1971 పోతన- భాగవత రచన- శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి, ప్రచురణ; నిర్మలా పబ్లిషర్సు, విజయవాడ- పు: 418

65 1972 వీరభద్ర విజయము - ప్రకృతి వర్ణనలు — పి. వి. చలపతిరావు, అక్షరార్చన. పు: 158

66 1973 శ్రీమద్భాగవతానుశీలనము — ధూళిపాళ శ్రీరామమూర్తి, హైదరాబాదు, ఉస్మానియా యూనివర్సిటీ Ph. D. థీసిస్, పు: 533

67 1973 బమ్మెర పోతన — సి. నారాయణరెడ్డి, వికాసలహరి- యువభారతి, హైదరాబాదు.

68 1974 భాగవతాంధ్రీకరణము - మూలవిభిన్నత- పాఠభేదములు - శిష్టారామ కృష్ణశాస్త్రి, భారతి (జులై) పు. 18 - 23

69 1974 పోతన— పింగళి లక్ష్మీకాంతం- ఆంధ్రసాహిత్య చరిత్ర, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, పు: 442 - 462

70 1975 పోతన- వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, ప్రచురణ; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, పు, 65

71 1975 పోతన భాగవతములో పోయిన ఒక కథాభాగము– వికాశ్రీల శేషాచార్యులు, భారతి– (మార్చి) పు. 8 – 11

72 1979 పోతన భాగవతము– ఒక పరిశీలన— నేతి అనంతరామశాస్త్రి, సమాలోచన (ఏప్రిల్) చూడు: వ్యాసపూర్ణిమ– (రచయిత వ్యాస సంకలనం) పు. 55 – 63

73 1980 పోతన— దివాకర్ల వెంకటావధాని, ప్రచురణ: సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ– పు. 78

74 1980 ఆంధ్ర మహాభాగవతము — రసానుభూతి. జి. వి సుబ్రహ్మణ్యం రసోల్లాసము, పు. 239 – 248

75 1980 పోతనామాత్యుని కవితాశిల్పం — డా. దాశరథి– స్రవంతి (జూన్) పు. 6 – 8

76 1981 పోతన్నలో అభ్యుదయాంశ — గంగిశెట్టి లక్ష్మీనారాయణ, తెలుగు సాహిత్యం మరోచూపు, పు. 94 – 114

77 1981 బమ్మెర పోతరాజు — పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు– భక్త కవిపుంగవులు, పు. 31 – 74

78 1982 పోతన భాగవతం— శ్రీ త్యాగరాజుకి పారాయణ గ్రంథం– చల్లా రాధకృష్ణశర్మ, ఆంధ్రపత్రిక మార్చి 7, పు 7

79 1982 పోతనగారి భాగవతం ఎప్పుడు అచ్చు అయింది — అక్కిరాజు రమాపతిరావు– ఆంధ్రపత్రిక, మార్చి 13 పు. 3

80 1982 బమ్మెర పోతన : సంస్మరణ – బూదరాజు రాధాకృష్ణ. ఈనాడు మార్చి 13, పు 3

81 1982 పోతన కవితా వైభవం (భక్తి వేదాంత సుధాస్రోతస్విని) దివాకర్ల వెంకటావధాని, ఆంధ్రప్రభ– మార్చి 13, పు 4

82 1982 బమ్మెర పోతరాజుగారి లాక్షణిక ధిక్కారం — అరుద్ర, ఆంధ్రజ్యోతి, మార్చి 14

83 1982 పోతన భక్తితత్పరత — కమలాకర వెంకటరావు ఆంధ్రప్రభ– మార్చి 14, పు. 4

84 1982 రాజాజ్ఞకిన్న రామాజ్ఞమిన్న— సుధారాణి, ఆంధ్రప్రభ– మార్చి 14 పు. 4

85 1982 పోతన మహత్వ కవిత్వ సంపద — హరిశ్చంద్ర, పత్రికాశక్తి- మార్చి 14, పు. 4

86 1982 ప్రతిపద్యచేతన మనపోతన— జి. కృష్ణ, ఆంధ్రప్రభ- మార్చి 15, పు. 2, 4

87 1982 తెలుగుల పుణ్యపేటి — ఐ. రామకృష్ణరాజు, ఆంధ్రభూమి - మార్చి 16, పు. 3

88 1982 గాసిపడిన గాదిలికోడలు — దేవళ్ళ చిన్నికృష్ణయ్య, ఆంధ్రపత్రిక (వారపత్రిక) మార్చి 17, పు. 17

89 1982 దేశసంస్కృతిని ప్రభావితంచేసిన భాగవత సంప్రదాయం- పాములపర్తి సదాశివరావు, ఆంధ్రప్రభ (వారపత్రిక) మార్చి 17, పు. 25-27

90 1982 వాగ్గేయకారులకు వెలుగు నిచ్చిన సాహిత్య జ్యోతి — అమరేశం రాజేశ్వరశర్మ— ఆంధ్రపత్రిక (వారపత్రిక) మార్చి 17 పు. 28

91 1982 ఆంధ్రుల జీవితాన్ని అల్లుకున్న భాగవతం — అక్కిరాజు ఉమాపతి రావు- ఆంధ్రపత్రిక (వారపత్రిక) మార్చి 17, పు. 29

92 1982 శుభాధిక్యం - దిగవెల్లి వెంకటశివరావు, ఆంధ్రపత్రిక (వారపత్రిక) మార్చి 17, పు. 31

93 1982 బ్రౌన్ మెచ్చిన భాగవతం— నిడుదవోలు వెంకటరావు, ఆంధ్రప్రభ (వారపత్రిక) మార్చి 17, పు. 33

94 1982 విప్లవకవి పోతన— కోన ప్రభాకరరావు, ఆంధ్రభూమి మార్చి 17 పు. 3

95 1982 పోతన కవితలో తెలుగుదనము — డా. రావిభారతి, ఆంధ్రభూమి- మార్చి 18, పు. 3

96 1982 పోతన పంచశతి జయంతి — పైడిపాటి సుబ్బరామశాస్త్రి, ఆంధ్రపత్రిక (వారపత్రిక) మార్చి 19, పు. 6, 7

97 1982 భక్తాగ్రగణ్యుడు పదలాలిత్య ప్రసిద్ధుడు బమ్మెర పోతనామాత్యుడు- గుటజాడ శ్రీరామమూర్తి, ఆంధ్రపత్రిక (వారపత్రిక) మార్చి 19 పు. 42, 43

98 1982 భాగవతము— పోతన కవితోన్మీలనము, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్రభూమి- మార్చి 19, పు. 3

99 1982 పోతరించిన పోతన్నలు — గజ్జెల మల్లారెడ్డి, ఈనాడు మార్చి 21 పు. 3

100 1982 రాచరిక వ్యవస్థను సమర్థించే పోతన భావాలు — కె. రామ్మోహన్ రాజు, ఆంధ్రభూమి- మార్చి 24, 25 పు 3+3

101 1982 పోతన పంచశతి ఉత్సవాలు (సమీక్షా వ్యాసం) ఆనందం. విశాలాంధ్ర మార్చి 26. పు. I, II

102 1982 భక్తకవులు— వాడుకభాష, భాగవతం అక్కిరాజు రమాపతిరావు, విశాలాంధ్ర మార్చి 26. పు III

103 1982 భాగవత సంపద — జి.ఎ.యస్.యస్. సోమయాజుల శర్మ. సాధన (మార్చి) పు. 15-21

104 1982 భాగవతంలో ధ్వన్యనుకరణ శబ్దాలు — ద్వా. నా. శాస్త్రి, సాధన (మార్చి) పు. 22-25

105 1982 పోతన భాగవతము — పాత్రచిత్రణము, అవధానం రంగనాథ వాచస్పతి, సాధన (మార్చి) పు: 26, 35-41

106 1982 ఆంధ్ర మహాభాగవతము ఛందోనుశీలనము — యస్. నరసయ్య- సాధన (మార్చి) పు 42-52

107 1982 పోతన లోకజ్ఞత — కృష్ణస్వామి, సాధన (మార్చి) పు: 53-56

108 1982 తెలుగువారి జీవితం — పోతన భాగవతం, బీరం సుందరరావు- తెలుగు విద్యార్థి (జూన్) పు: 26, 37

109 1982 బమ్మెర పోతన — తరిగొండ వెంకమాంబ, డా. కె. జె. కృష్ణమూర్తి, భారతి (ఆగస్టు) పు. 24-28

110 1982 పోతన భాగవతము: తెలుగుదనము- ఖండవల్లి లక్ష్మీరంజనం.

111 1982 నేను దర్శించిన పోతన — దేవులపల్లి రామానుజరావు

112 1982 15వ శతాబ్దములో తెలుగు దేశపు సామాజిక పరిస్థితులు- రాయప్రోలు సుబ్రహ్మణ్యం

113 1982 పోతన సమకాలీన సాహిత్యస్వరూపము — తిమ్మావజ్ఝల కోదండ రామయ్య

114 1982 పోతన భాగవత పరమార్థము — అవధానము చంద్రశేఖర శర్మ

115 1982 శ్రీభాగవత వ్యంగ్యవైభవము — జమ్ములమడక మాధవరామశర్మ

116 1982 పోతన భాగవతము—జీవునివేదన — తుమ్మపూడి కోటేశ్వరరావు

117 1982 పోతన భాగవతము-వైరభక్తియోగము — అనుముల కృష్ణమూర్తి
118 1982 పోతన భాగవతము-శబ్దాలంకారవైచిత్రి — దోర్బల విశ్వనాథశర్మ
119 1982 భాగవతం-శరణాగతి తత్వం — బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
120 1982 భాగవతము-తాంత్రికత — ప్రసాదరాయ కులపతి
121 1982 ఆళ్వారుల భక్తి- పోతన భాగవతము — చల్లా రాధాకృష్ణశర్మ
122 1982 పోతన భాగవతము-సాంఖ్య దర్శనము – చివుకుల మార్కండేయశాస్త్రి
123 1982 గోపికలు - మధురభక్తి — దివాకర్ల వెంకటావధాని
124 1982 శ్రీవల్లభ చైతన్య సంప్రదాయములు– పోతన భాగవతము వారణాసి రామమూర్తిరేణు
125 1982 పోతన - వేమన — గంధం అప్పారావు
126 1982 కృష్ణకథా కథనము – పోతన అగస్త్యుల పోకడలు — ఘనశ్యామల ప్రసాదరావు
127 1982 పోతన భాగవతము- గీతాత్రయి — కోగంటి సీతారామాచార్యులు
128 1982 పోతనగారి లాక్షణికత — వంతరాం రామకృష్ణారావు
129 1982 స్త్రీ సమాజములో పోతన భాగవత ప్రచారం — కె. కమల
130 1982 పోతన భాగవతం-హాస్యరసప్రయుక్తి — వి.వి.యల్.నరసింహారావు
131 1982 పోతన-నాచన సోమన — పి. యశోదారెడ్డి
132 1982 పోతన-తులసీదాసు — భీమసేన్ నిర్మల్
133 1982 పోతనగారి పద్యశిల్పం — వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
134 1982 పోతన-జగన్నాథదాసు — వఝ్ఝల కాశిదాసు
135 1982 పోతన దర్శించిన కృష్ణుడు — ఇరివెంటి కృష్ణమూర్తి
136 1982 తిక్కన-పోతన-పోలికలు-పోకడలు– మరుపూరు కోదండరామరెడ్డి
137 1982 శ్రీమహా భాగవతము- ప్రతీకాత్మత — సాళ్వ కృష్ణమూర్తి
138 1982 పోతన భాగవతము - రసనిర్వహణ — ధూళిపాళ శ్రీరామమూర్తి
139 1982 భావకవితపై పోతన ప్రభావం — ఇంద్రగంటి శ్రీకాంతశర్మ
140 1982 భాగవత సంప్రదాయ ప్రాశస్త్యం — పాములపర్తి సదాశివరావు

141 1982 పోతన, పురందరదాసు — ఆర్వీయస్. సుందరం
142 1982 పోతన అర్థాలంకారములు — మూలంపల్లి చంద్రశేఖరశర్మ
143 1982 శ్రీ బమ్మెర పోతన-అద్వైతము — శాస్త్రుల విశ్వనాథశర్మ
144 1982 పోతనకాలం నాటి మతపరిస్థితులు — సి వి. రామచంద్రరావు
145 1982 భాగవతం - బాలసాహిత్యం — తిరుమల రామచంద్ర
146 1982 పోతన : సూరదాసు — సి. హెచ్. రాములు
147 1982 శ్రీమద్భాగవతము - విశిష్టాద్వైతము — నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు
148 1982 పోతన భాగవతము - నాద సౌందర్యము — నండూరి రామకృష్ణమాచార్య
149 1982 పోతనగారి ఛందః ప్రయోగము — రావూరి దొరస్వామిశర్మ
150 1982 శ్రీమద్భాగవతము-శ్రీవిద్య — తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు.

109 నుండి 149 వరకు గల వ్యాసాలన్నీ పంచశతి ఉత్సవాల సందర్భంగా తిరుమల తిరుపతి దేవస్థానమువారు ప్రచురించిన "పోతన భాగవత నీరాజనము" నుండి గ్రహింపబడ్డాయి.

151 1982 పుణ్యశ్లోకుడు పోతన — అమరేశం రాజేశ్వరశర్మ — సప్తగిరి, (ఏప్రిల్) పు: 4, 46

అముద్రిత వ్యాసాలు:

1 ఆంధ్ర సాహిత్యంపై పోతన ప్రభావం – తూమాటి దోణప్ప.
2 వర్తమాన సమాజంలో పోతన భాగవతావశ్యకత – డా. కొత్తపల్లి వీరభద్రరావు.
3 ఆంధ్ర భాగవతం- పోతన వ్యక్తిత్వం – అమరేశం రాజేశ్వరశర్మ.
4 దృశ్యకళలపై పోతన భాగవత ప్రభావం – పి.యస్.ఆర్. అప్పారావు.
5 భాగవతము - జాతీయ సమైక్యత – పి.వి నరసింహారావు.

ఈ అయిదు వ్యాసాలు డా. కోవెల సుప్రసన్నాచార్యులు గారివద్ద వున్నాయి.

6 తెలుగులో ఇతర భాగవతములు — రవ్వా శ్రీహరి.

7 పోతన భాగవతము - వివిధ సంస్కరణలు — నిడుదవోలు శివసుందరేశ్వరరావు

8 పోతన భాగవతం — అమూలక రచన — బయ్యా సూర్యనారాయణ.

9 'ఇమ్మనుజేశ్వరాధములు' — బండారు సదాశివరావు.

10 పోతనగారి కవితా సిద్ధాంతం — సంపత్కుమారాచార్య.

11 పోతనగారు — బి. రామరాజు.

12 రుక్మిణీ కల్యాణం - ప్రతీకాత్మకత — సుప్రసన్నాచార్య.

13 పోతన భాషాప్రయోగములు — జాస్తి సూర్యనారాయణ.

14 పోతన భాగవతం- శాస్త్రపాండితి— జి వి యస్.యస్. సోమయాజులుశర్మ.

ఈ తొమ్మిది వ్యాసాలను ఆంధ్రప్రదేశ్ పౌరసంబంధ శాఖవారు ప్రచురిస్తున్నట్లు డా. కోవెల సంపత్కుమారాచార్యులుగారు చెప్పారు.

6–1–1982 పంచశతి ఉత్సవ సంపాదకీయాలు

1 మార్చి బమ్మెర పోతరాజొకడు (డా. కోవెల సంపత్కుమారాచార్య) ... సాధన.

2 మార్చి పంచనాశ్రిత ఉత్సవాలు ... సృజన.

3 మార్చి సంపాదకీయం ... అరుణతార.

4 మార్చి 14 పోతన సంస్మరణ ... ఆంధ్రప్రభ

5 మార్చి 16 పోతన జీవనగీతంలో నీతి ... విశాలాంధ్ర

6 మార్చి 17 పోతన ఆదర్శం ... ప్రజాశక్తి.

6–2–1982 పంచశతి ఉత్సవ వార్తాశీర్షికలు

1 మార్చి 4 ... పోతన పంచశతి ఉత్సవ సన్నాహాలు — ఈనాడు.

2 మార్చి 12 ... 13 నుంచే పోతన ఉత్సవాలు ప్రారంభం —ఆంధ్రప్రభ.

3 మార్చి 14 ... పోతన పంచశతి మహోత్సవములు 14–3–2182 నుండి 18–3–1982 కార్యక్రమ వివరం — జనధర్మ.

4 మార్చి 14 ... బమ్మెరలో వెలిగిన ఉత్సవ జ్యోతి — జనధర్మ.

5 మార్చి 14 ... నేటినుంచి పోతన పంచశతి ఉత్సవాలు -- ఈనాడు.

6 మార్చి 15 ... 'మందార మకరందకవి' పోతనకు పంచశతి ఉత్సవంలో నివాళులు — ప్రజాశక్తి.

7 మార్చి 15 ... తెలుగు భాషపై చెరగని ముద్రవేసిన పోతన — ఆంధ్రజ్యోతి.

8 మార్చి 15 ... కసాయి రాజులపై తిరుగుబాటుకు ప్రతీక మహాకవి పోతన — విశాలాంధ్ర.

9 మార్చి 15 ... తెలుగు సాహిత్యానికి ఊపిరిపోసిన పోతన —ఈనాడు.

10 మార్చి 15 ... కవిత్వంతో తెలుగుజాతిని చైతన్యవంతం చేసిన పోతన — ఆంధ్రభూమి.

11 మార్చి 15 ... ఉండంత భావానికి కొండంత అర్థం పోతన—ఆంధ్రప్రభ.

12 మార్చి 15 ... "పోతన కవిత్వం అజరామరం"— పంచశతి ఉత్సవాల్లో హిదయతుల్లా, అబ్రహాం ప్రశంస — ఆంధ్రపత్రిక

13 మార్చి 16 ... పోతన పంచశతి ఉత్సవాల నిర్వాహక కార్యనివేదిక — వరంగల్ వాణి.

14 మార్చి 16 ... భారతీయ తాత్విక చింతనకు ప్రతీక భాగవతం — ఆంధ్రజ్యోతి.

15 మార్చి 16 ... "ఆసేతు సీతాచలం వెల్లివిరిసిన భాగవత సంప్రదాయం" —పి. వి వరంగల్ వాణి.

16 మార్చి 16 ... శేషేంద్రశర్మ "'మాట్లాడే జాతీయ మహాయజ్ఞానికి ఇద్దరు సదాశివరావుల సమాధానాల చురకలు — — వరంగల్ వాణి.

17 మార్చి 16 ... పోతన పంచశతి ఉత్సవాల్లో రసరాగ రంజితంగా సాంస్కృతిక ప్రదర్శనలు, — వరంగల్ వాణి.

18 మార్చి 16 ... పోతన భాగవతతత్వం : భావ సమైక్యత— జాతి సమైక్యత — వరంగల్ వాణి

19 మార్చి 16 ... భారతీయ ఆధ్యాత్మిక జీవితంపై భాగవత ప్రభావం — వరంగల్ వాణి.

20 మార్చి 17 ... భావసమైక్యతా సేతువు, కవితాసింధువు పోతన — ప్రజాశక్తి.

21 మార్చి 18 ... ప్రథమ సత్యాగ్రహి "ప్రహ్లాదుడు" — ఆంధ్రప్రభ.

22 మార్చి 18 ... పోతన ఉత్సవాల సదస్సులో వాగ్వాదాలు-ఆంధ్రజ్యోతి.

23 మార్చి 19 ... "బాలరసాలము కురిసిన బంగారపు పూలజల్లు ఓరుగల్లు" —బమ్మెర కోకిలకు అక్షర నీరాజనం — వరంగల్ వాణి.

24 మార్చి 19 ... 'శ్రుతి' చెప్పిన సనాతన ధర్మం— మానవసేవే మాధవ సేవ — వరంగల్ వాణి.

25 మార్చి 31 ... పోతన భాగవత విశిష్టతపై దివాకర్ల వివరణ — ఆంధ్రభూమి.


## 6–3–1982 హిందీలో వాఙ్మయ విమర్శనలు


1 1982 పోతన ఔర్ శ్రీమద్ అంధ్ర భాగవత్ — శ్రీ వియోగి హరి — ప్రచురణ: పోతన్న భాగవత పంచశతి మహోత్సవ సమితి, వరంగల్లు — పుటలు: 16.


## 6–4–1982 ఇంగ్లీషులో వాఙ్మయ విమర్శనలు


1. 1829 Pota Raju – Kavali Venkata Rama Swamy — Biographical Sketches of The Dekkan Poets – Pages: 73,74 The Nellore (1975) Edited by Dr. C.V. Ramachandra Rao.

2. 1839 Potana – C.P. Brown – Essay on Telugu literature.

3. 1913 Potana The celebrated Telugu Bard — P. Kesava Pillai. The Hindu, August 27.

4. 1921 Potana – P. Narasimham — Article in Encyclopedia of Madras Presidency and Adjacent States.

5. 1924 Potana – T. Rajagopala Rao – A Historical Sketch of Telugu Literature, Christian College Magazine, (Madras).

6. 1927 Bammera Potanamatya – Prof: K. Ranga Chary — Sir Asuthosh Mukherjee Silver Jublee Volume orientalia Volume 3 Part 3 Pages 180–209.

7. 1928 (?) 1930 (?) Potana — P. Chenchiah and Raja. M. Bhujanga Rao Bahadur — A History of Telugu Literature - Pages 63-65. The Heritage of India Series, Calcutta.

8. 1939 Potana — Rayaprolu Subba Rao. Leaders and Landmarks in Telugu Literature - Triveni, April 1939 to April 1940.

9. 1944 Potana — P.T. Raju - Telugu Literature.

10. 1959 Potana - ? — Indian Literature Page 78

11. 1972 Potana - Divakarla Venkatavadhani, Sahitya Akadamy, Delhi. Pages. 98.

12. 1982 Impact of the Bhagavata cult on the Spritual life of India - Dr. T.M.P. Mahadevan (Madras).

13. 1982 Impact of Bhagavata cult on Indian Aesthetics — Dr. K. Krishna Murthy (Dharwad)

14. 1982 Impact of Bhagavata on the Cultural Life of India - C. Sivaramamurthy, (New Delhi).

## 8. పోతన జీవితం మీద వచ్చిన సృజన రచనలు

1 ? భాగవత మహిమ (కథ) పానుగంటి లక్ష్మీనరసింహారావు, సాక్షి సంపుటం ? పు: ? ఈకథ నిడుదవోలు వెంకటరావుగారి పోతన పుస్తకంలో పోతన భాగవత మహాత్మ్యము (పు;192-198) అనే పేరుతోవుంది. ఈకథ 19-3-1982 ఆంధ్రపత్రికలో ఇదే పేరుతోనూ (28-'8) 17-3-1982 ఆంధ్రప్రభలో కామధేనువు అనే పేరుతోనూ (పు: 40-47) అచ్చయింది. సాక్షినుండి సంగ్రహించాము అని వెంకటరావుగారిచ్చినట్లే ప్రభలోనూ ఇచ్చారు.

---

సూచన :— 2 4, 5, 8, 9, 10 సంఖ్యలు గల ఆకరాలకు నిడుదవోలు వెంకటరావుగారి పోతన (పు: 230) ఆధారం. 12, 13, 14 సంఖ్యలుగల ఆకరాలు పంచశతి ఉత్సవాలలో చదువబడ్డ వ్యాసాలు. నిజానికివి సంస్కృత భాగవతానికి సంబంధించిన విమర్శన వ్యాసాలే అయినా తెలుగు భాగవత విషయ అధ్యయనానికి కూడా పనికివస్తాయనే ఉద్దేశంతో ఇక్కడ పేర్కొనటం జరిగింది.

2 1919 (?) మహాకవి పోతన (కవిత) - రాయప్రోలు సుబ్బారావు - మిశ్ర మంజరి, పు: 42–44.

3 ? పోతన (హరికథ) – కరుణశ్రీ (అముద్రితం).

4 1929 శ్రీ బమ్మెర పోతనామాత్య విజయము (హరికథ) – వారణాసి రామయ్య (ప్రచురణ: గోలకొండ ముద్రాక్షరశాల హైదరాబాదు).

5 1936 భాగవతావతరణము (నాటిక) –నోరి నరసింహశాస్త్రి, ప్రచురణ ప్రతిభ– (చూడు: వ్యాసరచనల సూచి, పు: 1348).

6 1940 హాలికుడు (నాటకం) చెలమచర్ల రంగాచార్యులు.

7 1940 పోతన స్మరణము–వంశవృక్షం (పద్యాలు) శేషాద్రిరమణ కవులు*

8 1947 భక్తపోతన (నాటకం) అయ్యగారి విశ్వేశ్వరరావు.

9 1952 మహాకవి పోతన (కవిత) జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ). ఉదయశ్రీ మొదటిభాగం, (11వ ముద్రణం).

10 1952 మహాకవి పోతన (హరికథ) – కూచిభొట్ల కోటేశ్వరరావుగారు చెప్పినది డిసెంబరు 5న ఆకాశవాణి నుండి ప్రసారితమయింది.

11 1953 భక్తపోతన (హరికథ) కేశవతీర్థస్వామి, ప్రచురణ: శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల. (సాహిణి ప్రెస్, విజయవాడ).

12 1957 భక్తపోతన (హరికథ) ప్రయాగ నరసింహశాస్త్రిగారు చెప్పినది ఫిబ్రవరి 27న ఆకాశవాణి నుండి ప్రసారం చేయబడింది.

13 1960 బమ్మెర పోతనామాత్యుడు (కథ) – జీడిగుంట రాఘవేంద్రరావు –కవులను గూర్చిన కథలు, పు: 20–24.

14 1961 పోతన (హరికథ) – కూచిభొట్ల కోటేశ్వరరావుగారు చెప్పినది అక్టోబరు 20న ప్రసారం చేయబడింది.

15 1962 పోతన (కావ్యం) పోలూరి ఆంజనేయప్రసాద్

16 1966 పోతన చరిత్రము (మహాకావ్యము) వానమామలై వరదాచార్యులు.

17 1974 శ్రీ బమ్మెర పోతనామాత్యులు (నవల) తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, శారదా గ్రంథమాల, 11 హనుమాన్ కోవెలవీధి పశ్చిమ మాంబళం, మద్రాసు 33.

---

* తెలుగు వైతాళికులు (సంపుటము III) పు : 129, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు (1979)

18 1974 పోతన చరిత్రం ( హరికథ ) సి. లక్ష్మీనరసింహాచార్యులుగారు చెప్పినది అక్టోబరు 6న ఆకాశవాణి నుండి ప్రసారం చేయబడింది.

19 1976 బమ్మెర పోతన ( 29 పద్యాలు) — కొండేపూడి సుబ్బారావు, కావ్యాంజలి (ఖండకావ్యం) పు: 45-51.

20 1982 నమస్కారం పోతన్నగారూ ! ఒక్కమాట (ఊహాగోష్ఠి) - కరుణశ్రీ, ఆంధ్రజ్యోతి 14 మార్చి.

21 1982 బమ్మెర తమ్మెరలు (7 పద్యాలు) —డా. దాశరథి. ఆంధ్రజ్యోతి 14 మార్చి.

22 1982 పలికించెడువాడు (కథ) డాక్టర్ సుప్రసన్నాచార్య, ఆంధ్రపత్రిక 17 మార్చి, పు: 13-16.

23 1982 హాలికకవి (4 పద్యాలు) భండారు సదాశివరావు. సాధన (మార్చి) పు: 34.

24 1982 పోతన శ్రీనాథులను బావమరుదులుగా చిత్రించిన కథలు (చాగంటి శేషయ్యగారి ఆంధ్ర కవితరంగిణి నుండి సేకరించినవి)— ఆంధ్ర పత్రిక 19 మార్చి. పు: 51-52.

25 చలనచిత్రాలు *

---

2, 3, 8, 9, 10, 12, 16 సంఖ్యలు గల హరికథా రచనలు తూమాటి దోణప్ప గారి తెలుగు హరికథా సర్వస్వం (1978) అన్న పుస్తకం ఆధారంగా యివ్వబడినవి. చూడు- పు: 584, 574, 587, 563, 590, 574, 604.

ఒక సూచన : పోతనను స్తుతించిన పూర్వకవులను ఏర్చూరి సింగనతో మొదలుపెట్టి ఆధునికులలో విశ్వనాథ సత్యనారాయణగారి వరకు మొత్తం 76 మంది కవుల స్తుతులను గూర్చి నిడుదవోలు వెంకట్రావుగారు చెప్పారు.

చూడు : పోతన, పు: 198 -- 214, తనతో కలుపుకొని మరి ఏడుగురు రచించిన పద్యస్తుతులను గూడా వెంకట్రావుగారు పేర్కొన్నారు.

* పోతన జీవితం ఆధారంగా తెలుగులో రెండు చిత్రాలు నిర్మింపబడ్డాయి. ఒకటి చిత్తూరు నాగయ్య పోతనగా నటించినది. రెండవది గుమ్మడి వెంకటేశ్వరరావు పోతనగా నటించినది.

## 9. పోతన తరువాత తెలుగు భాగవతాలు[1]

**1** హరిభట్టారకుడు – (1470 - 1550)

"......భాగవతమం దేకాదశ ద్వాదశ
స్కంధంబుల్ తెనిఁగింతుఁ బూర్వకథిత స్కంధాను సారంబునన్"

పోతన్నగారి తరువాత వెలిగందల నారయ్య భాగవతంలోని చివరి రెండు స్కంధాలూ వ్రాసి పూర్తిచేశాడు. ఇప్పుడు ప్రచారంలో వున్న పోతన భాగవతం నారయ్య రచనలతోనే పూర్ణంగావుంది. హరిభట్టారకుడు నారయ్య వ్రాసిన ఈరెండు స్కంధాలను తాను ప్రత్యేకంగా తిరిగి వ్రాశాడు. పోతన్నగారి భాగవత రచనకు నారయ్య రచన సమఉజ్జీగా లేదనిపించి తానాలోటును పూరించటానికి అట్లా ఆ రెండు స్కంధాలు వ్రాసి వుండవచ్చు. తాను రచించిన రెండు స్కంధాలతోనే పోతన్నగారి భాగవతం పరిపూర్ణం కావాలన్న హరిభట్టారకుని ఆలోచనకు నిదర్శనంగా కొన్ని పోతన భాగవత తాళపత్ర గ్రంథాలు[2] నారయ్య రచనతోకాక హరిభట్టు రచనతో పూర్తి అవుతున్నాయి.

అయితే హరిభట్టు భాగవత షష్ఠస్కంధం కూడా వ్రాశాడు. అంటే ఏర్చూరి సింగనచేత పూర్తిగా వ్రాయబడ్డ భాగవత షష్ఠస్కంధం తరువాత హరిభట్టు

---

1. మడికి సింగన దశమస్కంధాన్ని ద్విపదలుగా వ్రాశాడు. కాలాన్నిబట్టి చూస్తే సింగన్న పోతనకంటె ముందే వుంటాడు. అయితే ఆయన దశమస్కంధం వ్యాస భాగవతానికి తెలుగుకాదు అని అంటారు. చూడు: నిడుదవోలు వెంకట రావుగారి పోతన. పు: 219.

   మడికి సింగన ద్విపద భాగవతాన్ని పోతన భాగవతంతో పోల్చిచూస్తే దశమ స్కంధం పూర్వభాగం లోని మొదటి 1230 గద్యపద్యాల విషయం సింగన భాగవతంలో లేదు. అక్రూరుడు రామకృష్ణులను మధురకు తీసుకొని రావటం నుండి ధర్మరాజు రాజసూయంలో శిశుపాల వధ జరిగినంత వరకు ఉన్న దశమ స్కంధ విషయం మాత్రమే సింగన తన భాగవతంలో కొంత అటు ఇటుగా వ్రాశాడు— మడికి సింగన ద్విపద భాగవతమే పోతన భాగవతంకంటె ముందు వ్రాయబడిందని మరొకరు కూడా అంటారు. చూ. శ్రీవాశిష్ఠ అ. మహదేవశాస్త్రి గారు పరిష్కర్తగా 1950 లో వెలువడ్డ తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణ ఉపోద్ఘాతం, పుట 111

2. R.No. 681. A Triennial Catalogue of Manuscripts. Volume IV Part 3 Telugu.

వ్రాసివుంటే సింగనకంటె కూడా తానుబాగా వ్రాయగలనని అనుకొని వ్రాసివుండాలి. కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి లాంటి పరిశోధకులు హరిభట్టు రచనకంటె సింగన షష్ఠస్కంధ రచన 'యెంతేని మేలికరముగా నున్నద'ని[3] అభిప్రాయపడ్డారు.

"......భాగవత పౌరణీయమైనట్టి షష్ఠస్కంధంబు తెనుంగు జేసెదను కృష్ణ ప్రీతిగా—"[4] నని వ్రాసుకొన్నాడు గనుక ఆ స్కంధాన్ని పూరీ జగన్నాథస్వామికి అంకితమిచ్చాడని అర్థం. ఏకాదశ ద్వాదశస్కంధాలను ఆంజనేయస్వామికి అంకితం చేశాడు.

"మారుత సుతుడట కృతిపతి
పారీణత భాగవతము పలికెడిదట ! యీ
సారస్య మిచట గలుగగ
వేరొక మార్గమునబోవు వెట్టియు గలడే"— ఈ పద్యం చూడగనే పోతన్న గారి పలికెడిది భాగవతమట అనే పద్యం గుర్తుకు వస్తుంది[5] హరిభట్టు తనకృతులను నరాంకితాలు చేయకపోవటానికి కారణం ఆలా చేసినందువల్ల వచ్చిన పాపాన్ని పోగొట్టుకోవడానికని చెప్పుకొన్నాడు. పోతన్నగారు ఇట్లా చెప్పుకోలేదు. అసలు పోతన భోగినీ దండకాన్ని సింగభూపాలుని వ్యక్తిగత జీవితాంశ మొకటి తీసుకొని వ్రాశాడేగానీ అది ఆ ప్రభువుకు అంకితమని ఎక్కడా చెప్పుకోలేదు. హరిభట్టు మాత్రం తన వరాహ పురాణాన్ని కొలిపాక ఎఱ్ఱయగారనే ఖమ్మంమెట్టు కరణానికి అంకితమిచ్చాడు. అది మహాపాపమని తరువాత తెలుసుకొని తత్పరిహారంగా కృతులను దైవాంకితాలుగా చేశాడు. మత్స్యపురాణాన్ని - విష్ణుధర్మోత్తరంబు - రంగనాథ స్వామికి అర్పిస్తూ వ్రాసిన సీసపద్యంలో "ధనమునకై నరాధముల సన్నుతి సేయ

---

3 మీగడ తఱకలు (1951) పు: 82

4. ఆంధ్ర కవితరంగిణి, సంపుటం 8, 172 - 173

5. అక్కిరాజు ఉమాకాంతంగారి "ఆరవ దేశమునందలి యాంధ్ర వాఙ్మయము"— ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటం 2, సంచిక 1, పు: 76 పోతన్నగారి పద్యం చూడగానే పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర దీక్షా ప్రకరణం లోని "బసవలింగము కృతిపతియటె కృతియు రసికత పండితారాధ్య చరిత్రమటె పాల్కురికి సోమనార్యుడు సుకవియటె కథాశ్రోత సూరామాత్యుడట్టె" అన్న పంక్తులు గుర్తుకురావాలి.

బొదమిన పాపముల్ చెడుటకొరకు" ఈ పనిచేస్తున్నట్లు వ్రాశాడు హరిభట్టు. భాగవత షష్ఠస్కంధంలో కూడా "ఎడపక విష్ణునింబొగడ నెన్నడు నొల్లక దుష్కృదంబునం, గడుపులకై నరాధముల కావ్యముఖంబుల సన్నుతింపగా, బొదమిన పాపజాలముల పొట్టణగం బొలయించి ముక్తిబొందెడు కొఱకై రచింతు కృతి నీలగిరీంద్రునికర్పితంబుగా" అని వ్రాసుకొన్నాడు [1] కృతిని నరాంకితం చెయ్యడ మరొక పెద్దపాపంగా 15వ శతాబ్దం నుండి తెలుగులో ప్రచారమైంది. పోతనగారు వ్రాయకపోయినా ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి అన్నపద్యం తెలుగులో నరులకు ముఖ్యంగా నరేశ్వరులకు కావ్యాలు అంకితం చేయటానికి కొందరిలోనైనా వ్యతిరేకమైన మనోనిశ్చయాన్ని ప్రసాదించిందనే చెప్పాలి.

2 సర్వన

ఈతని భాగవత షష్ఠస్కంధములోనివని కొన్ని పద్యాలు ప్రబంధరత్నావళీయను సంకలన గ్రంథంలో కనిపిస్తున్నాయని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు.[2]

3 రాచమల్లువారు

రాచమల్లువారి కవుల షష్ఠమని, శృంగార షష్ఠమని, 16, 18 శతాబ్దాల మధ్య గల లక్షణ గ్రంథాలలో కొన్నిపద్యాలు వున్నాయనీ అవి భాగవత షష్ఠస్కంధానికి సంబంధించినవని నిడుదవోలు వెంకటరావుగారు ఇరవై పద్యాలకు పైగా ఉదాహరించాడు. రాచమల్లువారంటే నంది మల్లయ్య, ఘంట పింగయ్య అని నిడుదవోలు వారూహించటానికి ఆధారమేమిటో తెలయదు.[3]

భాగవత షష్ఠస్కంధాన్ని ఏర్చూరి సింగన్న, హరిభట్టు సర్వన్న, రాచమల్లు కవులు మొత్తంమీద నలుగురు వ్రాసినట్లు తెలుస్తున్నది. ఇద్దరి గ్రంథాలు లభించనే లేదు హరిభట్టుది ముద్రితం కానేలేదు. ఒక్క సింగన్న వ్రాసిన షష్ఠస్కంధమే పోతనగారి భాగవతంతో కలిపి కనబడుతున్నది.

---

1. పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు – భక్తకవి పుంగవులు. పు: 244.
2. మీగడ తఱకలు (1951) పు: 83.
3. పోతన పు: 174.

4 సంజీవరాయడు

నందవరం కృష్ణయామాత్యుని కొడుకు. ఈయన భాగవతంలోని ఏకాదశ స్కంధాన్ని ఒక్కదాన్నే ఆశ్వాస విభజనతో వ్రాశాడు. గ్రంథం పూర్తిగా లభించలేదు.[1]

5 వీరరాఘవుడు

గంగావఝ్ఝుల వీరరాఘవ కవి బాలకృష్ణ భాగవతము అనే పేరుతో భాగవత కథను తొమ్మిది ఆశ్వాసాలుగా పదరచన చేశాడు. గ్రంథం మధ్యలో ముగుస్తున్నందువలన పూర్తికావటానికి ఇంకా ఎన్ని ఆశ్వాసాలున్నవో తెలియటంలేదు.[2]

6 శరభరాజు

ఇతని పేరుతో భాగవతాభ్యుదయము అనే కృతి కనిపిస్తున్నది.[3]

7 రంగశాయి

ఏకుమళ్ళ రంగనాయకవి భాగవతాన్ని ద్విపద ప్రబంధంగా వ్రాశాడు.[4]

8 రంగాజమ్మ

తంజావూరు విజయరాఘవ నాయకుని ఆస్థానకవయిత్రి పసుపులేటి రంగాజమ్మ 'భాగవత సంగ్రహము'ను వ్రాసింది.[5]

9 వెంగమాంబ

తరిగొండ వెంగమాంబ భాగవతాన్ని ద్విపదలుగా తెనుగు చేసింది.[6] వెంగమాంబ ద్విపదలు పోతన చంపూరచనను అనుసరించి ఉండును అని నిడుదవోలు వారంటారు.[7]

1. R No. 670 A Triennial Catalogue of Manuscripts Vol IV Part 3.
2. R.No. 621 ,, ,, ,, ,, ,,
3. R.No. 539 ,, ,, ,, ,, ,,
4. No. 762 A Descriptive Catalogue of Manuscripts Vol II Part 2.
5. నిడుదవోలు వెంకటరావు— దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము (1960) పు: 133.
6. No. 1437. A Descriptive Catalogue of Manuscripts Vol VI.
7. పోతన పు: 219.

10 కోనేరు నాథుడు

దోనూరి కోనేరునాథకవి. ఈయన రచించిన ద్విపద భాగవతానికి బాలభాగవతమని పేరు.[1]

11 పట్టాభిరామయ్య

కోపూరి పట్టాభిరామయ్యగారు భాగవత దశమ ఏకాదశ ద్వాదశస్కంధాలను మూలానుసారంగా చంపూపద్ధతిలో తెనుగు చేశాడు.[2]

12 సింగరాచార్యులు

నంపన్ముడుంబ సింగరాచార్యులు దశమ ఏకాదశ ద్వాదశస్కంధాలను, ప్రథమ ద్వితీయ పంచమస్కంధాలను తెనుగు చేశాడు. తృతీయ చతుర్థ షష్ఠ సప్తమ అష్టమ నవమస్కంధాలను ఎందుకు చేయలేదో తెలియదు.[3]

13 దొడ్లా వెంకటరామిరెడ్డి

ఈయన రచన 'దొడ్లా భాగవతము' అనుపేర ప్రచురింపబడింది.

14 లక్ష్మీనృసింహ కవి (1952)

మాదిరాజు లక్ష్మీనృసింహకవి, కర్నూలు జిల్లా- మిడుతూరు గ్రామానికి చెందిన ఈయన పోతన భాగవతాన్ని ఆధారంగా చేసికొని శ్రీమదాంధ్ర గేయ మహాభాగవతము వ్రాశాడు. పాదానికి ముప్పైరెండు మాత్రలు, నాలుగు మాత్రల గణాలు, నాలిగింటిమీద యతిని గాని ప్రాసయతిని గాని పాటిస్తూ రచించాడు. ప్రతి రెండు పాదాలకు ప్రాస నియమాన్ని కూడా పాటించాడు. మొత్తంమీద ఈ గేయ మహాభాగవతం ద్విపద లక్షణాలు, రగడ లక్షణాలు కలిగివున్నట్లు కనిపిస్తుంది.

1949 నుండి ముద్రణ కాకపూర్వమే ఈ గేయ భాగవతం ఆ ప్రాంతంలో ప్రచారంలో వుందట. హరికథలకు, భజనలకు కూడా ఈ గేయరచన అనుకూలంగా వున్నదంటారు. తాళలక్షణ యుతంగా వ్రాయబడ్డ ఈ గేయ భాగవతాన్ని 1952 లో విజయవాడ ఏలూరు రోడ్డులోని నటరాజ పబ్లికేషన్స్‌వారు ప్రచురించారు. గ్రంథం మొత్తం అచ్చువేశారో లేదో తెలియదుగానీ దశమ ఏకాదశ ద్వాదశస్కంధత్రయ సంపుటాన్ని చూచి ఈ విషయాలు వ్రాయటం జరుగుతున్నది.

15 శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (1952)

"పోతనగారి భాగవతము నందున్న మూలాతిక్రమణములను, వ్యత్యయ వినిమయాదులను సవరించి వ్రాయవలయునన్న" అభిప్రాయంతో కృష్ణమూర్తిశాస్త్రి గారు భాగవతాన్ని 'శ్రీకృష్ణ భాగవతము' అనే పేరుతో రచించి ప్రచురించారు.

---

1. No. 1013. A Descriptive Catalogue of Manuscripts Vol IV.
2, 3 — నిడుదవోలు వెంకటరావు, పోతన- పు: 182.

16 మిన్నికంటి గురునాథ శర్మ (1952)

ఏకాదశ ద్వాదశస్కంధాలను 'శ్రీమద్గురు భాగవతము' అను పేరుతో తెనుగు చేసి తెనాలి నుండి ప్రచురించారు. వెలిగందల నారయ్య చేసిన ఏకాదశ ద్వాదశ స్కంధ రచన సంస్కృత భాగవతంతో పొత్తు కుదురకుండా వున్నందున తామీరచన చేయవలసి వచ్చిందని శర్మగారు వ్రాసుకొన్నారు.

17 జనమంచి శేషాద్రిశర్మ

దశమస్కంధాన్ని మాత్రమే ఈయన తెనుగు చేశాడు దీనికి 'తాండవకృష్ణ భాగవతము' అనిపేరు.

18 శ్రీరామ నృసింహమూర్తి కవులు (1955)

గంధం శ్రీరామమూర్తి, ఇజ్జింకి నరసింహమూర్తి అనే జంటకవులు మొత్తం పన్నెండుస్కంధాల భాగవతాన్ని తెలుగుచేసి ప్రచురించారు.

19 బులుసు వెంకటేశ్వరులు (1968)

నిర్వచనంగా భాగవతాన్ని తెనుగుచేసి కాకినాడ నుండి ప్రకటించాడు.

20 కల్లూరి విశాలాక్షమ్మ (1968)

మొత్తం భాగవతాన్ని సంగ్రహంగా రచించి రాజమండ్రి నుండి ప్రచురించింది. ఈమె శ్రీపాద కృష్ణమూర్తిగారి కూతురు.

21 సీతారామరావు

భాగవత కథాలహరి అనుపేర ద్రోణంరాజు సీతారామారావుగారు భాగవతాన్ని తెలుగులో వ్రాశారు.

22 తెలుగు వచన భాగవత రచయితలు.[1]

1. శతఘంటం వెంకటరంగశాస్త్రి
2. నోరి గురులింగశాస్త్రి
3. కేతవరపు వెంకటశాస్త్రి
4. ద్రోణంరాజు వెంకటాచలపతిశర్మ
5. విష్ణుపాదకవి
6. భాగవతాన్ని వచనంగా వ్రాసిన వాళ్ళల్లో కుందుర్తి వెంకటాచలకవిని (1730) ముందుగా చెప్పవలసివున్నా ఆయన గ్రంథం లభించకపోవటం చేత ఇలా చెప్పవలసివస్తున్నది.[2]



---

1. నిడుదవోలు వెంకటరావు — పోతన, పు. 219-220.
2. No 645 A Descriptive Catalogue of Manuscripts Vol II Part II. మరియు చూడు: నిడుదవోలు వారి పోతన, పు: 219.

# చేర్పులు

—s—

1. 24 వ పుట,

75 A. 1980 – శ్రీమద్భాగవత పురాణ పరిశీలనము – డి. నాగసిద్ధారెడ్డి,
ప్రచురణ : తిరుమల తిరుపతి దేవస్థానము, పుటలు 63.

2. 24 వ పుట,

77 A. 1981 – పోతన సంస్కృత ప్రయోగాలు – జాస్తి సూర్యనారాయణ,
తెలుగు కవుల సంస్కృత ప్రయోగాలు, పుటలు 4–7,
10–11, 23–25, 28–32, 41–49, 52–53,
56–58, 61–62.

3. 28 వ పుట,

152. 1982 – మడికి సింగన, బమ్మెర పోతనల భాగవత దశమ
స్కంధములు– ఒక తులనాత్మక పరిశీలన– డి. ప్రభాకర
కృష్ణమూర్తి– నవభారతి నవంబరు, పు : 15–19.

4. 31 వ పుట,

25 A. 1982 – పోతన పంచశతి ఉత్సవాలు – పడుపుకూడు, ఎం. జి.
సృజన (జూలై) పు : 49–52.

# కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ప్రచురణలు

——(౦)——

1974 విశ్వనాథ వాఙ్మయ సూచిక
విశ్వనాథ రచనలకూ వాటిమీద వచ్చిన విమర్శనలకూ
సంబంధించిన వివరాల సంపుటి. 102 పుటలు : 10–00

1976 విమర్శిని – పరిశోధన పత్రిక, 1 (కాపీలులేవు) నవ్యభావ
అభ్యుదయ కవితాదృక్పథ విమర్శన వ్యాససంచిక 134 పుటలు : 10–00

1977 రత్నాపణము.
డిగ్రీ తరగతుల మొదటి భాగం తెలుగు పాఠ్యం. 1–00

1977 విమర్శిని – 2
విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక. 427 పుటలు : 25–00

1978 విమర్శిని – 3
తెలుగు నవలా వికాస విమర్శన సంచిక. 180 పుటలు : 10–00

1979 విమర్శిని – 4
రాయప్రోలు వాఙ్మయ జీవిత విశేష సంచిక. 138+45 పు : 10–00

ముక్తావళి
డిగ్రీ తరగతుల మొదటిభాగం తెలుగు గద్యపాఠ్యం : 5–50

రత్నావళి
డిగ్రీ తరగతుల మొదటిభాగం తెలుగు పద్యపాఠ్యం : 4–00

1980 విమర్శిని – 5
వివిధ విషయ వాహిని. 10–00

1982 ప్రాచీన పద్యమంజరి (1982-85) 3–00

1982 ఆధునిక పద్యమంజరి „ 3–00

1982 గద్యమంజరి „
డిగ్రీ తరగతుల మొదటిభాగం తెలుగు పాఠ్యాలు. 3–50

1981-82 విమర్శిని – 6 & 7
పోతన వాఙ్మయ జీవిత విశేష సంచిక. 140 పుటలు : 10–00